భారతీయ జానపద సంస్కృతి

# ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్యము, సంస్కృతి

బి. రామరాజు

అనువాదం

నాయని కృష్ణకుమారి




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ముఖచిత్రం  బుర్రకథ, ఆంధ్రప్రదేశ్ జానపద కథాగాన ప్రక్రియ

ISBN 81-237-3412-3

---

ప్రథమ ముద్రణ 2001 (శక 1923)

Folklore of Andhra Pradesh *(Telugu)*
**రూ 50-00**
డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్కు,
న్యూఢిల్లీ-110 016 ద్వారా ప్రచురింపబడినది

---

# విషయ సూచిక

# 1

# ఆంధ్రభూమి, ఆంధ్ర ప్రజలు

ఏదైనా ప్రజయొక్క నీతి నియమాలు ఆ జాతి జనసామాన్యపు సంస్కృతి, ఆచార వ్యవహారాలు, జీవిత విదానం, ఒకరి నుంచి ఒకరికి నోటిమాట ద్వారా వ్యాపించే సాహిత్యము, సంగీతము, నృత్యము, కళలు, వినోదాల మీద ఆదారపడుతాయి ఈ విషయాన్ని సమగ్రంగా చూస్తే ఇందులో అనేకం ఉన్నాయి జానపద కళలు అయత్నంగాను, ప్రగాడంగాను మనలను ప్రబావితం చేస్తాయి

బారత గ్రామీణులలో స్వాబావికంగానే ఐహికాలోచనలు, సాంకేతికాలు ఉన్నాయి పట్టణాల్లో పెరిగినవారికే వీటిమీద విశేషాదికారం పరిమితం కాలేదు గ్రామ ప్రజల వైఖరులు, విశ్వాసాలలో ఈ సాంకేతికాలు అంతర్భాగం జానపద కళల అద్యయనంతో ఒక జాతికి గల సంస్కృతీ సంక్లిష్టతను అంచనా వేయగలుగుతాము మానవతా దశ మనకు ఉత్సాహాన్ని కల్పిస్తుంది

అమాయక ప్రజలు దేశవ్యాప్తంగా ఉన్నారు అడవులలోని ఆటవికులు, పర్వత శ్రేణులలోని కొండజాతులు, సముద్ర తిరాల్లోని జాలరులు, నదీ లోయ ప్రాంతవాసులు, పడవ నడిపేవారు, పెద్ద పడవలలోని నావికులు వీరందరికీ ఎవరి సంప్రదాయాలు వారికి ఉన్నాయి వారు నమ్రత గలవారు సంతృప్తి గలవారు అనాదినుంచి ఆచారాలతో వారి కుటుంబ బాంధవ్యాలు ఏర్పడినాయి సర్వశక్తి గల బగవంతుని యందు వారికి అచంచల విశ్వాస ముంది సర్వాంతర్యామిలోని ఈ అచంచల విశ్వాసం చెట్లను, రాళ్ళు రప్పలను, పశువులను, నదులను, కొండలను, అడవులను, ఒక బావాన్ని, కూడా వారు ప్రేమించడంలో కనబడుతుంది

వ్యవసాయాన్ని అబివృద్ధి చేసేందుకు ప్రజలు వేటాడటం, ఆహా

సేకరణలోనే నిమగ్నమయ్యారు ఆ తర్వాత భూమిని దున్నటం ప్రారంభించారు దున్నటానికి వీలుగా భూమిని కమతాలుగా ఏర్పరిచారు కాలాన్నిబట్టి పంట పండించేందుకు ఎంతో కష్టపడి పనిచేశారు వ్యవసాయం మీద దృష్టిని పూర్తిగా కేంద్రీకరించారు విత్తనాలు, పంటలు నూర్చడంలో ఎక్కువ కాలం పట్టేది మధ్య మధ్యలో విరామం లభించేది రైతు జీవితం చాల కఠినమయినది ఆ విరామ సమయాన్ని మనోల్లాసానికి ఉపయోగించారు జీవితంలో ఉల్లాసం కోసం పాటలు పాడేవారు నృత్యం చేసేవారు పంటలు బాగా పండినప్పుడు వారి సంతోషం గానం రూపంలోను, నృత్యం రూపంలోను పరవళ్ళు త్రొక్కేది సమాజ సమావేశాలు, కుటుంబాలు కలవడం, ఉత్సవాలలో కూడా గానానికీ, సంగీతానికీ అవకాశం కల్పించాయి ఈ జానపద గేయాలు రైతుల జీవితానికి వన్నె తెస్తూ వారి వైవిద్యాన్ని, సంపూర్ణతను ప్రతిబింబిస్తాయి

అనామక జానపద గేయాలు ప్రజా జీవితాన్ని క్లుప్తంలో ప్రతిబింబిస్తాయి గ్రామ ప్రజల సంతోషాన్ని, దుఃఖాన్ని ప్రతిబింబిస్తాయి జానపద సంప్రదాయాలు, విశ్వాసాలు, జానపద కళల్లో స్పష్టమవుతూ ప్రాచీనతలో ఇమిడి మానవ స్వభావ అభివృద్ధిని చిత్రీకరిస్తాయి ఈ గేయాలు, నృత్యాలు ప్రజల రసజ్ఞానాన్ని ప్రదర్శిస్తాయి ఇవి సమాజపు సొత్తు కావడం ఇందులోని విశిష్టత ఆ గేయాలను ఎవరు వ్రాశారో తెలియదు ఒకరి నుంచి ఒకరు పాడటం ద్వారానే వాటిని నేర్చుకుంటారు

ఆంధ్ర శాతవాహనులలో హాలుడనే రాజు గొప్ప జానపద కళాకారుడని భారతదేశం చాటవచ్చు క్రీస్తుశకం మొదటి శతాబ్దంలోని ప్రారంభ దశాబ్దాలలో ఆయన నివసించారు క్రీ శ 6 నుంచి క్రీ శ 7 వరకు ఒక సంవత్సర కాలం ఆయన పాలించారు ఆనాటి సామాన్యులలో ఆయనకు ప్రగాఢమయిన ఆసక్తి గాదలు అనబడే 700 గేయాలను సంకలనం చేశారు

అన్ని హంగులతో, సంపూర్ణ అర్థాన్నిస్తూ నాలుగేసి వరుసలుండి పాడే వీలున్న దానిని గాద అంటారు ప్రతి గాదలో ప్రజల జీవితంలోని ఒకటి రెండు విషయాలు స్పష్టమవుతాయి విశిష్ట కవితా నాణ్యతతో ఈ గాదలు సహజంగానే మనస్సుకు హత్తుకుంటాయి

జానపద కళలను అపారంగా ప్రతిబింబిస్తూ, ఉండే ఈ గాదలు, వాటి రచనను బట్టి చూస్తే తమ కాలంలో విరివిగా ఉన్న వాటి నుంచి హాలుడు 700 మాత్రమే ఎన్నిక చేసినట్లు కనబడుతుంది ఈ గాదలు చిరకాలం నిలచి ఉండే చారిత్రాత్మక పత్రం అనాలి జానపద కళల అద్యయనానికి అది విజ్ఞాన కోశమనాలి ఆదునిక జానపద కళావేత్తలు ఎందు వల్లనోగానీ హాలుని గ్రందాన్ని జానపద కళలకు మూల గ్రందంగా పరిగణింప లేదు

## ఆంధ్ర పూర్వరంగము

దేశానికి, జాతికి, బాషకు ఆంధ్రమనే పేరుంది తెలుగు అనే పేరు కూడ వాడుకలో ఉంది బారత ఉపఖండంలో 22,000 చదరపు కిలోమీటర్లకు పైగా విస్తరించి 12°-41', 20° రేఖాంశాల మద్య 77°, 84°-40' అక్షాంశాల మద్య ఈ బూబాగం ఉంది తూర్పున 600 మైళ్ళ తీర రేఖ ఉంది బంగాళా ఖాతానికి పశ్చిమంగా ఈ భూమి విస్తరించింది ఉత్తరాన ఒరిస్సా, మద్య ప్రదేశ్ దీనికి ఎల్లలు దక్షిణాన తమిళనాడు ఉంది పడమరలో మహారాష్ట్ర ఉత్తరంగాను కర్ణాటక దక్షిణంగాను ఉన్నాయి

ఆంధ్రప్రదేశ్‌లో మూడు ప్రదాన ప్రాంతాలున్నాయి (1) ఉత్తర సర్కారులు లేదా కోస్తా ఆంధ్ర ఇందులో శ్రీకాకుళం, విశాఖపట్టణం, విజయనగరం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు, ఒంగోలు, నెల్లూరు జిల్లాలున్నాయి (2) రాయలసీమ లేదా దత్తమండలము ఇందులో కర్నూలు, కడప, చిత్తూరు, అనంతపురం జిల్లాలున్నాయి (3) తెలంగాణలో ఖమ్మం, నల్గొండ, వరంగల్, కరీంనగర్, మెదక్, నిజామాబాద్, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్, హైదరాబాదు, రంగారెడ్డి జిల్లాలున్నాయి ఆంధ్ర ప్రదేశ్ వైశాల్యం 276,754 చ కి మీ ఆంధ్రప్రదేశ్‌ను జనాబా ప్రాతిపదికగాను, వైశాల్యం ప్రాతిపదికగాను, బారతదేశంలోని రాష్ట్రాల్లో ఆంధ్రప్రదేశ్‌ది అయిదవ స్థానం

ఈ ప్రాంతంలో ఉత్తరం నుంచి దక్షిణం దాకా మద్య ప్రాంతంలో అక్కడక్కడా కొండలున్నాయి ఈ కొండలు రాష్ట్రాన్ని, పశ్చిమ ప్రాంతం,

తూర్పు ప్రాంతం, కోస్తా ప్రాంతంగా విడదీస్తాయి ఆంధ్రుల జీవితము, చరిత్రలో ఈ కొండలు బౌగోళిక అంతర్భాగాలు ఉత్తరాన సింహాచలం, అన్నవరం ఉన్నాయి మధ్య ప్రాంతంలో శ్రీశైలం కొండలు ఉన్నాయి దక్షిణ ప్రాంతంలో తిరుమల-తిరుపతి కొండలున్నాయి ఈ అధ్యయనంలో వాటి విశిష్టత చారిత్రకంగా లేదా పౌరాణికంగా వాటికి గల ప్రాముఖ్యత గోచర మవుతుంది కోయలు, చెంచులు, సవరులు ఇంకా అనేక కొండజాతివారు గ్రామీణ జనాబాలో ముఖ్యమయినవారు ఆంధ్రప్రదేశ్‌లోని రెండు గొప్ప నదులు గోదావరి, కృష్ణ ఇవి పడమటి కనుమలలో పుట్టి తూర్పుగా ప్రవహించి బంగాళాఖాతంలో కలుస్తాయి ఈ రెండు పెద్ద నదులేగాక తుంగబద్ర, పెన్న, ఇంకా అనేక నదులు, చిన్న చిన్న నదులు ఉన్నాయి ప్రాంతీయ చరిత్రతో వీటికి ఏదో ఒక విదంగా సంబందం ఉంది

ఆంధ్ర జాతిది అనాది చరిత్ర వేదాల్లో, పురాణాల్లో, బౌద్ధ, గ్రీకు సాహిత్యాలలో వీరిని గురించిన అనేక ప్రస్తావనలున్నాయి ఐతిరేయ బ్రాహ్మణంలో పౌండ్రులు, పులిందులు, శబరులు, మితిబ జాతి ఆదిమ వాసులు అంటే వింద్యకు ఆగ్నేయుంగా నివసించే జాతులతో పాటు ఆంధ్రులను కూడ పేర్కొన్నారు ఈ ప్రాంతంలో ఆంధ్రులు ఎక్కువగా ఉన్నారనీ, క్రమేపీ మహానదికి ఉపనది అయిన తెలీవాహ నదీలోయవైపు దక్షిణంగా తరలి వెళ్ళారనీ చరిత్రలో పేర్కొన్నారు బౌద్ధ వాఙ్మయంలో ఆంధ్రుల గురించి పేర్కొనటం ఇదే మొదటిసారి ఆ తర్వాతి గ్రందం సుత్తనిపటలో వీరు గోదావరి గట్లమీద నివాసం ఏర్పరచుకున్నట్లు గుర్తిస్తూ దానిని 'ఆంధ్ర కరాట్ట'గా పేర్కొన్నారు ఆ తర్వాత, ఆంధ్రులు దక్షిణాపదంలో నివసించేవారనీ, ముప్పైమంది రాజులు నాలుగు శతాబ్దాల పాటు పాలించారనీ పురాణాలు స్పష్టంగా పేర్కొన్నాయి దక్కను ఆగ్నేయ ప్రాంతంలో శక్తివంతమయిన ఆంధ్ర రాజులు పాలించారని మెగస్తనీసు 'ఇండిక'లో పేర్కొన్నారు ఈ పాలకుల శక్తి సామర్ద్యాల గురించిన వివరాలను ఆయన వ్రాశారు వారి సైన్యంలో 1,00,000 కాల్బలము 20,000 అశ్వబలము, 1,000 గజబలము ఉండేవి వారికి 30 కోటలు ఉండేవి వారి రాజ్యంలో అసంఖ్యాకమయిన గ్రామాలుండేవి

ఆంధ్రుల ఈ చరిత్ర శాతవాహన రాజుల వంశంతో ప్రారంభమవుతుంది వీరిని 'ఆంధ్రబృత్యులు' అని కూడా అంటారు మౌర్య సామ్రాజ్యం పడిపోయిన తర్వాత ఆంధ్ర శాతవాహనులు అదికారంలోకి వచ్చారు వారి సామ్రాజ్యము కంచి వరకు విస్తరించింది కంచిలో వారి రాజ ప్రతినిది ఉండేవాడు మొదట్లో ఈ వంశానికి దక్కను పశ్చిమ ప్రాంతం అదికార స్థానంగా ఉండేది రాజకీయ కారణాల వలన గోదావరీ ముఖద్వారం చేరుకున్నారు పెన్నారుకు ఉత్తరంలో ఉన్న దక్కను ప్రాంతం వారి అదీనంలోకి వచ్చింది క్రమేపి వారు దక్షిణాపదం మీద అదికారం సాదించారు ఆఖరు శాతవాహనుని క్రింద ఉన్న రాజ ప్రతినిది, పల్లవ వంశ వ్యవస్థాపకుడయిన వీరకుర్చవర్మకు తన కుమార్తెనిచ్చి వివాహం చేశాడు మామగారి వద్దనుంచి వీరకుర్చవర్మకు దక్షిణంలోని ప్రాంతం లబించింది దానిని ఉత్తరంగాను, పడమరగాను విస్తరించాడు

కృష్ణా ముఖద్వారం చుట్టూ ఉన్న సముద్ర తీరప్రాంతం ఇక్ష్వాకుల క్రింద ఉంది శాతవాహనులు శక్తివంతులుగా ఉన్నంతకాలం వారి ఆదిపత్యాన్ని ఇక్ష్వాకులు గుర్తించారు పురాణాలలో వారిని పర్వతేయ ఆంధ్రులుగాను, ఆంధ్రబృత్యులగాను పేర్కొన్నారు రామాయణంలో పేర్కొన్న ఇక్ష్వాకు వంశజులుగా వీరిని గురించి చెబుతున్నారు వారి స్వర్ణయుగంనాటి అవశేషాలు అప్పుడు శ్రీపర్వతమనబడే నాగార్జున కొండ చుట్టూ కృష్ణా లోయలో ఇప్పటికీ కనబడతాయి ఇక్ష్వాకుల తర్వాత 4వ శతాబ్దంలో బృహత్పలాయనులు సముద్ర తీరంలో తూర్పు ప్రాంతాన్ని పాలించారు వేంగీ ప్రాంతాన్ని ఆక్రమించిన శీలంకాయనులు వారి జ్ఞాతులు

క్రీస్తుశకం మొదటి శతాబ్దంలో, ఇప్పటి గుంటూరు జిల్లాలోని కొంత బాగాన్ని ఆనంద గోత్రజులు ఆక్రమించారు పల్లవులను దాన్యకటకంలో ఓడించి వారు చారిత్రాత్మక కీర్తి గడించారు

శీలంకాయనులు పాలిస్తున్న వేంగి దేశాన్ని, విష్ణుకుండినులు వశపరచుకున్నారు ఈ వంశంలో పేరెన్నికగల మాదవవర్మకు న్యాయపాలకులనే బిరుదుండేది

7 వ శతాబ్దం ప్రారంభంలో బాదామి చాళుక్యులు అదికారంలోకి

వచ్చారు ప్రసిద్ధ రెండవ పులకేసి, తమ్ముడు కుబ్జవిష్ణువర్ధనతో కలిసి స్థానేశ్వర్ రాజు హర్షవర్ధనుని సేనలను ఓడించారు తమ్ముడు కుబ్జ విష్ణు వర్ధనుని సైనిక సేవలను గుర్తిస్తూ రెండవ పులకేశి తూర్పున కోస్తా ప్రాంతంలో ఆయనను కళింగ నుండి నెల్లూరు వరకు విస్తరించిన రాజ్యానికి రాజ ప్రతినిదిగా నియమించారు కుబ్జ విష్ణువర్ధనుడు స్వతంత్ర రాజుగా ప్రకటించుకుని తూర్పు చాళుక్య వంశాన్ని స్థాపించారు ఈ వంశం ఆ రాజ్యాన్ని అయిదు శతాబ్దాల కాలం పరిపాలించింది చోళ వంశంలో ప్రసి ద్ధులయిన రాజరాజచోళుడు వారి రాజకీయ ఆదిక్యతకను గుర్తించారు ఆంధ్ర దేశంలో దక్షిణ జిల్లాలను పొట్టపి, రేనాడు, నెల్లూరు రాజదానులుగా గల తెలుగు చోళులు పాలించారు క్రీ శ 9 వ శతాబ్దం తర్వాత అదికారానికి వచ్చిన కాకతీయులలో చక్రవర్తి గణపతి నెల్లూరు చోళులకు బాగా సహాయం చేశారు

కాకతీయులలో ఆఖరువారయి వరంగల్‌లో ఉన్న ప్రతాపరుద్రదేవ పడిపోయిన తర్వాత 1323 లో వారి అదికారంలో ఉండిన హరిహరుడు బుక్కరాయలు, ఉత్తరాది దాడులను అరికట్టాలనే ప్రదానోద్దేశంతో విజయన గరాన్ని స్థాపించారు కోస్తా ఆంద్రలో అద్దంకి, కొండవీడు, రాజమహేంద్ర వరం రాజదానులుగా 'రెడ్డిరాజులు' పాలించారు తెలంగాణా లోతట్టున రాజకొండ, దేవరకొండల వద్ద ఒక శతాబ్దంపాటు వెలమ రాజులు పాలించా రు విజయనగర సామ్రాజ్యము రాక్షసతంగడి యుద్దంతో పతనమయిన తర్వాత తెలుగు దేశము క్రమేపీ గోల్కొండ కుతుబ్ షాహీల పాలనలోకి, ఆ తర్వాత హైదరాబాదు నిజాముల క్రిందకి వచ్చింది

ఇంగ్లండు నుంచి, ప్రాన్స్ నుంచి వచ్చిన పాశ్చాత్యులతో నౌకా వ్యాపారం ప్రారంబం కావడంతో ఈ ప్రాంతపు చరిత్రలో నూతన శకం ప్రారంబ మయింది ఈ విదేశీయులు స్దానికుల రాజకీయాల్లో జోక్యం కలుగజేసు కోవటం ప్రారంబించారు స్దానిక సంస్దానాలకు సైనిక సహాయం చేసి రాజ్యా లను తమ మద్య పంచుకొంటూ వచ్చారు గుంటూరు, కృష్ణ, గోదావరి, విశాఖ జిల్లాలతో సర్కారు ప్రాంతాన్ని, ఒక చిన్న గ్రామం యానాం (కాకినాడ సమీపంలో) మినహా, అంతటినీ నైజాం ఆంగ్లేయులకు ఇచ్చివేశాడు ప్రెంచి

వారికి యానాం దక్కింది పశ్చిమ ఆంధ్రలో బళ్ళారి, అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాలను అప్పటికి బ్రిటిష్ ప్రాంతాన్ని నెలకొల్పుకున్న ఆంగ్లేయులకు నిజాం ఇచ్చివేశాడు స్వాతంత్ర్యానంతరం అనేక సభ్య రాష్ట్రాలను పునర్వ్యవస్థీకరించారు ప్రభుత్వంలో ఫెడరల్ సూత్రాల అనుసారంగా కొంత స్వయంపాలనా ప్రతిపత్తి ఇచ్చారు బ్రిటిష్‌వారు స్వాతంత్ర్యాన్ని గుర్తించిన సంస్థానాదీశులు బారత యూనియన్‌లో కలిసేట్టు ప్రోత్సహించారు రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణలో తెలుగు మాట్లాడే ప్రజలున్న సర్కారులు, దత్తమండలాలు, నెల్లూరు, తెలంగాణను కలిపి 1957 లో ఆంధ్ర ప్రదేశ్‌గా ఏర్పాటు చేశారు ఒక బాష ప్రాతిపదికగా, అంటే తెలుగు ప్రాతిపదికగా ఏర్పడిన ఈ రాష్ట్రం, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో ఆ తర్వాత మంచి ప్రగతి సాదించింది

ఆంధ్రుల జానపద కళల అద్యయనానికి చారిత్రక పూర్వరంగం సహాయపడుతుంది మొదట్లో శాతవాహనులకు చాల పెద్ద రాజ్యం ఉండేది ప్రజల్లో చాలమంది వ్యవసాయదార్లు దాన్యము, కాయదాన్యాలు, ప్రత్తి ముఖ్యంగా పండేవి ప్రజలు జీవనానికి చాల కష్టపడేవారు వారికి జీవితంలో ఒక ఉత్సాహం ఉండేది రసజ్ఞాన ప్రేరేపణ లుండేవి సాంఘిక కార్యకలాపాలుండేవి ఆర్య దేవతలను పూజిస్తూ, చురుకైన నిండు జీవనం గడిపేవారు హాలుని ఏడు వందల గాదలలో కొన్ని స్వరచితాలు ఉన్నా వాటి నుంచి వెలువడే చిత్రం ఇదే ఇప్పటి తెలుగు మాట్లాడేవారి పూర్వీకుల జీవనాన్ని ఈ రచనలో వర్ణించారు జానపద కళల గురించిన ఇప్పటి పరిశోదనా వ్యాసాలలో ప్రజల జీవితంతో సంబందం గల ఈ గ్రందాన్ని అంతగా పట్టించుకోలేదు హాలుని గాదా సప్తశతి క్రీ శ మొదటి శతాబ్దము, అంతక్రితము జానపదుల జీవితాన్ని చారిత్రాత్మకంగా చిత్రిస్తుంది ఈ అద్యయనంలో ఆ పుస్తకం గురించి ప్రస్తావన మళ్ళీ వస్తుంది

రాజులు జరిపిన యుద్ధాలు, ఉన్నత సైనిక నాయకులు కనబరచిన దైర్యసాహసాలు, ఆంతరంగిక కలహాలకు కారణాలు, రాజుల వైవాహిక సంబందాలు, వీరగాదలు జానపద గేయాల్లో ప్రస్ఫుటమవుతాయి సాహసము, యుద్ధంలో నైపుణ్యము, ఒక కారణం కోసం జీవిత సమర్పణ, మాటను నిలబెట్టు

కునేందుకు అపాయాలను ఎదుర్కోవడం, లోకోపకారి పనులు మొ॥గు జానపద గేయాల్లోను, బుఱ్ఱకదల్లోను, ఇతివృత్తం అయ్యాయి ఇటువంటి సంఘటనలను శ్రావ్యంగా, హృందాగల సాహిత్యంలో పొందుపరచి, అదే వృత్తిగా గలవారు తంబుర మీటుతూ తియ్యని రాగాలతో తరుచు ఆలాపిస్తూ పాత జ్ఞాపకాలను సజీవంగా ఉంచారు రాజరిక ప్రభుత్వాలు, తరుచుగా యుద్ధాలు, రాజులు సాహిత్యానికి కళలకు చూపిన ఆదరము గ్రామీణులను ఉత్సాహ పరచటంతో ప్రజలకు మనోల్లాసం కల్పించేందుకు వారు ముందుకు వచ్చారు ఇటువంటి వినోదాలు జానపదులలో రసజ్ఞాన స్వబావాన్ని కల్పించి ఉండవచ్చు కూడా

స్తుతి పాటలు, బుఱ్ఱకదలతో పాటు, సందర్భాన్ని బట్టి గేయాలల్లారు పొలాల్లోను, ఇళ్ళలోను ఇవి పని బారానికి మద్యాంతరాలుగా మనోల్లాసానికి తోడ్పడినాయి వీటిలో లాలిపాటలు, క్రీడల పాటలు, పండుగల పాటలు, పెండ్లి పాటలు, పూజ పాటలు, వేదాంతపు పాటలు, ప్రేమికుల ద్వంద్వ గీతాలు, మరణించిన వారి ప్రశంసలు ఉన్నాయి

## ప్రజలు

విస్తారంగా పరిశీలనలు జరిపిన మానవ శాస్త్రవేత్తలు ఈ శారీరక లక్షణాలతో ఆంధ్రులను వర్ణిస్తారు వారు పొడగరులు, గుండ్రటి తలలు, వెడల్పాటి ముఖాలు, వంపుగా పొడవాటి లలాటం గలవారు కూసపాటిగా లావయిన ముక్కులు, త్రిన్నని జుట్టు, పచ్చటి శరీరఛాయ గలవారు ఇవి సార్వత్రిక లక్షణాలు కాగా విశాఖపట్టణం జిల్లాలోని కొందరు బ్రాహ్మణులు, కాపులలో కనబడే లక్షణాలు మద్యదరా ప్రాంతపు ఉపజాతులను పోలి ఉన్నాయి ఈ జాతులు ప్రదానంగా కాక్సాయిడ్‌లు పొట్టిగా, మద్యరకం ఎత్తు, తలలు పొడవుగా ఎత్తుగా ఉన్న మద్య పరిమాణంలో ఉండి, మామూలు కనుబొమలు, పొట్టిగా, వెడల్పుగా ఉన్న ముఖాలతో, మద్య పరిమాణంలోని ప్రదానమయిన నాశికలు, తిన్నని జుట్టు, ముంగురుల ఉంగరాలతో వారి శరీరఛాయ మామూలుగా గోదుమ కలిసిన బూడిద రంగులో ఉంటుంది

ఆంధ్రప్రదేశ్‌లో నివసించే ఇతరులను రెండు తరహాలుగా విబజించాలి

దక్కను పీఠభూమిలోని అడవులు, కొండ ప్రాంతాలకు చెందినవారు ఒక తరహా కృష్ణా, గోదావరీ నదీ ప్రాంతాలలోని వారు రెండవ తరహా ఆటవికులు ఆస్ట్రలాయిడ్ ఉపజాతుల వంటివారు శ్రీశైలం ప్రాంతంలోని కొండజాతులు ఈ తరగతికి చెందినవారు పొట్టి మనుష్యులు, ఎత్తైన నుదురు స్పష్టంగా తీర్చిదిద్దినట్టు కనుబొమలు, ముందుకు వచ్చిన పెదిమలు, చప్పిడి ముక్కులు చర్మము గోదుమ కలిసిన బూడిద రంగులో ఉంటుంది ఉంగరాలు తిరిగిన నల్లటి జుట్టు దక్షిణ బారతంలోని ఆదిమవాసులనేకులకు ఈ వర్ణన సరిపోతుంది తూర్పు కోస్తాలోని యానాదులు, ఎఱుకలకు కొంత వరకు మంగొలాయిడ్ పోలిక లుంటాయి మద్యదరా ఉపజాతులలో ఈ పోలికలు కలుస్తాయి

బద్రాచలం, సింహాచలం కొండ ప్రాంతాలలోని గడబలు, సవరులు, కోయలలో మంగొలాయడ్ ఆస్ట్రలాయిడ్ లక్షణాలుంటాయి మైదానాల్లోని వారిలో మద్యదరా జాతుల పోలికలుంటాయి మానవశాస్త్రంలో చేసిన మిగతా విబజనల మోస్తరుగానే ఈ విబజన కూడా శాస్త్రయుక్తం కాదు కచ్చితము కాదు ఇది సరయినదా అని కూడా ప్రశ్నించవచ్చు ఆంద్రులు చాలావరకు మద్యదరా ఉపజాతికి ప్రదానంగా చెందినప్పటికీ, శతాబ్దాల తరబడి ఇతరులతో కలవటంతో ఆ లక్షణాలు కొంతవరకు మరుగున పడ్డాయి

చరిత్రకందని కాలంనుంచి కూడ తెలుగుగడ్డ మీద ఆటవికులు, కొండ జాతులు, ఇతర ఆదిమవాసులు నివసిస్తూ వచ్చారు మరి కొంతమంది ఆది మవాసులు సముద్ర తీర ప్రాంతంలో నివసించారు ఇప్పుడు రాష్ట్రంలో దాదాపు 32 లక్షలమంది ఆదిమవాసులు 50 లక్షలమంది దేశద్రిమ్మరులు, ఇతర వెనకబడిన జాతులు నివసిస్తున్నారు కోస్తా వెంబడి మాత్రమే గాక శ్రీకాకుళం జిల్లా నుంచి ఖమ్మంలోని భద్రాచలం ఏజన్సీ, గోదావరి జిల్లాల్లో వీరు వ్యాపించారు ఉత్తరాన ఆదిలాబాద్ వరకు వ్యాపించారు ఈ ఆదిమ వాస ప్రాంతం బస్తర్, దండకారణ్య, విదర్బలోని ఆదిమవాస ప్రాంతాన్ని ఆనుకుని ఉంది ఆంధ్రప్రదేశ్ ఎనిమిది జిల్లాలలో ముప్పైమూడు జాతుల ఆదిమవాసులున్నారు ఖోండులు, కొలామిలు, నాయక్ పోడ్‌లు, కోయలు,

కొండదొరలు, వాల్మీకులు, బగత్‌లు, సవరలు, జటాయులు, గడబలు, చెంచులు వీరిలో ముఖ్యలు

ఈ ఆదిమవాసులు హిందూ బావాలతో ఉన్నా పూర్తిగా ఆర్య బావాలు అంటలేదు వారి మతంలో ఈ కలయిక ఉన్నా ఆదిమవాసులు ప్రకృతి దేవతలను పూజిస్తూ తమ పురాతన ఆచారాలు, వ్యవహారాలలో మైమరచి ఉంటారు సాదారణంగా వారి బాషలకు లిపి లేదు అవి మాట్లాడేందుకు మాత్రమే ఉపయోగపడతాయి బాషకు లిపి అవసరాన్ని వారు అర్థం చేసుకోలేరు సాంప్రదాయ ప్రబావం వారి మీద ఎక్కువగా ఉంటుంది సాంప్రదాయ సిద్ధాంతాలను వారు తు చ తప్పకుండా పాటిస్తారు ఏమాత్రం పొరపాటు జరిగినా ఆక్షేపణ ఉంటుంది తమ నాయకుని పట్ల అత్యంత గౌరవము, విదేయత వీరిలో కనబడతాయి ఆదిమజాతి జీవితం అన్ని అంశాలమీద ఆయనదే అదికారము ఆదిమవాసులు పురాణ సంబందమయిన అనేక గాదలు చెబుతారు వారి ఆచారాలు అనాది నుంచి వచ్చినవి ఆదిమ వాస విషయాల్లో క్రమశిక్షణ నిబందనలు సంప్రదాయ సిద్ధమైనవి సమాజపు విందులు, వినోదాలలో కలవటానికి వెనకాడరు వారు పాడుతారు, నృత్యం చేస్తారు వారి భావాలు సహజసిద్ధము వారీ సమాజంలో నివసించటంలో ఆనందం పొందుతూ, ఆదునాతన సమాజాలు, దేశంలో ఇతర నాగరక ప్రాంతాలలోకన్న వీరు సంతృప్తితో ఉంటారు కోస్తా వెంబడి ఉన్న యానాదులు, శ్రీశైలం కొండలలోని చెంచులు, గోదావరి, శ్రీకాకుళం అటవీ ప్రాంతాల్లోని కోయలు, సవరులు, ఆదిలాబాద్ అడవులలోని ఖోండులు తమ పురాతన జివితాన్నే అనుసరిస్తారు వారివి సామాన్య నమ్మకాలు ఉన్నది ఉన్నట్టు మాట్లాడుతారు మార్పును ఇష్టపడరు కొత్త విషయాల గురించి మాట్లాడే వారంటే బయం మార్పంటే వారికి అయిష్టం చాల నమ్మకస్థులు గుణగణాల్లో పెద్ద తప్పులుండవు

ఒక చోట స్థిరనివాసం చేయుటము ఒక వృత్తిని చేపట్టటంలో గల లాబాలలో విశ్వాసం కల్పించి, ఒక చోట వారు నిలబడవలసిన సంచార ఆదిమవాసులు కొందరున్నారు పిచ్చుక గుంట్లు, బాలసంత, శారదగాండ్రు, వీరముష్ఠివారు, బావనీలు, బీరన్నలవారు, గొల్ల సుద్దులు, దాసరులు, జంగ

ములు, కొమ్ముణ్రవారు మొ॥గు వారంత బుఱ్ఱకదలు చెప్పుకుంటూ తిరిగే తెలుగువారు మామూలుగా బిక్షాటన చేసేవారిని కొన్ని ప్రత్యేక కులాల వారు తమ కుటుంబాల గురించీ తమ కుటుంబాల ఘనత గురించి వారిచేత పాడించుకుంటారు దేశ ద్రిమ్మరులలో కొందరు సంచారంలోనే వ్యాపారం చేస్తూ ఉంటారు వారి మహిళలు ఆటబొమ్మలు చేయటం, బుట్టలు, చాపలు అల్లటం, పూసల దండలు గుచ్చటం, కుంకుమ కాటుక వంటి అలంకరణ ద్రవ్యాలను అమ్మే పని చేస్తూ ఉంటారు వాతావరణాన్ని బట్టి వారు ఒక చోటనుంచి మరొకచోటకు వెళ్తూ ఉంటారు ఇదే వారి సంప్రదాయ సిద్ధమ యిన జీవితము ఏదో ఒకచోట స్థిరపడితే లాబసాటి అయిన వృత్తిని అవలం బించే వీలుందనీ, అందులో చాల లాబాలున్నాయనీ వారికి నచ్చచెప్పటం చాల కష్టం ఈ దేశద్రిమ్మరి జాతులకు మనోల్లాసానికి గల వేడుకలు జీవితంలో వారి కష్టాలను మరపింపజేసి, జీవితంలో తృప్తిని కలిగిస్తాయి ఎదురయ్యే ఇబ్బందులు వారికి జీవితంలో ఒక బాగం ఇబ్బందులను కూడా ఎంతో స్వాబావికంగా, సంతోషంగా స్వీకరిస్తారు

తెలుగువారు కాని దేశద్రిమ్మరులలో లంబాడీలు లేదా సుగాలీలు చాల ప్రదానమయినవారు మొదట్లో వారు రాజస్థాన్‌కి చెందినవారు జట్లు జట్లుగా బయలుదేరి దేశం దక్షిణ ప్రాంతం చేరుకున్నారు ఇటువంటి జట్లు కొన్ని ఆంధ్రప్రదేశ్‌లో సర్వవ్యాప్తంగా ఉన్నారు క్రమేపి ఒక చోట స్థిరపడి వ్యవసాయాన్ని వృత్తిగా స్వీకరించారు కొంత మంది గ్రామ ప్రాంతాల్లో ఉన్నారు కొందరు సంచార వ్యాపారులు లంబాడీలే గాక మహారాష్ట్ర కిరాయి సైనికులు ఎక్కువ తెలంగాణ ప్రాంతంలో స్థిరపడినారు వీరిని ఆరె జాతి అంటారు బహుశా 'ఆర్య' శబ్దానికి ఇది అపభ్రంశం కావచ్చు మరాఠీ, తెలుగు కలిసిన బాష వారు మాట్లాడుతారు 12 వ శతాబ్దంనాటి గొప్ప శైవ తెలుగు కవి పాల్కురికి సోమనాదుడు ఆరె బాషలో శివస్తోత్రం వ్రాశాడు ఆరె జాతివారు ఆంధ్రప్రదేశ్‌లో చాలా కాలం నుంచి ఉన్నారని దీనివలన గ్రహింపవచ్చు ప్రస్తుతం వారి వృత్తి వ్యవసాయం వారు ప్రస్తుతం ఆంధ్ర ప్రదేశ్‌లో ఉన్నా వారికి లిఖిత బాష లేదు అంటే ఆరె బాషకు ప్రత్యేక లిపి లేదు వారు నివాసం ఏర్పరచుకున్న ప్రాంతంలో ఉన్న దానికన్న వారి

ఆచార వ్యవహారాలు, పద్ధతులు బిన్నంగా ఉంటాయి

చారిత్రక పరిస్థితుల వలన సాంస్కృతికంగా స్వల్పమయిన మార్పులు ఏర్పడినాయి విబిన్న విశ్వాసాలు గల అనేక ఇతరులు ఆంధ్రప్రదేశ్‌కు వచ్చారు ఆ విదేశీయుల్లో కొందరు యుద్ధాలు చేసి రాష్ట్రాన్ని ఆక్రమించారు మరి కొందరు ఆద్యాత్మిక చింతన రూపంలో రాష్ట్ర ప్రవేశం చేశారు ఈ విదమయిన విదేశీ ప్రబావంతో ఆంధ్రప్రదేశ్ ప్రజల శాంతియుత జీవితానికి అంతరాయం కలిగింది వారి సంస్కృతీ-సంప్రదాయాల మీద వీటి ప్రబావం కనబడింది ప్రజల జీవితంలో వివిద సంస్కృతుల ప్రబావం పడటం తప్పనిసరి అయింది ప్రజల సంస్కృతీ-వారి తెగకు గల ప్రత్యేకతను పది లపరచినప్పుడు మాత్రమే మూలంలో మార్పులు బహుశా సాధ్యమవుతా యి వారి ఆర్ధిక-సాంఘిక-సాంస్కృతిక ప్రగతి సాదనకు గ్రామ ప్రజలను చేరదీయటం తప్పనిసరి ఇప్పుడు సామాన్యుల విషయంలో ఎక్కువ శ్రద్ధ వహించడమన్నది చాల ఆనందింపదగినది ఆదిమవాస సంక్షేమము-సాం ఘిక సంక్షేమ శాఖలు వారి వివిధ ఏజన్సీల ద్వారా ఆదిమవాసులు, వెనక బడిన తరగతుల స్థితిగతులను మెరుగుపరచేందుకు తమ విద్యా, ఆర్ధిక పద కాల ద్వారా ప్రయత్నాలు జరుగుతున్నాయి ఉచిత విద్య, వసతిగృహ సదు పాయాలు, కుటీర పరిశ్రమలు, గృహనిర్మాణ సంఘాలు, వ్యవసాయ సదుపా యాలు, బ్యాంక్‌లు, అప్పులు-తేనె, ఓషధుల వంటి అటవీ ఉత్పత్తుల మార్కె టింగ్‌కు సహకార సంఘాల ఏర్పాటు వంటి అనేక కార్యక్రమాలు చేపట్టి ఈ అమాయక ప్రజల జీవితాలను మెరుగుపరుస్తున్నారు

# 2

# పురాణ గాథలు

ప్రాచీనత్వాన్ని సంతరించుకున్న అన్ని దేశాలకూ, వైవిధ్యంతో కూడిన పురాణ గాదా సంపద అమరి ఉంటుంది బారతదేశంలో వాటి సంఖ్య మరీ యెక్కువ వేదాల నుంచి, చిట్టచివరి పురాణం దాకా పరిశీలిస్తే ఎన్నో రకాలైన పురాణ గాదలు కాని యీ పురాణగాదల్ని అద్యయనం చెయ్యడానికీ, వీటిని సరిగా అర్థం చేసుకోవడానికీ, ఒక నిర్ణీత మార్గాన్ని పరిశోదకుడు అవలంబించ వలసి ఉంటుంది సాంప్రదాయకమైన ఆలోచనా పద్ధతి మనుష్యుల మద్య విబేదాలనూ, బేద బావాన్నీ నాశనం చేస్తుండగా, ఆదునిక హేతువాద దోరణితో కొంత సహనాన్ని అలవరచుకుని, యీ పురాణ గాదల్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేయవలసి ఉంటుంది జానపద విజ్ఞానం ప్రాదమిక సత్యాలనూ, ఉన్నతాదర్శాలనూ, అద్భుతమైన ఊహలనూ, నిశ్చితాబిప్రా యాలను సున్నితమైన ఆలోచనలనూ, ఇంకా పుష్కలమైన ఆలంకారిక సంపదనూ కలిగి ఉంటుందని ఎవరైనా అనుకోవచ్చును నిజానికి జానప దులకు, ఆడంబరయుతమైన శైలీ విదానం గానీ, బాషలో చమత్కారాలు చేయడం గానీ, కొత్త కొత్త మార్పుల్ని ప్రవేశపెట్టడం గానీ, అంతగా నచ్చదు వాళ్ళ ఆశలు చాలా కొద్దిపాటివి వాళ్ళ జీవన విదానం అక్లిష్ట మైనదీ, సరళమైనదిన్నీ వాళ్ళు అనుబవించే సంతోషం కల్తీ లేనిది వాళ్ళ బందుత్వాలు స్వచ్ఛమైనవి వాళ్ళ నమ్మకాలు సహజమైనవీ ఆదర్శాలు ఉదాత్తమైనవిన్నీ ఆదునిక మానవుడికి గ్రామీణుడు సిగ్గరిలాగానూ, కలుపు గోలుతనం లేని వాడిలాగానూ, కొత్త వాళ్ళు చూస్తే బయంతో ముడుచుకు పోయేవాడిలాగానూ కనిపిస్తాడు

జానపదులకు మేదావుల ఆలోచనా పద్ధతులు పరిచితాలైనవి కావు

వాళ్ళ పరిధిలో ఉన్న విషయాలకు సంబంధించినంత వరకూ, వాళ్ళు స్వేచ్ఛగా మెలుగుతూ ఆసక్తి చూపించగలరు తమకు పరిచితమై, తమ కళ్ళ ముందు మెలిగే అంశాలకే, దానవత్వాన్ని ఆరోపించగలరు ఆ విదంగా రోజూ కనబడే సూర్యుడు, వాళ్ళకు సర్వశక్తివంతుడైన దేవుడు అతడు సర్వసాక్షి తన కిరణాలను, ఏ భేదాలనూ పాటించకుండా అన్నిటి మీదా ప్రసరింపజేసే సమవర్తి ఆకాశమార్గాన, ఉదయ సంద్య నుంచి సాయం సంద్య వరకూ, రదారూడుడై తిరిగే దేవర గాదాసప్తశతిలో (1, 34) బూలోకం మీద కాంతి కిరణ ప్రసారం చేసే సూర్యరదం మీద, పతాకం ఎగురుతున్న ట్లుగా వర్ణింపబడ్డది సూర్యుణ్ణి గురించి యీ రకంగా కవితాత్మకంగా, ఎన్నో విదాలుగా, జనులు ఊహించడం కద్దు వాళ్ళు, తమ వంశకర్త సూర్యుని సంతతికి చెందినవారుగా, వర్ణించారు అతను తమ జీవితాలకు సంతోష ప్రదానం చేసే దాత సూర్య తాప ప్రచండమై జనం బరించలేని సమయం ఆసన్నమైతే, అటువంటి సమయాలలో కరువు వాటిల్లేది వర్షాబావం ఏర్పడేది ఇవన్నీ సూర్య బగవానునికి జనం చేసే పాపాల వల్ల వచ్చిన కోప పలితంగా జనం భావించి, సమాదాన పడేవాళ్ళు వర్షం కూడా, జీవనదాతగా, బూమిని రక్షించి నవ జీవనాన్ని స్థాపించే అమృతమూర్తిగా అర్చింపబడడం జరిగింది అంతేకాక జనులు వర్షం కోసం పంచబూతాలను ప్రార్దించేవారు ఇంద్రుణ్ణి, వరుణుణ్ణీ, ఆకాశాన్ని గాడ మేఘావృతం చేయమనీ, వర్షదారల్ని బూమిపైకి ప్రవహింపజేయమనీ, గుంపులు గుంపులుగా చేరి ప్రార్థనలు నెరపేవారు ఏ కష్టమొచ్చినా, ఏ దుఃఖం కలిగినా, వాళ్ళు చేసేది ప్రార్థన ఒక్కటే వర్షాన్నాహ్వానిస్తూ పాడే పాటలు జానపద సాహిత్యం నిండా కనిపిస్తుంటా యి సమాదిలో ఉన్న వరుణదేవతను కదిలించడానికి జనం ప్రసారం చేయని ద్వని అంటూ ఏదీ మిగలలేదు గుడగుడ శబ్దం నుంచి మంత్ర మహిత వాదం వరకూ అన్నీ, జనుల గొంతుల నుంచి విడివడి, వరుణ దేవుణ్ణి మేలుకొలిపే విగా, రూపుదిద్దుకుంటాయి అటువంటి ఎన్నో శబ్దాలలో ఒక శబ్దం కప్పల బెకబెక-బద్దకంగా సాగే ఋతుపవనాన్ని త్వరగా నడిపించడానికి, ముసలీ ముతకా, చిన్నా చితకా, అందరూ ఏకగ్రీవంగా కప్పల బెకబెకల్ని అనుకరిస్తూ శబ్దం చేయడం కద్దు అలా చేస్తే వర్షం వస్తుందని వాళ్ళ విశ్వాసం

ఋగ్వేదంలో కూడా వరుణుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకోవడానికి మండూకప్లుతితో గానం చెయ్యడం కనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు జనులు, ఎండి బీటలు వారిన భూమిమీద కడవలతో నీళ్ళు తెచ్చి కుమ్మరించడం కద్దు అందు వలన వర్షం తప్పక కురుస్తుందని వారి విశ్వాసం ప్రసిద్ధ పురాణాల నుంచి పద్యాలు చదవడమూ, మంత్రోచ్చారణ చేయడమూ, సామూహికంగా ఆచార కాండను నిర్వహించడమూ — ఇవన్నీ ఆకాశం నుంచి నీటిని ఆకర్షించి, తాము నివసిస్తున్న భూమిని సస్యశ్యామలం చేయడానికే

అయితే అతివృష్టి కూడా సమస్యల్ని సృష్టించేదే చెఱువులన్నీ నిండి, భూమి మొత్తం హరితశాద్వల శోబా వృతమైన తరువాత, ఇంకా వానలు కురిస్తే అది ప్రాణాంతకమే నేల మీద ఎక్కడ చూసినా నీళ్ళు! నదులన్నీ గట్లు తెంచుకుని పొర్లి పారితే ఊళ్ళు నాశనమైపోతాయి అటువంటి సమయాల్లో జనం, వర్షాన్ని రావద్దంటూ మనస్ఫూర్తిగా వేడుకుంటారు వాన రాకుండా ఉండడానికి చిత్తశుద్ధితో పూజాదులు నిర్వహిస్తారు ఏదీ ఎక్కువా, తక్కువా కాకుండా, తమకు అనుకూలమైన పద్ధతిలో తమపైన దీవెనల్ని కురిపించమని దేవుళ్ళకు మొక్కుకుంటుంటారు మనుష్యుడు దేవుణ్ణి వేడుకోవడం ఎప్పుడూ ఎడతెగని నిత్య చర్య

వర్షం కురవాలన్న, సామాన్యుడి కోరిక కప్పతల్లి పాటలో చక్కగా వ్యక్తం అవుతున్నది ఇది కొంత ఆచార కాండతో కూడుకున్న పాట ఈ పాట ప్రదేశానికీ ప్రదేశానికీ మద్య, కులానికీ కులానికీ మధ్య, చిన్న చిన్న బేదాలను కలిగి ఉండవచ్చు అయితే పాట ధ్యేయం మాత్రం వర్షాన్ని పొందడం ఈ పాట చూడండి

*కప్పతల్లి కప్పతల్లి! కడివెడి నీళ్ళు*
*దోమతల్లి దోమతల్లి! దొడ్డిడే నీళ్ళు*
*చీమతల్లి చీమతల్లి చిట్టిడే నీళ్ళు*

ఈ పాటకు సంబందించిన తంత్రంలో, గ్రామంలోని చిన్నలంతా గుమిగూడి మొత్తం గ్రామమంతా కలయతిరుగుతారు ఒక రోకలి తెచ్చి దానికి పసుపు రాసి, దాని మద్యన ఒక గోదురు కప్పను కడతారు ఆ కప్ప బ్రతికే ఉంటుంది ఇటూ అటూ మనుష్యులు చేరి రోకల్ని తమ బుజాలమీద మోసు

కుంటూ గ్రామంలోని ప్రతి యింటి దగ్గరా ఆగుతుంటారు ఆగినప్పుడల్లా, ఇంట్లోని యిల్లాలు బిందెడు నీళ్ళు తెచ్చి, మోసే పిల్లల మీదా, కప్ప మీదా గుమ్మరిస్తుంది బాగా తడిసిన శరీరాలతో, ఉరుముల చప్పుళ్ళలాంటి చప్పుళ్ళు చేసుకుంటూ, అందరూ ఒక గుట్ట మీదికో చిన్న కొండ మీదికో చేరు కుంటారు తాము దండుకుని తెచ్చిన పాలూ, నెయ్యి, బియ్యమూ మొదలైన వస్తువుల్ని ఉపయోగించి, అక్కడ పాయసం తయారు చేస్తారు ఈ పాయ సాన్ని 'వరద పాశం' అని పిలుస్తారు తర్వాత ఆ పాయసాన్ని గుట్ట మీద నుంచి దారగా కిందికి పోసి, కప్పను విడిచి పెట్టేసి, వెనక్కి తిరిగి యిళ్ళకు వచ్చేస్తారు ఇలా చేస్తే తప్పకుండా వాన కురుస్తుందని జానపదుల విశ్వాసం

అట్లాగే ఆంధ్ర మహాబారతంలోని విరాట పర్వాన్ని ఎలుగెత్తి నలుగురి ముందూ చదివితే వాన పడుతుందని జనంలో గాఢమైన విశ్వాసం ఉంది ఇట్లా చదవడాన్ని "పారాయణం" చెయ్యడమని పిలుస్తారు సాదారణంగా ఈ పఠన కార్యక్రమం ఊరి గుడి ఆవరణలో గానీ, ఊరి పెద్ద ఇంటి చావిట్లో గానీ జరుగుతుంది ఈ పారాయణ చేసి, వేదోక్తంగా శాంతి జరిపిస్తే, వానలు తప్పకుండా కురుస్తాయని జనులలో ఒక నమ్మకం।

వర్షాలు ముమ్మరంగా పడడం ఆరంబం కాగానే, గ్రామీణులకు చేతి నిండా పని జనులు బూమినీ నాగళ్ళను పూజిస్తారు తండ్రీ కొడుకూ, యజమానీ, పాలేరూ అనే బేదం లేకుండా అందరూ క్షేత్రానికి చేరుకుంటారు తెలుగులో కనిపించే 'ఏరువాక'కు సంబందించిన పాటలు, వ్యవసాయిక వృత్తిలో ఉన్న వారందరి మద్య ఉండే అబేదాన్నీ, ఒద్దిక తనాన్నీ చాటు తుంటాయి

ఏరువాకొచ్చింది ఏరువాకమ్మ
నల్లన్ని మబ్బులు నల్దిక్కు పారి
ఎఱ్ఱన్ని మెఱుపులు ఏగిరించాయి
ఎత్తైన కొండల్ల ఎతకరించాయి
పరుగెత్తి కోకిలా పాట పాడింది
నెమలమ్మ మైమరచి నాట్యమాడింది

మాయయ్య ముఖమంత దొంతి నవ్వుల్లు
మాయయ్య చేతిలో మంచి ములుగర్ర
మాయయ్య కాలికి కిర్రు చెప్పుల్లు

ఏరువాకొచ్చింది ఏరువాకమ్మ
కాపులందరు వేగ కూడి రావాలి
గాదెల్లో విత్తనాలు గట్టిగా తేవాలి
గంపల్లో విత్తనాలు దండిగా తేవాలి
మృగశిర చిందించె ముసలెద్దు రంకేసె
దుక్కిటెద్దుల దెచ్చి అరక గట్టాలి
దున్నినా చేలన్నీ మిన్నగా పండాలి
ఒక్క గింజకు కోటి గింజలవ్వాలి

ఏరువాకమ్మకూ ఏమి కావాలి
ఎర్ర ఎర్రని పూలమాల కావాలి
ఎరుపు తెలుపుల ముబ్బుటెండ కావాలి
ఏరువాకమ్మకీ ఏమి కావాలి।
పొలము గట్టున నిలిచి వేడుకోవాలి
టెంకాయ వడపప్పు తెచ్చి పెట్టాలి
ముత్తైదులందరూ పాట పాడాలి
పాట పాడుతు తల్లి పాదాలు మొక్కాలి
ఏరువాకమ్మనూ ఏమి కోరాలి
ఎడతెగని సిరులివ్వ వేడుకోవాలి
పాడి పంటలు కోరి పరవశించాలి

వర్షాదికాలకు సంబంధించిన మరో అంశం కూడా ఉంది అది ప్రళయాన్ని గురించి ఈ ప్రళయం యుగాంతంలో ఆసన్నమవుతుంది ఈ ప్రళయ వృత్తాంతం అన్ని దేశాల పురాణ గాదల్లోనూ కనిపిస్తుంది మన పురాణాల్లోనే కాక బైబిల్లో కూడా దీని ప్రసక్తి ఉన్నది జానపదుల పాటల్లో ఇది ఎలా సంబవించెది ఏ రకంగా ఉద్భవించె ఎట్లా మనుష్య కోటిని

నాశనం చేసేదీ, వర్ణింపబడి ఉంది ప్రళయం వచ్చిన తరువాత జీవకోటి అంతమౌతుంది భూమండలమంతా జలసమాధిని పొందుతుంది ప్రపంచ మంతా జలం తప్ప మరేదీ కనిపించదు ఆ తర్వాత మళ్ళీ భూమిపైన కొత్త జీవరాశి ఉద్భవించడానికి, భూమి తన్ను తాను సమాయత్తం చేసుకుం టుంది సర్వాన్నీ నాశనం చేసే ప్రళయాన్ని గురించి అందరూ భయ విభ్ర మాలతో పాటలు పాడుకుంటారు భారతీయ తత్త్వశాస్త్రాన్ననుసరించి ఈ ప్రళయమన్నది తప్పనిసరిగా మళ్ళీ మళ్ళీ జరగవలసిన చర్య

## చంద్రుడు

భారతీయ పురాణగాధల ననుసరించి చంద్రుడు పురుష దేవత ఇతడును మనస్సుకు అదిపతి పిల్లలకితను మామ తల్లి పెట్టే బువ్వను మారాం చెయ్యకుండా తినమని, పిల్లల్నితడు బుజ్జగిస్తుంటాడు కొత్తగా పెళ్ళయిన దంపతులకు సంతోషాన్ని కలిగించే దేవుడు విరహ జనుల పాలిట గర్భ శత్రువు సముద్రానికి సంభవించే ఆటుపోటుల కితడు కారణభూతుడు రైతుకు ఏరువాక పున్నమి మొదలుకొని, కాలమంతా ఇతని వలన ఏర్పడే పూర్ణిమ లను బట్టి విభజించబడుతుంది వ్యవసాయ సంబంధమైన పనుల నుంచి విశ్రాంతి కలిగినపుడు వచ్చే పూర్ణిమలన్నీ రైతులకు పండుగదినాలే చంద్రుడు క్షీణించడం, తిరిగి పరిపూర్ణుడు కావడం జానపదులు ఎన్నో కదలు కట్టుకో వడానికి వీలు కలిగించింది విరాణ్మూర్తి అయిన పరమపురుషునికి సూర్యు నితోపాటు చంద్రుడు కూడా ఒక కన్ను చంద్రకాంతి కవిలోకానికి ఊహల్ని పండించే అద్భుత శక్తి భారతీయ పురాణ గాధలలో ప్రాముఖ్యం వహించిన ట్టే, ఇతర దేశాల పురాణగాధలలో కూడా చంద్రుడు ప్రాముఖ్యం కలవా డయ్యాడు ఇతను అక్కడ కూడా జంట వీడిన ప్రేమికుల్ని బాధిస్తాడు అందువల్లనే, ప్రేమికులు అతణ్ణి బ్రయ్య తిట్టగా, క్షీణతనుడై అమావాస్య నాటికి పూర్తిగా అదృశ్యుడవుతుండడం సంభవించింది శరత్కాలంలో అనగా సెప్టెంబరు, నవంబరు మాసాల్లో పూర్ణచంద్రుడు చూడ చక్కని అందంతో శోభిస్తుంటాడు ప్రేమికుల్లో పురుషుడు తన ప్రియురాలి ముఖాన్ని చంద్రు డితో పోల్చి చూసుకోవడం సర్వసాధారణం తెలుగు జానపద గేయాల్లో

ఎన్నో గేయాలు చందమామను ఉద్బోదిస్తూ సాగిపోయేవిగా ఉంటాయి ఒక పడుచుపిల్ల, తన విచారాన్ని వ్యక్తం చేస్తూ ప్రియుణ్ణి తలుచుకుంటూ గానం చేసే ఈ పాట వైనం చూడండి

వాడు వలచీనాడవ్మా చందవూవోయ్
నను తలచీనాడవ్మా
వాడు వలచీన తెల్లారి పిలచీన పలుకాడు //చంద//
వాడు వలచీన దాకాను వలపోసి తిరిగాడు //చంద//
వాడు వలచీన తెల్లారి పిలచీన పలుకడూ //చంద//
వాడు కలలోన నవ్వాడు కన్నెత్తి చూడాడు //చంద//
వాడి పక్కాల ఉన్నాదీ పచ్చల్ల పిడిబాకు //చంద//
అది యెదలోన ఒకసారి నాటినా చాలవ్మా //చంద//

ఇరవైయేడు నక్షత్రాల మద్య చంద్రుడు ఆకాశరంగంలో వెలుగుతుంటాడు ఆ నక్షత్రాలు ఆయన బార్యలు అందులో రోహిణి, ఆయనకు ప్రియమైన బార్య చంద్రుడు గురుపత్ని తారతో వ్యబిచరించడం వలన ఆయనకు క్షయరోగం సంక్రమించింది కాని రాశి చక్రంలో ఇతర గ్రహాలతో కూడిన యితని స్దానం, మనుష్యుల జీవితాలను ప్రబావితం చేస్తుందని జనుల నమ్మకం ఒక అందమైన స్త్రీ ముఖాన్ని చంద్రునితో పోలుస్తారు గాదా సప్తశతిలో (VII-72) రోజు రోజుకూ వృద్ధి చెందుతున్న శుక్లపక్షపు చంద్ర కళలను చూసి కవి, కొద్ది కొద్దిగా క్రమంగా బహిర్గతం అవుతున్న స్త్రీ ముఖంతో పోల్చడం జరిగింది చంద్రోదయం కాగానే పద్మాలు ముడుచుకుపోయేటట్లూ, నల్ల కలువలు వికసించేటట్లూ, వర్ణనలున్నాయి శ్రీకృష్ణుడు గోపికలతో రాసక్రీడ జరిపేటప్పుడు, ఎప్పుడూ పూర్ణిమా నిశి అవసరం చంద్రుడు లేకపోతే శృంగారరసం పరాకాష్ఠను చెందలేదు

కొండజాతివారూ, ఆటవికులూ చంద్రుడి చుట్టూ ఎన్నో పురాణ గాదల్ని అల్లుకున్నారు దొంగలూ, వ్యబిచారులూ చంద్రోదయాన్ని నిరసిస్తారు చంద్రుడుదయించేటప్పుడు నక్కలు మోరలెత్తి అరుస్తాయి ఎన్నో జానపద గేయాలలో చందమామ అనే పదం వంతపదమై కనిపిస్తుంది ఈ వంతతో కూడిన పాటల్ని చందమామ పదాలుగా పిలుస్తారు

సూర్యుడూ, చంద్రుడూ, కొన్ని పురాణ గాదల ప్రకారం అన్నదమ్ములు ఒక పాము మింగడం వల్ల సూర్య చంద్రులకు గ్రహణం పడుతుంది రాను రాను శరణ అనే వంతతో సాగే ఈ కింది పదంలో గ్రహణోదంతం కనిపిస్తుంది, గమనించండి

"ఊరికి ఉత్తరాన ఊడలమర్రి ఓ రామారామా శరణ
కొమిరె పుట్టాలోన కోడె నాగన్నా ఓ రామారామా శరణ
కోరి గుడ్లూ బెట్టి కాపాడసాగె ఓ రామారామా శరణ "

అట్టా గుడ్లు పెట్టి,ఆహారం కోసం అడవిలోకి పోగా, ఒక పిల్లవాడు, ఆ గుడ్లను నేలకు కొట్టి చితిపేస్తాడు పాము పడగ విప్పుకుని బయంకరంగా పిల్లవాణ్ణి వెతుక్కుంటూ బయలుదేరుతుంది సూర్యుడూ, చంద్రుడూ చుక్కల చాప మీద చేరి చదరంగం ఆడుకుంటుంటే, పిల్లవాడు వాళ్ళ వెనుక నక్కి ఉంటాడు పాము, చంద్రుణ్ణి చూసి పిల్లవాణ్ణి తోసెయ్యమంటుంది శరణన్న వాణ్ణి శత్రువుల చేతికివ్వనంటాడు చంద్రుడు సూర్యుణ్ణడిగితే, వాడూ అదే అంటాడు అందుకని కోపంతో పాము ప్రతి సంవత్సరమూ వాళ్ళని కాటేస్తుంటుంది ఈ పాటను పెళ్ళయిన పిల్లలు పాడితే మంచి కొడుకులు పుడతారు విధవలు పాడితే పుణ్యలోకాలకు పోతారు విన్నవాళ్ళందరికీ శుబాలు కలుగుతాయి

తెలుగు జానపదులు ఈ విశ్వంలో ఉన్న ప్రతి వస్తువుతోనూ సంబంధ బాంధవ్యాలు నెలకొల్పుకున్నారు అటువంటి ప్రకృతి వస్తు ఊతంతో, బందుత్వం కలుపుకుంటూ, 'ఓ చందమామా' అనే వంతతో పాడే ఈ పాటను చూడండి

చక్కనీ సందె చుక్క మముగన్న తల్లి
చక్కనీ చందమామ మముగన్న తండ్రి
ఆదినారాయుడూ మాకు పెద్దన్న
అతివ జానకి మాకు వదిన గారమ్మ
దక్షిణాన మెరిసేటి చుక్క మాయక్క
తీక్షణంగ జూసేటి సూరీడు బావ
సాయంత్రం పొడిచేటి చుక్క మా మరిది
తామల్లు జల్లేటి మల్లె మా చెల్లి

## నదులు

ఆంద్రదేశ మంతటా చాలా నిడివైన తీర రేఖ కల దేశం ఈ దేశంలో జన జీవన దాయకాలైన కృష్ణా, గోదావరీ వంటి అనేక నదులు ప్రవహిస్తున్నాయి ప్రతి నదీ, ఉపనదీ, ఎన్నో రకాలైన కదలకు జన్మస్థానం జానపదుని దృష్టిలో నదులు ప్రత్యక్ష దేవతలు అవి భూమిని సారవంతం చేసి అన్నాన్ని అందించే అన్నపూర్ణలు యువతీ యువకులకు వీటి తీర భూములు విహార స్థానాలు శ్రీకృష్ణ రచితమైన గోపికా మదుర శృంగారమంతా యమునాతీర భూమి యందే ప్రవర్తితమైంది నదుల్ని దాటవేస్తూ పడవలు నడిపే వాళ్ళు ఎంతో జానపద గేయసృష్టికి కారకులయ్యారు అక్కడ నదుల్లో నడిచే నౌకలు సాదారణంగా విరహం అనుభవించే ప్రేమికుల్ని చేరవేసే సాదనాలు నదులు, వరదలు వచ్చి పొంగి పొరలుతున్నప్పుడు, జనులు పండ్లూ, పువ్వులూ, కల్లూ మొదలైన వస్తువుల్ని వాటిల్లో జారవిడిచి, కోపం తగ్గించుకొమ్మని వేడుకుంటారు సముద్రుడు అన్ని నదులకూ బర్త బర్తను చేరిన నదీ జీవనాలను, సూర్య కిరణాలు ఆకర్షించి, మళ్ళీ వర్ష రూపంలో భూమికి ప్రసాదిస్తుంటాయి

## గ్రామదేవతా చక్రం

గ్రామీణుడు పూజించే దేవతలు లెఖ్ఖలేనంతమంది కుటుంబాన్ని బట్టి, అక్కడ ఆచారాలను బట్టి, ప్రదేశాన్ని బట్టి యీ దేవతల్లో వైవిద్యం కనిపిస్తుంటుంది గ్రామస్థులు చేసుకునే పండుగల్లో ఒక్కొక్క పండుగనాడు ఒక్కొక్క దేవతను పూజించడం కద్దు ప్రతి గ్రామానికి ఒక రక్షక దేవత ఉంటుంది గ్రామ ప్రజలకు ఆ దేవతాశక్తుల మీద అపారమైన నమ్మకం వాళ్ళు ఆ దేవతాశక్తిని గూర్చి పెద్దలు చెప్పే కదల్ని వింటూ, తమ నమ్మకాలను ద్విగుణీకృతం చేసుకుంటుంటారు మాంత్రికత, తంత్రమూ, ఈ దేవతల చుట్టూ అల్లబడతాయి ఒక్కో దేవతమీద ఉండే నమ్మకమూ, ఆ దేవతను పూజించే పద్ధతి, ఎన్నో ఆంక్షలతో కూడి, నియమ కఠినంగా రూపుదిద్దుకుని ఉంటుంది ఈ దేవతలకు బలులు నడపడం, పూజాంగంలో ఒక ప్రముఖమైన అంశం ఏడాదికో, రెండేండ్లకో కాల నియమాన్ననుసరించి గ్రామస్థులు మిక్కిలి ఉత్సా

హంతో నిర్వహించె జాతరలు, సామూహికోత్సవాలు, కరువు కాటకాలూ, గాయి గత్తరలూ, గ్రామంలో చెలరేగినపుడు, వాటి నివారణ కోసం జాతరల్ని నిర్వహిస్తారు జాతర జరిగే సమయాల్లో ఒక గ్రామానికి సంబందించిన వారు మరో గ్రామపు పోలిమేరను ప్రవేశించరు ఎంతో నిష్ఠతో నిర్వహించే ఈ జాతరల్లో నియమపాలన మిక్కిలి ముఖ్యమైన అంశం నియమాన్ని ఉల్లం ఘించేవారు శిక్షనుంచి తప్పించుకోలేరు అచంచలమైన విశ్వాసం ఇక్కడ ప్రతివాడిలో నెలకొని ఉండే ప్రముఖాంశం ఈ నమ్మకాలు, ఆంక్షలు, ఆచారాలు, జరిగే కర్మకాండ–అన్నీ జానపద గేయాలలో వర్ణితాలయిన అంశాలే

ఈ జాతరలన్నీ ఒక విదంగా నిత్య శ్రమ వలన అలిసిపోయిన జానపదుని మనస్సును సంతోషపెట్టి, అలసట తీర్చే సాదనాలు

గంగ, పోలేరమ్మ, పోశమ్మ, ఎల్లమ్మ, బాలమ్మ, మైసమ్మ, మహంకాళి, దుర్గ, అంకాళమ్మ నూకాలమ్మ, మావురమ్మ, సారమ్మ, సవదలమ్మ, దంతేశ్వరి, సాకులమ్మ మొదలైన ఎందరో దేవతలను జాతరలు చేయడం కనిపిస్తుంది అత్తి, వేప, తులసి చెట్ల కింద ఈ దేవతలు కొలువై ఉంటారు

కొండజాతులవారికి, దేవుడు కొయ్యోడు అతనే పోతురాజు ఒక పెద్ద కొయ్య దుంగ రూపంలో ఈ దేవుడు అర్చింపబడుటవల్ల ఈయన పేరు కొయ్యోడుగా స్థిరపడ్డది ఇతడు చాలా కఠినుడు తన మొక్కులు తీర్చని జనుల్ని కొరడాలతో కొట్టి శిక్షిస్తాడు ఈ క్రింది పాటల్లో, మొక్కు తీర్చక, కొయ్యోడికి బయపడుతూ చేసే అర్చనను గమనించండి

ఓరయ్యో కొయ్యోడ
కొయ్యోడాని పిలుస్త ఉంటే
చీపురు దెబ్బలు కొట్టకురో రయ్యో కొయ్యోడ
అడవుల మంటలు రాంగ జూచీ
ఆకాశాన ఎరుపును జూచీ
అలివిమాలినా ఆగం జూచీ
పేద గుండెలూ బగిలెనురో రయ్యో కొయ్యోడ
నే చేసిన బాసలు మరువనురో రయ్యో కొయ్యోడ
పెద్దాపురవమూ పెదీదిలోన

పట్టెడు బెల్లం కొనుక్కు వచ్చి
సామలమ్మకూ సాకలు బోసీ
పానకాలు నీకు చేసెదరయ్యో కొయ్యోడ!

## గ్రామస్థులు-మధుపానం

గ్రామాలలో తయారయ్యే మత్తు పానీయాల మీద గ్రామీణులకు మోజు ఎక్కువ ఎంతో ప్రాచీన కాలంనుంచీ, పని పాటులతో అలసిపోయిన శరీరాలు సురా పానం వలన సేద తీరుతుండేవి యుద్ధ సమయాల్లో వీరభటులు సేవించే సురను 'వీరపానం' అని పేర్కొనేవారు దాని వర్ణన వీరగాదల్లో ఎక్కడ చూసినా కనిపిస్తుంది బారత బాగవతాలలో, యాదవ క్షయం అదిక పాన మత్తత వలన కలిగినట్లుగా వర్ణింపబడింది సురాపానానికి తోడు కొన్ని మందుల్ని వాడడం కూడా లేకపోలేదు మనుష్యుల్ని తమ వైపు తిప్పుకోవడానికీ, వాళ్ళచేత తమ కిష్టమైన పనుల్ని చేయించుకోవడానికి లేదా కొన్ని పనులు తొందరగా కాకుండా జాప్యం కలిగించడానికి, మందుల్ని గ్రామీణులు వాడే టట్లుగా, జానపద సాహిత్యం వివరిస్తుంది

సురాపానం, ఆడా మగా ఇద్దరూ చేయవచ్చు పండుగల్లో జాతరల్లో తిని, తాగి నృత్యం చేయడం ఒక ఆచారం

తాటి, ఈత చెట్లను గీయడం వలన కల్లు తయారవుతుంది కల్లు గీయడం గ్రామాలలో వృత్తి పరిశ్రమ దనవంతులూ, బూస్వాములూ సురా పానం చేస్తూనే ఉంటారు గ్రామీణులు కొన్ని సందర్భాలలో అదికంగా తాగి తిట్లకూ, కొట్లాటలకూ ఆయత్తమవుతారు

సవర బాషకు సేవ చేసిన డా॥ గిడుగు సీతాపతిగారు, సవరల గురించి వ్రాస్తూ వాళ్ళ తాగుబోతుతనాన్ని యీ విదంగా వెల్లడించారు

"కల్లు తాగడం ఆటవికుల దైనందిన చర్య ఆడా మగా, పిల్లా, పెద్దా అనే బేదం లేకుండా అందరూ కల్లు తాగేవాళ్ళే అందరూ ఒంటి మీద స్పృహ తప్పేవరకూ తాగుతారు పండుగల్లో ఈ తాగుడు మరీ యెక్కు వ ఇంటికి అతిదులు వస్తే వాళ్ళకు కల్లు ఇవ్వడం మంచి ఆతిద్యానికి చిహ్నం"

కల్లున్న యిల్లు రాజబవనం
కల్లులేని యిల్లు వల్లకాడు - అన్నది వారి అబిప్రాయం
"అన్నం నా కోసం వండావా
వద్దు నా కక్కర లేదు
చెఱుకు రసం నా కోసం తెచ్చావా
వద్దు నా కక్కర లేదు
నాకు కావలసింది కల్లే
ఆ కల్లే!
అదే నేను తాగేది!" - ఈ రకంగా కల్లు తాగేవాడు తన్ను తాను సమర్థించుకుంటూ,

రోజంతా పొలం దున్నుతాను
దున్నీ దున్నీ అలిసిసొలసి పోతాను
అందుకే కల్లు తాగుతాను
అలసటంతా మర్చిపోడానికి
కల్లు తాగుతాను - అంటాడు

తన బర్త తప్ప తాగి పడిపోతే, బార్య –

తాటికల్లు తప్పతాగాడు
ఒంటిమీద స్పృహ లేకుండా
నా మగడు
చిందులేస్తున్నాడు – అని విచారిస్తుంది

ఆటవికులు తాటి, ఈత చెట్లనే కాక వేప చెట్లను కూడా గీచి కల్లు తీస్తారు గ్రామ పెత్తందారీల కోసం ఖరీదైన పళ్ళనుంచీ పువ్వుల నుంచీ కూడా రక రకాల పానీయాల్ని తయారు చేస్తారు గ్రామీణుడు తాగడాన్ని తప్పుగా బావిం చడు పైపెచ్చు పని చేసి అలసిన తనకు ఆనంద సాదనంగా దాన్ని గ్రహి స్తాడు అందుకు అతని దేవతా చక్రంలో దేవతలంతా సురాపాన ప్రియులు కావడం, సురాపానం ఒక మత చర్యగా రూపు చెందడం బలాన్నిస్తూ కనిపి స్తుంది

# 3

# మతము-మంత్ర చర్య

గ్రామీణ జీవనాన్ని నిలిపి ఉంచే ఇనప చట్రానికి రెండు ప్రముఖాంశాలు గ్రామస్థులు పెంచి పోషించే నమ్మకాలూ, మూఢ విశ్వాసాలూ। అవే సంప్రదాయానికి సంబందించిన బలమైన అంశాలు ఈ సంప్రదాయమే గ్రామీణ జీవన పద్ధతిని నిలువ బెట్టేది అంతేకాక, ఇది సామాన్యుడైన గ్రామీణునకు తన గ్రామపు "వేల్పులోడి" తో పటిష్ఠమైన సంబందాన్ని కలుగజేసి, అతని యందు అచంచలమైన విశ్వాసాన్ని కలిగిస్తుంది వేల్పులోడే ఆటవిక సమూహానికిగానీ, గ్రామానికిగానీ, నాయకుడు అతను జనానికీ, దైవానికీ మద్య కుదురుకున్న బలమైన లంకె అతను సామాన్య జనానికి నమ్మకస్థుడైన మిత్రుడు దారి చూపించే పద ప్రదర్శకుడు, తత్త్వవేత్త సామాన్యుల జీవితాలను సరియైన మార్గంలో నడిపించే వాడతనే పరంపరగా వచ్చే న్యాయ సూత్రాలను అమలు జరుపుతాడు సంప్రదాయాన్ననుసరించి, తీర్పులు చెపుతాడు అతనికి న్యాయరీత్యా మనిషికి మరణశిక్ష విదించే హక్కు ఉంటుంది లేదా వెలివేసి, గ్రామ బహిష్కృతుణ్ణి చేసే అదికారం ఉంటుంది గ్రామస్థులు అవలంబించే ఆచార కాండ మిక్కిలి సామాన్యమైనది పరంపరాగతంగా వచ్చే ఆచారాలను, చెదిరిపోని నమ్మకాలతో వాళ్ళు కొనసాగిస్తుంటారు పుట్టుక, పెండ్లి, చావు మొదలైన సందర్భాలలో ఈ ఆచార కాండ, తు చ అవలంబింపబడుతుంది సంప్రదాయానుసారంగానే ఆచార కాండ సాగినా, కొన్ని కొన్ని విబాగాలలోని తెడాల వల్ల ఒక్కొక్క గుంపుకు అది కొద్దిగా భేదించవచ్చు

మతానికీ, ఆచార కాండకూ మద్య అంతర్నిహితంగా అల్లుకుని కలగలిసి పోయిన అంశం మూఢ విశ్వాసం అది ఒక శకునం కావచ్చు అనాలోచి

తంగా పలికిన పలుకు కావచ్చు ఒక వ్యక్తికి సంబందించినది కావచ్చు లేదా ఒకరి కందించిన సలహా కావచ్చు ఏ రూపంలో వున్నా, మనసా, వాచా, కర్మణా దాన్ని ఎవరూ అతిక్రమించడానికి పూనుకోరు దాని పుట్టు పూర్వోత్తరాలను గురించి తర్జన బర్జనలు చేయరు మూఢ విశ్వాసమనేది ఎప్పుడైనా, కార్య కారణ సంబందానికి లొంగే హేతువాదంగా ఉండదు దానిలో శాస్త్రీయత కనిపించదు

శకునాలను ఒక రకంగా, మనిషికి అందింపబడే హెచ్చరికలుగా, జనులు బావిస్తారు ఎవరైనా పనిమీద ఎక్కడికైనా బయలుదేరబోయే ముందు, ఎవరైనా తుమ్మితే, అతను రక్కున ఆగిపోతాడు అటువంటి శకునాలను కొల్లలుగా చెప్పుకోవచ్చును కాకి కుడి నుంచి ఎడమకు ఎగిరితే దుశ్శకునం కాకుల కలయిక కనపడడం మృత్యువుకు సంకేతం ఆ దుష్ట పలితాన్నుంచి తప్పించుకోవడానికి, ఆ వ్యక్తి తాను చనిపోయినట్లుగా దగ్గరి వాళ్ళకు తప్పుడు వార్తలు పంపించుకుంటాడు రాత్రివేళ వీదుల్లో కుక్కలు మోరలెత్తి ఏడవడం కూడా దుశ్శకునమే మనిషి నడిచేటప్పుడు కూడా కొన్ని ప్రాదమిక సూత్రాలను పాటించాలి కొత్తగా ఇంట్లోకి ప్రవేశించేటప్పుడు పురుషుడు కుడి పాదాన్నీ, స్త్రీ ఎడమ పాదాన్నీ తొలుతగా మోపాలి యుద్ధభూమికి కదిలే సైన్యం తొలుతగా ఎడమ పాదాన్ని కదిలించాలి అందువల్ల శత్రు పరాజయం లబిస్తుంది బల్లి పలికితే కొన్ని వేళల శుభం మరి కొన్ని వేళల అశుబం అలాగే బల్లి శరీరంమీద పడితే, వేర్వేరు అవయువాలను బట్టి శుబాశుబ పలితాలు కలుగుతాయి మనుష్యులు నివసించే యిళ్ళల్లో గుడ్లగూబలు రావడం శుబప్రదం కాదు పొద్దున్నే లేవగానే పిల్లి మొహం చూడకూడదు ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు పిల్లి ఎదురవడం వల్ల జరగవలసిన పనులు పాడైపోతాయి పాముల విషయంలోనూ అంతే ప్రయాణంలో నక్క ఎదురు కావడం శుబసూచకం పాలపిట్టగానీ గరుడపక్షి కానీ కనిపించడం శుబప్రదం కొంతమంది గృహస్థులు, తాము పెంచే జంతువుల చేత మంచి ద్వనుల్ని పలికించుకుంటుంటారు

పురుషులకు శరీరంలో కుడి బాగం అదరడం శుబం స్త్రీలకు ఎడమ బాగం అదరడం శుబప్రదం శకునాలకు మల్లేనే కలలు కూడా మనిషికి

శుబాశుబ పలితాలనిస్తాయన్న విశ్వాసం ఉంది కలలను విడమరచి శుబా శుబ కర్మల్ని వివరించే స్వాప్నిక శాస్త్రవేత్తలుండేవారు తెలుగులోని, ప్రాచీన కాలానికి చెందిన పల్నాటి కద, కామరాజు కదలలో స్వప్నాలను వివరించడం కనిపిస్తుంది కలల్లో జరిగేవన్నీ నిజ జీవితానికి సంబందించి ఉంటాయని జానపదులు నమ్ముతారు

గర్భవతులైన స్త్రీలను గ్రహణ నమయాన వెలుతురు చూడనివ్వరు అట్లా చేస్తే పుట్టె పిల్లలు అంగ వికలత్వం కలిగి ఉంటారని ఒక విశ్వాసం పిల్లవాడికి ముందుగా పై పళ్ళు వస్తే మేనమామకు చెడుపు కలుగుతుందని బావిస్తారు

కొన్ని కులాలకు చెందిన స్త్రీలు బవిష్యత్తును చెపుతామని, చాటుకుంటారు దానివల్ల వాళ్ళకు జీవన బృతి కలుగుతుంది వాళ్ళు చెప్పే ఎరుకను నమ్మే అమాయకులు జీవితంలో సంతృప్తిని పొందుతుంటారు ప్రేమికులు, వియోగంతో బాదపడేవారు, కన్యలు, జీవిత సమస్యలతో విసిగిపోయే పెద్దవారూ, రోగగ్రస్తులూ అందరూ ఎరుక నాశ్రయిస్తారు ఎరుక చెప్పడమే కాక ఒక్కొక్కసారి ఎరుకసాని ప్రేమికుల మద్య మద్యవర్తిగా పని చేస్తుంది రాయబారాలు నడుపుతుంది సమాచారాన్ని మోసుకుపోతుంది అంత పుర జనం ఉండే మిక్కిలి కట్టుదిట్టమైన స్దలానికైనా ఆవిడ పోగలదు గనుక, ఆవిడ పై పనులన్నీ చేయడానికి సమర్దురాలు

స్త్రీలకు కొన్ని సమయాల్లో పూనకం వస్తుంది ఆ పూనేది దయ్యమైనా కావచ్చును, దేవుడైనా కావచ్చును శక్తులు ఆవహించినప్పుడు, ఆ స్త్రీ అనర్గళంగా మాట్లాడగలదు తనకూ, ఎదుటివారికీ తెలియని ఎన్నో విషయాలను వెల్లడి చేయవచ్చును

దేశంలో కొన్ని ప్రాంతాలలో ఒక వింత ఆచారం వాడుకలో ఉంది "వల్లుబండ" అనే రాయి ఒక గ్రామంలోని దేవాలయంలో ఉంటుంది జరగబోయేది కనుక్కోవాల. కునేవారూ, ఏ విషయంలోనైనా సందేహం కలవారూ, దేవాలయంలోని . బండను, స్నానం చేసి శుచిగా ముట్టుకోవాలి కళ్ళు మూసుకుని అరచే. ఆ బండమీద ఆనించిన వెంటనే, ఆ బండ అతనికి బవిష్యత్తును తెలియ. స్తుంది కలలోకి మల్లె ఏదో లోకంలో ఉండె

ఆతనికి పరిష్కార మార్గాలు స్ఫురిస్తాయి

కొన్ని ప్రాంతాలలో, ఒక్కో కుటుంబంలోని కన్యను గ్రామ దేవతకు ప్రీతి కోసమై అంకితం చేస్తారు ఆవిడ వివాహం చేసుకోకూడదు భగవత్సేవలో లీనమైపోవాలి ఆమెను దేవత ఆవహించడం జరుగుతుంది అటువంటి సమయాలలో, ఆమె అడిగిన వారికి వారి బవిష్యత్తును చెప్పే సామర్ధ్యం కలిగి ఉంటుంది ఇటువంటి కన్యలను గణాచారులనీ, శివ సత్తులనీ పిలుస్తారు కొన్ని సమయాల్లో పురుషుల్ని కూడా దేవి ఆలయాల్లో సేవకై వినియోగించడం కద్దు అటువంటప్పుడు, పురుషులు స్త్రీ వేషదారులై దేవతలను అర్చిస్తూ ఉంటారు

కొంతమంది మాంత్రికులు గ్రామాలలో కనిపించడం కద్దు వాళ్ళు పరంపరాగతంగా మాంత్రిక విద్యను అబ్యసించడమో లేక కేవలం కుతూహలంతో దాన్ని చేపట్టడమో, జరుగుతుంది శత్రువుల్ని చంపడం, అంగవైకల్యం కలిగించడం, వాళ్ళకు చేతనైన విద్యలు మంత్రోచ్చాటనం, తాంత్రిక చర్యలు అతి రహస్యంగా నిర్వర్తిస్తారు దీన్ని చేతబడి అని కూడా అంటారు చేతబడి, తిరుగుబడి, అనేవి గ్రామీణుల జీవితంలో భయంకరమైన అంశాలు మంత్రగాళ్ళు తమ శత్రువుల మీద రకరకాలుగా భయంకర పద్ధతులలో ప్రయోగాలు చేస్తుంటారు మనుష్యుల పుర్రెలతోను, ఎముకలతోను తయారుచేసే దండాన్ని చేతుల్లో దరిస్తారు మట్టితోగానీ, కర్రతో గానీ బొమ్మలు చేసి, ఆ బొమ్మల వివిదాంగాలలో సూదులు గుచ్చడం ద్వారానూ, కొన్ని చోట్ల కప్పలను తెచ్చి వాటి శరీరాలలో సూదులు నింపడం ద్వారానూ శత్రువుల్ని బాదిస్తారు ఇతర దేశాలలో ప్రచారంలో ఉన్న 'ఉడూ' అనే మాంత్రిక విద్యతో సమానమైంది ఈ చేతబడి

మనిషిని ఆవహించిన పైశాచిక శక్తుల్ని, ఆది వ్యాధుల్ని పారద్రోలే యంత్రాలు తాయత్తులు తాయత్తుల ద్వారా రోగ నివారణం చేయడం, కేవలం సమ్మకం మీద ఆదారపడిన విద్య అని శాస్త్రవేత్తల అబిప్రాయం ఈ విద్య అతి ప్రాచీనమైన విద్య శరీరాంగాలలో చెణుకు పట్టినా, పిల్లలు విడవకుండా పోరుపట్టి ఏడుస్తున్నా, జడుపు కలిగినా, తాయత్తులు దరిస్తే బాగుపడడం జరుగుతుంది తాయత్తులు దరించే వేళల్లో మనుష్యులు నియమ

నిష్ఠలతో మసులుకోవడం అవసరం

గొర్రెల్నీ, దున్నల్నీ, మేకల్నీ బలి యిచ్చే ఆచారం గ్రామీణులలో కనబడుతుంది వాటిని బలి ఇవ్వడం వలన దేవత ఆకలి తీరుతుంది ఆ విషయమై సందేహాన్ని వెలిబుచ్చే గ్రామీణుడు కనిపించడం అరుదు ఎవరైనా ఆ విషయాల్లో ప్రతిమటిస్తే, వాడికి ఆపద వాటిల్లుతుందని గ్రామస్థులు నమ్ముతారు

గ్రామాలలో అన్ని మతపరమైన చర్యలకూ గ్రామదేవత కేంద్ర బిందువు సంఘంలో ఐత్యతను సాదించిపెట్టే శక్తి ఆమె ఒక గ్రామానికి గ్రామదేవత పుట్టుక అతి ప్రదానమైనదిగా కనబడుతుంది గ్రామానికి సంబందించిన గాదలలో వీరుల, వీరవనితల, ప్రసక్తి కనిపిస్తుంది వాళ్ళు ఏమైనా అపచారాలు చేస్తే దేవతలు మండిపడి శపిస్తారు వాళ్ళ వీరత్వానికీ, పవిత్రతకూ మెచ్చి వరాలు కురిపిస్తారు ఒక్కోసారి దారినపోయే మనిషి ఎవరైనా తాను నట్టనడి అడవిలో ఒక దేవతా విగ్రహాన్ని చూశానని చెప్పవచ్చు లేదా చెఱువు కట్టమీద దేవత వెలిసిందని చెప్పవచ్చు, లేదా ఆ దేవతే ఏ గ్రామస్థుడి కలలోనైనా కనిపించి తానెక్కడ ఉన్నదో తెలియచేయవచ్చు అప్పుడు మొత్తం గ్రామమంతా కదిలి, ఊరేగింపుగా బయలుదేరి, మేళ-తాళాలతో దేవతా విగ్రహాన్ని గ్రామంలోనికి తెచ్చి అనువైన చోట ప్రతిష్ఠాపించవచ్చు ఈ దేవతలకు చేసే ఉత్సవాలలో మొత్తం గ్రామమంతా కలిసికట్టుగా వ్యవహరించి, అంతులేని తృప్తిని పొందుతారు ఈ ఉత్సవాలు సంవత్సరానికో, రెండేళ్ళ కొకమారో, మూడేళ్ళ కొకమారో ఆయా గ్రామస్థులు ఏర్పాటు చేసుకున్న నియమాలనుబట్టి జరుగుతుంటాయి

కొన్ని గ్రామదేవతల గుళ్ళు ఊరి పొలిమేరల్లో నెలకొని ఉంటాయి ప్రేమికులు కలుసుకునే సంకేత స్థలాలుగా కొన్ని సార్లు అవి ఉపయోగపడడం కద్దు ఏ కారణాన్నైనా వాళ్ళు తాము అనుకున్న ప్రకారం ఆ ప్రదేశాలలో కలుసుకోలేకపోతే దేవతకు వారి మీద ఆగ్రహం కలిగినట్లుగా బావిస్తారు ప్రఖ్యాత శృంగారి శ్రీనాద మహాకవి ఒక తెలకల వనితను గ్రామదేవత గుడిలో కలుసుకునేటట్లు సంకేతం ఏర్పాటు చేసుకున్నాడు కాని ఆమె అనుకున్న ప్రకారం అక్కడికి రాలేదు అందుకు మండిపడిన కవి గ్రామదేవతను అన

రాని మాటలతో ఆశువుగా తిట్టాడని పుక్కిటి కద ఒకటి తెలియజేస్తుంది. గాదాసప్తశతి (11-94)లో ఒక చెలికత్తె తన సఖిని విడిచి వెళ్ళిపోయిన ప్రేమికుడితో ఇట్లా అంటుంది ఒ యువకుడా! నీవు వెళ్ళేటప్పుడు నా సఖి మెడలో వేసిన కుసుమహారం ఎండిపోయింది సుగందాన్ని పోగొట్టుకుంది గుళ్ళో ఉన్న దేవతకు మల్లే, ఎండిన దండతో చలనరహితంగా రాయిలా ఉండిపోయింది నీవు ఆవిడ దగ్గరకు రాలేదు మరెవరూ దేవతకు వికసించిన పూలదండను కొని రాలేదు"

1-64 గాద, 'గుడి పాడైపోయింది' కప్పు కూలిపోతుంది "ఎక్కడ చూసినా ఇనప చువ్వలు పొడుచుకొని వస్తున్నాయి శిదిలమైన గుడి అంతర్భాగం నేరస్థుల్ని వురితీసే వేదికలా వుంది అక్కడ అడవి పావురాలు కువకువలాడుతూ, సంచరిస్తున్నాయి" అని పాడుబడ్డ గుడిని వర్ణిస్తుంది

అటువంటి బయంకరమైన ప్రదేశం, ప్రేమికులు కలుసుకునే సంకేత స్థలం అటువంటి స్థలం కొత్తవాళ్ళని దగ్గరికి చేరనీయదు అందువల్ల ప్రేమికులు నిరంతరాయంగా ఆనందాన్ని పొందగలుగుతారు

గ్రామాల్లో వృద్ధ స్త్రీలకు మంత్రాలు ఇంద్రజాలం తెలిసి ఉండవచ్చు కొందరు ప్రేమికులు తాము కలుసుకొనే మార్గాలను అన్వేషిస్తూ, ఈ ముసలమ్మల దగ్గరికి, మందుల కోసం పరుగులు తీస్తారు ఆ మందుల వాడకం, అమ్మకం, గ్రామాల్లో చాలా రహస్యంగా ఉంచబడతాయి

స్థానికమైన వీరుల కదలు, జానపద కదలు, ఇటువంటి మంత్ర తంత్రాలతో కూడినవిగానే ఉండటం కనిపిస్తుంది శత్రువుని జయించడం కోసం, ప్రతి వీరుడు మంత్రగత్తెలను ఆశ్రయించవచ్చు సాదారణంగా తమకు అర్థం కాని విషయాలన్నీ మంత్రశక్తి వల్ల సమకూడేవే అని గ్రామస్థులు నమ్ముకుంటారు

## వైద్యము-మంత్రాలు

గ్రామస్థులు వివిద రోగాలకు తాము చేసుకునే వైద్యాన్ని, నాటు వైద్యమని అంటుంటారు వాళ్ళు శరీరానికే కాక, మనస్సుకు కూడా వైద్యం చేసుకోగలరు గ్రామ వైద్యుడికి మంత్రతంత్రాలు కూడా తెలిసి వుంటాయి

ఆయుర్వేదంలో మంత్రశక్తి చేత వైద్యం చేయుడం కూడా ఒక బాగమే గ్రామ వైద్యులు చదువుకున్నవారు కాకపోయినా, వైద్యం చేయడం, వారికి వంశపారంపర్యంగా లబించే విద్య వాళ్ళకు వైద్యం చేయడం తెలుసు కానీ వైద్యానికి సంబందించిన లక్షణాలను వివరించడం తెలీదు ఒక్కొక్క వైద్యుడు ఒకే మూలికను, ఎన్నో వ్యాదులకు వాడడం కనిపిస్తుంది బోయ జాతికి చెందినవారు ఆకులు, మూలికలు వంటి ఔషదాలను గ్రామ వైద్యులకు సరపరా చేస్తుంటారు గ్రామాలలోని మంగలి స్త్రీలు, మంత్రసానులుగా పని చేస్తుంటారు వాళ్ళే గాయాలను, దెబ్బలను నయం చేసే వైద్యం చేయగలరు సాదారణంగా పిల్లలకు కలిగే చిన్న చిన్న వ్యాదులకు తల్లులు స్వయంగా మందులు వేసి నయం చేయడం కనిపిస్తుంది దగ్గు, జలుబు, విరేచనాలు, కంటి కలక, కంటి జబ్బులు అన్నీ వైద్యుని సహాయం అక్కఱ లేకుండా, తల్లులే నయం చేసుకోగలరు కామెర్లు, ఉబ్బసం, పిచ్చి కుక్క కాటు వంటి, జబ్బులను కూడా మూలికలను ఉపయోగించి గ్రామస్థులు నయం చేసుకోగలరు పాము కరిచిన, తేలు కుట్టినా, మంత్రం వల్లనో, మందు వల్లనో ఆ విషానికి విరుగుడు కనిపెట్టగలరు

చిన్న పిల్లలు పాడుకునే కొన్ని పాటలలో, కొన్ని కొన్ని జబ్బులకు, ఔషదాలు సూచించబడ్డాయి చెక్కా, బిట్టీ, గుడుగుడు గుంజం వంటి ఆటలకు సంబందించిన పాటలలో కొన్ని రోగాలకు ఔషదాలను సూచించబడడం జరిగింది కాళ్ళ గజ్జి కంకాళమ్మా అనే పాటలో, గజ్జికి ఔషదం సూచించబడినది గుడుగుడు గుంజం అనే పాటలో పాము కాటుకి మందు చెప్పబడినది గచ్చకాయల ఆటకి సంబందించిన పాటలో ఎముకలకు విరిగినా, బెణికినా, వైద్యం సూచించబడినది కొంగా, కొంగా గోళ్ళు అనే పాటలో, విట్లో అనగా పుప్పి గోళ్ళ రోగానికి విరుగుడు సూచింపబడినది

గ్రామస్థులు చాలా మంది తమ పశువులకు తామె వైద్యం చేసుకోగలరు సాదారణంగా పశువులు నామును, ఆముదం చిగుళ్ళను ఎక్కువ తినడం వల్ల జబ్బుపడటం కనిపిస్తుంది వీటిని బాగు చేయుడానికి మందులే కాక మంత్రాలను కూడా ఉపయోగిస్తారు కొన్ని సమయాలలో వాతలు వెసి వైద్యం

చెస్తారు గ్రామ వైద్యులు తమకున్న వైద్య పరిజ్ఞానాన్ని తమ కొడుకులకో లేదా, తమకి ప్రియమైన శిష్యులకో అందిస్తారు

## గ్రామస్థులు-వాతావరణం

ఏ రోజు వర్షం పడుతుందో ఏ రోజు ఎండ కాస్తుందో ముందుగానే ఊహించి చెప్పడం గ్రామస్థులకు ముఖ్యమైన విషయం వారికి సంబందించిన దైనందిన కార్యక్రమాలు, వాతావరణం మీద ఆదారపడి వుంటాయి సాదారణంగా ఈ విషయాలను తెలియ చెప్పేవాడు, గ్రామ పురోహితుడు గానీ, ఆ ఊరికి సంబందించిన తల పండిన వృద్దుడు గానీ అయ్యి వుంటాడు వర్షం ఎప్పుడు పడుతుందా అని, చెఱువులు ఎప్పుడు నిండుతాయా అని, పడమటి గాలులు ఎప్పుడు వీస్తాయా అని గ్రామస్థులు ఆతురతతో నిరీక్షిస్తూ, వీరిని ప్రశ్నిస్తుంటారు ఆకాశము, భూమి కలిసే చోట తెల్లని వలయాలు ఏర్పడినా చంద్రుని చుట్టూ గాలి గుడి కట్టినా, వాటిని, వాన రావడానికి సూచనగా గ్రామస్థులు గ్రహిస్తారు గాలి గుడి చంద్రుడి చుట్టూ మరీ దగ్గరగా ఏర్పడితే, వాన రావడం ఆలస్యం కావచ్చు తూనీగలు ఎక్కువగా ఎగురుతూ కనిపిస్తే, వాన తప్పకుండా పడుతుంది ఇటువంటి అంచనాల వల్ల గ్రామస్థులు ఎప్పుడూ ఆశాజీవులుగా కనిపిస్తారు ప్రకృతిని తమ మీద దయ చూపమని, వీరు ప్రార్థిస్తుంటారు ప్రయాణానికి గానీ, పెళ్ళి కుదుర్చుకోవడానికి గానీ, క్రొత్త ఇంట్లో ప్రవేశించడానికి గానీ, వ్యవసాయపు పనులు మెదలుపెట్టడానికి గానీ ఇంకా ఎన్నో పనులకు గ్రామస్థులు మంచి రోజు తప్పకుండా చూసుకుంటారు నక్షత్రాలను, ఆకాశాన్ని, మబ్బులను, గాలినీ చూసి, ఏ పనులు చేయవచ్చునో, ఏవి చేయకూడదో తమ అనుబవం వల్ల గ్రహిస్తారు ప్రాతఃకాలపు వేగుచుక్క, గుమిగూడే మబ్బులు, మారే ఋతువులు, కృష్ణపక్ష, శుక్లపక్షాల చంద్రరేఖలు, అస్తమించే సూర్యుడు ఇవన్నీ గ్రామస్థుని జీవితంలో ప్రాదాన్యం వహించే విషయాలే ఇరవై ఏడు నక్షత్రాలు, వాటి గతులు, మనుష్య జీవిత గమనంతో పోల్చబడతాయి రాత్రిపూట ఆకాశంలో నక్షత్రాల స్థానాన్నిబట్టి గ్రామస్థులు సమయాన్ని ఖచ్చితంగా అంచనా వేయగలరు వాళ్ళు ఈ చుక్కలను

తమకు నచ్చిన పేర్లతో పిలుచుకోవడం మనం గమనించవచ్చు తెల్లవారు జామున కనిపించే చుక్కను పొడుపు చుక్క అనీ, సాయంకాలపు నక్షత్రాన్ని సందె చుక్క అనీ పిలుస్తారు సప్తర్షి మండలాన్ని గొరకొయ్యలనీ, కృత్తికా నక్షత్రాన్ని పిల్లల కోడి అనీ పిలుస్తారు మంచపుకోళ్ళు, అరుందతి, గొల్ల కావడి వంటివి, వారు నక్షత్రాలకు పెట్టుకున్న పేర్లలో కొన్ని ప్రకృతి దత్తమైన శక్తిమీద గ్రామస్థులకు అంతులేని విశ్వాసం నెలకొని వుండడం మనం గమనించవచ్చు

# 4

# సంప్రదాయాలు-ఆచారాలు

బారతదేశపు గ్రామవాసుల్లో పితృస్వామిక వ్యవస్థ నెలకొని వుంది మేహాలయ, అరుణాచల ప్రదేశ్ వంటి కొన్ని చోట్ల తప్ప మరెక్కడా మాతృస్వామికి వ్యవస్థ కనిపించదు అన్ని గ్రావరాలలోనూ కొన్ని విదులు మరి కొన్ని నిషేదాలు గ్రామస్థులు ఆచరించడం కనిపిస్తుంది గ్రామానికి సంబందించిన ఆచారాలు ప్రదేశాలను బట్టి చిన్న చిన్న మార్పులను కలిగి వుంటాయి ఈ ఆచారాలు గ్రామీణులలో ఒక రకంగాను, ఆటవిక జాతులలో మరొక రకంగాను సనిపించవచ్చు ఉదాహరణకు, సాదారణంగా వివాహాలు ఒకే కులంలోనో, జాతిలోనో అంతర్గతంగా జరుగుతుంటాయి ఆటవికులు, గిరిజనులు తమ గుంపును విడిచిపెట్టి మరొక గుంపుతో వివాహ సంబందాలను కలుపుకోవడానికి ఇష్టపడరు ప్రేమికులు లేచిపోయి వివాహం చేసుకోవడం వీళ్ళలో చాలా తప్పు తెలుగుదేశంలో దక్షిణాన, మడమటి దిక్కున సముద్ర తీరం వెంబడి కొండల వరుసలు అమరివున్నాయి ఆ కొండలలో నివసించే గిరిజనులు, చెంచులు, యానాదులు అని వ్యవహరింపబడుతున్నారు శ్రీశైల పర్వత శ్రేణిలో నివసించేవారు చెంచులు వారు తొలుత కొండలలో ఉండి క్రమంగా మైదాన ప్రాంతాలకు తరలి రావడం జరిగింది పులికాటు సరస్సులోని శ్రీహరికోట ద్వీపంలో యానాదులు నివాసాన్ని ఏర్పరచుకున్నారు చెంచులకు, యానాదులకు ఎన్నో విషయాలలో దగ్గర పోలికలు కనిపిస్తాయి చెంచులు కొండ ప్రాంతాల్లో వేటాడి జీవనోపాదిని కలిగి ఉండగా యానాదులు తీర ప్రదేశాలలో చేపలుపట్టి పొట్టపోసుకుంటుంటారు

యానాదులకు పెళ్ళికి ముందు ప్రేమించుకోవడం, కలిసి తిరగడం తప్పు కాదు పెళ్ళికి ముందు ఆడా మగా తమ పెద్దలతో ప్రమేయం

లేకుండానే పెళ్ళి నిశ్చయించుకుంటారు అప్పుడు స్నేహితుల్ని, పెద్దల్ని పిలిచి ఆకు వక్క పంచిపెడతారు వరుడు వదువు మెడలో అందరి సమక్షాన మంగళసూత్రం కడతాడు అడవి యానాదులలో పెళ్ళి తంతు పెద్దగా కనిపించదు కానీ, రెడ్డి యానాదులు వివాహాచారాలను తు చ తప్పకుండా పాటిస్తుంటారు పిల్ల మేనమామ పెళ్ళి పెద్ద అతను పిల్లకు అవసరమైన వస్తువులు ఇవ్వవలసి ఉంటుంది వివాహానికి హాజరైన బందువులకు అతనే విందు ఏర్పాటు చేయవలసి వుంటుంది యానాదులు పెళ్ళి ముహూర్తాన్ని సాదారణంగా మిట్ట మద్యాహ్నం ఏర్పాటు చేస్తారు అది వాళ్ళ ఆచారాల్లో ఒకటి వదూవరుల కొంగులు ముడి వేయడం, అరుందతీ నక్షత్రాన్ని చూపించడం, వీరి ఆచారాల్లో కొన్ని నృత్యం చేయడం, పాటలు పాడడం ఆడ పెళ్ళివారు మగ పెళ్ళివారు పరస్పరం హాస్యాలు చేసు కోవడం పెళ్ళిలో బాగాలే వరుడు వదువు తండ్రికి కన్యాశుల్కాన్ని చెల్లించడం ఒక ఆచారం పెళ్ళి ఖర్చు ఇరు పక్షాల వారు సమానంగా బరించడం పరిపాటి పెళ్ళికొడుకు పెళ్ళికూతురు పరస్పరం పసుపు పూసుకొని గందాలను అద్దుకుంటారు పెళ్ళి పచ్చని ఆకులతో కట్టిన పందిరి కింద జరుగుతుంది

గ్రామీణులలో స్త్రీ, పురుషులు సాదారణంగా ఒకరిని విడిచి మరొకరు జీవనం గడపరు గ్రామీణ స్త్రీ తన బర్త మరొక స్త్రీతో సంబందం కలిగి ఉండడం సహించదు తనకు నచ్చని చోట ఆవిడ వివాహాన్ని రద్దు చేసుకొని మారు మనువు చేసుకొనే స్వతంత్రం కలిగి ఉంటుంది యానాదుల్లో బహు బర్తృత్వం లేదు కానీ బహు బార్యాత్వం ఉంది యానాది స్త్రీలు సాదార ణంగా గొడ్రాళ్ళు కారు వాళ్ళల్లో వ్యబిచరించడం కనిపిస్తుంది బార్య తప్పు చేస్తే బర్త ఆవిణ్ణి విడిచిపెట్టడం సర్వసాదారణం భార్యా బర్తలు విడి పోయినప్పుడు వాళ్ళకు పిల్లలుంటే వాళ్ళు తల్లి దగ్గరే పెరుగుతారు తండ్రికి ఆస్తి ఉండదు కనుక పిల్లల విషయంలో కానీ, విడిచి పెట్టిన బార్య విషయంలో కానీ, డబ్బుకు సంబందించిన లావాదేవీలుండవు యానాది మగవాడికి పగ తెలియదు రక్తం చిందించడం అంటే అతనికి బయం బార్యా -బర్తలిద్దరు కోర్టుల కెక్కకుండానే విడిపోవచ్చు విడిపోయిన వెంటనె ఏ

ఆర్భాటము లేకుండా మరొకర్ని పెండ్లాడవచ్చు వారిలో విదవలు వివాహం చేసుకోవడం సర్వసాదారణం

ఆదునిక కాలాన విద్య బాగా వ్యాపించి యానాదులు కూడా నాగరకులుగా మారడం మనం గమనించవచ్చు వాళ్ళు ఉపాద్యాయులుగానూ, ఇంజనీర్లుగానూ బాద్యతాయుతమైన ఉద్యోగాలలోనూ, నెలకొని వున్నారు ఇది ఒక రకంగా సాంఘికాబివృద్ధికి తోడ్పడడమే అయినా దీని వలన వాళ్ళకు ప్రకృతి సిద్ధమైన తృప్తి, ఆనందం కొరవడుతున్నాయనే చెప్పాలి

చెంచులు అహోబల నరసింహస్వామి భక్తులు విష్ణుమూర్తి నాలుగో అవతారమైన ఆయనను ఓబులేశ నరసింహుడని కూడా జనులు వ్యవహరిస్తారు నరసింహస్వామి చెంచు పడతిని ప్రేమించి పెండ్లాడినందువలన చెంచులు ఆయనను తమ ఇంటి అల్లుడుగా బావిస్తారు అటువంటి గాదలను పాటలు కట్టి పాడుకుంటుంటారు ఈ పాటలు చెంచు పడతికి, నరసింహస్వామికి మద్య జరిగిన సంబాషణలుగా సాగుతుంటాయి

నరసింహుడు

ఎవరే ఒయ్యారి బామ
ఎవరే బంగారు బొమ్మ
ఎవ్వారు నీకు సాటి
ముయ్యేడు జగముల లోన //ఎవరే//
ముచ్చటైన ముద్దు మొగమూ
పొచ్చె మెరుగని రూపరేఖలు
మదను బారీ తాళలేనే //ఎవరే//

చెంచిత

నేనెవరైతే నీకేల పోరా
నా చెంతకు రారాదు సామీ
నా దారి కడ్డమూ తొలగి
దూరము నిలచి మాటాడేది న్యాయమ
బుంగ మీసం దిద్దుకోనీ
పంగ నామాలద్దుకోని

కోర లిరువైపులా కూడీ
కోరగించే సొగసు గాడా
నడుము సన్నని అందగాడా
నన్ను చేరక నిలిచి పోరా
అయిన వాళ్ళూ చూచిరంటే
అగడు మాటలు తలకు జుట్టూ

నరసింహుడు

వంటరీగా వనములోన
తిరుగ నీకూ కర్మ మేమీ
ఒక్క చూపు విసరవైతివి
నేను చేసిన పాప మేమి
నిన్ను జేసిన బ్రహ్మ దేవుడు
నిజముగా బహు చతురుడాయె
కొండ లెక్కి గుట్టలెక్కి
అడవులన్నీ నడచి వస్తి
నన్ను విసి᳚ ి చేవు బామా
న్యాయమా ఇది నీకు బామా

చెంచిత

నీకు నాకూ పొత్తు ఎట్ల కుదురునయ్యా
నా అమ్మల పొదిలో బాణాలు నిన్ను గొట్టక ముందే
తొలగి పోవయ్యా నరహరీ
ఇది నీకు న్యాయం గాదయ్యా

నరహరి

ఓ ఒప్పులకుప్పా, వయ్యారి బామా
రవ్వలు రతనాలు కూర్చిన
రమణి ముద్దులగుమ్మా
నిన్ను కౌగిట బట్టందే
నిలువలేనే బామా
నిన్ను పడయక కంటికి కునుకు రాదే! బామా

ఈ సంబాషణ ఈ విదంగా పొడిగింప బడుతుంది వాళ్ళ ఇద్దరి మధ్యా ప్రేమ చిగురిస్తుంది తిరిగీ చెంచిత—

చెంచిత

చెట్టు లెక్క గలవా నరహరి
పుట్ట లెక్కగలవా
చెట్టులెక్కి ఆ చిటారు కొమ్మన
తేనె తీయగలవా-అంటుంది

నరహరి

చెట్టు లెక్క గలనే ఓ బామా
పుట్ట లెక్క గలనే
చెట్టులెక్కి ఆ చిటారు కొమ్మన
తేనె పిండ గలనే

చెంచిత

వేట లాడగలవా నరహరి
ఏనుగెక్క గలవా
ఏనుగెక్కి ఒక ముష్టి దెబ్బతో
దరను గూల్చ గలవా।

నరహరి

దానికీ అవునని, ఆపైన
అడవి తిరగ గలనే ఓ చెంచిత
పండ్లు కోయగలనే
నదులు దాటగలనే ఓ చెంచిత
వేట లాడగలనే
చెంచు నాయకుని చేతుల మొక్కి
చెలిమి చేయగలనే-అని మంచి చేసుకుంటాడు
నాకు నెమళ్ళను కొట్టి కానుకీయ గలవా-అని చెంచిత అడుగగా—

వేటకేగి నీ కోరికలన్నీ
వేగ తీర్చగలనే - అని నరసింహుడు సమాదానమిస్తాడు

ఈ పాటలో, ప్రకృతి సౌందర్యం, అమేయమైన సంతోషమూ, ప్రేమా, సరళ మార్గంలో చిత్రీకరింపబడ్డాయి అంతేకాక, ఈ పాట వెనుకనున్న పురాణ గాదా బలం వలన, దీన్ని పాడేటప్పుడు గిరిజ స్త్రీ పురుష సమూహం ఎంతో ఉత్సాహాన్ని పరవశత్వాన్నీ పొందుతుంటారు దర్బ్సన్ ఈ పాట విని ముగ్ధుడై ఆంగ్ల బాషలోనికి దీన్ని అనువదించి ప్రకటించాడు చివరకు చెంచులక్ష్మి, ఓబులేశుల వివాహంతో శుభాంతంగా ఈ పాట ముగుస్తుంది

*దాల్చి నాకుల తోటి*
*తాళి చేసిండో* // చెంచుదొరా //
*అడవి ఆకుల తోటి*
*అది బాసింగం కట్టి* // చెంచుదొరా //
*పసుపు కొమ్ముల తోటి*
*పంచె గట్టిండూ* // చెంచుదొరా //
*పన్ను బెట్లాకుల*
*అంగి దొడిగిండూ* // చెంచుదొరా //
*ఎక్కరాని కొండల్లు*
*ఎక్కె నమ్మయ్యో* // చెంచుదొరా //
*అడవులమంతరాలు*
*తిరిగె నమ్మయ్యో* // చెంచుదొరా //
*చెయ్యరాని పనులు*
*చేసె నమ్మయ్యో* // చెంచుదొరా //
*ఓబులేశుని పెండ్లి*
*ఒనరంగ గూడె* // చెంచుదొరా //
*నాలుగు మూలల పెండ్లి*
*తేనె గట్టింద్రూ* // చెంచుదొరా //
*వాలు టమ్మలు నాల్గు*
*వాటంగ నాటింద్రు* // చెంచుదొరా //
*అమ్మపై కొబ్బరీ*
*చిప్పల్లు గూర్చి* // చెంచుదొరా //

వెదురుబియ్యం దెచ్చి
తలంబ్రాలు బోసీ // చెంచుదొరా //
ఓబులేశుని పెండ్లి
చూడ ముచ్చట్లూ // చెంచుదొరా //

పురాతన విద్యాబోదక సూత్రాలు ఆదునిక మానవుడికి వింతగా కనిపించవచ్చు వేద పఠనం అన్ని కులాల వారు చేయకూడదనే ఆంక్ష వెనుకటి రోజుల్లో ఉండేది అయినా జ్ఞాన సంపాదన అందరికీ అందు బాటులో ఉంటుండేది పురాణాలూ ఇతిహాసాలు అందు కోసం నిర్దేశింప బడినవే వీటిల్లో తత్త్వ చింతన, ఆద్యాత్మికత, కళలు, సాంకేతిక కళలు, మొదలైన వాటిని గురించి పూర్ణమైన జ్ఞానం నిండి ఉంటుంది అవి విజ్ఞాన సర్వస్వాల వంటివి జనులు పని పాటులు లేక తీరికగా ఉన్న వేళల్లో, పురాణ శ్రవణం వల్ల, జ్ఞానార్జన చేసుకుంటుంటారు వారికి లిపి తెలియక పోయినా, చదువు సంతలు అలవాటు లేకపోయినా, శ్రుత పాండిత్యం వల్ల, లోకజ్ఞానం కలిగి ఉంటారు సాధారణంగా ఆరుబయట, రచ్చబండల దగ్గర, దేవాలయావరణలలో, గ్రామస్థులు గుమిగూడి పురాణ శ్రవణం చేయడం ఒక ఆచారం దర్మార్థ కామ మోక్షాల ప్రాశస్త్యాన్ని గురించి అవిరళంగా వింటుం డడం వలన జీవన గమ్యాన్ని నిర్దేశించుకునే శక్తి వాళ్ళకు లబిస్తుంది చుట్టూ ఉన్న బౌతికమైన ఒడుదుడుకులు, ఇబ్బందులు వాళ్ళను కలవర పెట్టలేని స్థితికి-అందువల్లనే వాళ్ళు ఎదగ గలుగుతారు ప్రతి గ్రామస్థుడుకీ, కర్షకుడికీ, శ్రమజీవికీ, తాను జీవించే జీవితానికి గమ్య మేమిటో, తన ఆదర్శ మేమిటో స్పష్టంగా తెలిసి ఉంటుంది దర్మవ్యతిక్రమం జరగకుండా తాను బ్రతకడం, తోటి మనుష్యులు ఆ రకమైన జీవితాన్ని నడిపేటట్లుగా చేయూత నివ్వడం, అతని ముఖ్యమైన ఆదర్శం వాళ్ళకు శ్రమించడం విదాయక కృత్యం మంచి పని చేసే వాడి కోసం ఎప్పుడూ మంచి ఫలి తాలు ఎదురు చూస్తుంటాయి గురువుల్ని గౌరవించడం, దేవుణ్ణి నమ్ముకుని ఉండడం అతిదుల్ని సంతోషపెట్టడం, వాళ్ళు ఆచరించవలసిన ముఖ్య కృత్యాలు, సరళ వర్తనం, ఆదరణ, దార్మికత, ఆతిద్యం నెరపడం వంటి సుగుణాలన్నీ గ్రామస్థులను, మతం వల్లా, అతి ప్రాచీన కాలంలో వేళ్ళూని

స్థిరంగా ఉన్న వారసత్వంవల్లా, సంప్రదాయంవల్లా లభించేవిగా ఉంటాయి అవన్నీ గ్రామస్థులలో అల్లుకుపోవడానికి పురాణేతిహాసాలు ముఖ్య కారణాల వుతున్నాయి

ఇతిహాసాలలోని ప్రసిద్ధ వీరుల పెండ్లి కదలు గ్రామస్థులు మననం చేసుకునేవే సీతాకల్యాణాన్ని గురించి జనంలో ఎన్నో పాటలు ప్రచారంలో ఉన్నాయి ఈ పాట చూడండి

*బంగారు పందిరే బలువుగా తీర్చి*
*పచ్చలా పీటల్లు పందిట్ల పరిచీ*
*విరజాజి పువ్వులా వీవనలు దెచ్చీ*
*వింత వింతల మాలలెన్నొ కైసేసీ*
*దూరాన ఎవ్వరే వచ్చేటి వారూ*
*పెండ్లి కొడుకు రామయ్య పేరైన వాడూ*

స్త్రీలు పెళ్ళిపాటలు పాడుతూ, సీత, రుక్మిణి వంటి పురాణ నాయిక లను జ్ఞప్తికి తెచ్చుకుంటుంటారు పాటలు పాడడం ప్రతి ఆచార కాండ లోనూ కనిపించే విదాయక కృత్యం

పెళ్ళి జరిగిన తరువాత హృదయవిదారకమైన సన్నివేశం, పెళ్ళికూతుర్ని అత్తవారింటికి పంపడం పుట్టిన నాటినుంచీ అల్లారు ముద్దుగా పెరిగిన తన యిల్లు విడిచిపెట్టి బర్త వెనుక, అతని యింట్లో అడుగు పెడుతుంది వదువు ఆ క్షణం నుంచీ ఆ యిల్లే తన యిల్లు అక్కడి వాళ్ళే తన వాళ్ళు ఆ ఊరు అక్కడి మనుషులూ తనకు కొత్త అయినా, తనకు చెందినవే ఆ కొత్త వాతా వరణానికి అలవాటుపడడానికీ, అక్కడి వారితో కలిసి పోవడానికీ తనకున్న ఆశా, ఆదారమూ, తన బర్తకు సంబందించిన ప్రేమ ఒక్కటే పెళ్ళికూతురు తన బవిష్యజ్జీవనాన్ని గురించి ఆలోచించుకుంటూ సంతోషపడుతుండ వచ్చు కాని బాద అంతా తల్లిదండ్రులది తాము ఎంతో ముద్దుగా పెంచు కున్న బిడ్డ పరాయి పంచను చేరి, పరాయివాడి పాలైపోతుంది ఆ వియోగం బరింపరానిది ఆ సందర్బంలో పెళ్ళికూతురి తల్లి గానీ, మరే ముత్తైదువైనా గానీ ఈ పాట పాడతారు

ఒప్పితంబుగ నుండు ఓ బిడ్డ నీవు
తల్లి మాయు అత్త తగ జూడవమ్మ
తండ్రి మారు మామ తన మారు వదినెల
కనవలె యీ రీతి కపటంబు లేక
హరి పగిది నీ మగడు అరయ దేలెడు
అతని మాటలే అవి వేద వాక్కులు
ఆతడు రాజైతే నీవు రాణివి సుమ్ము
ఆతని యింటికి ఆదిలక్ష్మివి నీవు
ఆతని నట్టింట పండిన పంట

ఈ పాటల్లో ఎన్నో నీతి బోధలుంటాయి మరో పాట చూడండి పెళ్ళి కూతురి చెల్లెలు తన బావగారితో, అక్కను గురించి యిచ్చే సలహాలు ఇందులో ఉన్నాయి మరదలు బావను ఆటలు పట్టించవచ్చు బోదలూ చెయ్యవచ్చు ను ఈమె చేసే బోదల్లో అక్క పట్ల తనకు గల ఆర్ద్రతను ఎంత సున్నితంగా ప్రదర్శిస్తున్నదో గ్రహించండి

వడ్లు దంచామనీ వంతెయ్యబోకు
అలిసి పోయి మాయక్క అట్లె పండేను
వంట జెయ్యామనీ వంతెయ్యబోకు
అలిసిపోయి మాయక్క అట్లె పండేను
పోయి రాజబెట్టమని పోరబోకయ్య
పొగ చూరి కండ్లల్లొ కావు గమ్మేనూ
చెట్లు గొట్టామనీ చలపట్టబోకు
చేతుల్లొ బొగ్గలొచ్చి చేటుదెచ్చేను
దూరాన పెండ్లిండ్లు అవి చూడ బంపూ
తీరు తీరుల కొప్పు తీర్చుకో బంపూ
ఆట కూటంలోన ఆడుకో బంపూ

పెళ్ళికూతురు, తన బర్త యింటికి పాత కాపై, బర్తతో చనువును సంపాదించుకున్నాక, వాళ్ళ యిద్దరి మద్యా జరిగె వ్యవహారం ఈ పాటలో చూడండి



దింసా-జానపద నృత్యం



వీరనాట్యం



ఒగ్గు కథ



పగటివేషగాళ్ళు



వీధి నాటకం



గొరవయ్యలు



చిందు భాగవతం

రాత్రనక పగలనక చెట్లు కొట్టామంటె
వడ్లోళ్ళ యింట్లోను పుట్టలేదు నేను
రాత్రనక పగలనక వడ్లు దంచామంటె
కాపోళ్ళ యింట్లోను పుట్టలేదు నేను
రాత్రనక పగలనక బట్టలుతకామంటె
చాకలోళ్ళ యింట పుట్టలేదు నేను
రాత్రనక పగలనక గొర్లగాయామంటె
గొల్లోళ్ళ యింట్లోను పుట్టలేదు నేను

ఆ తరువాత మరో సంబాషణ పాటల్లో అమరి, వాళ్ళకు పరస్పరమూ ఉన్న ప్రేమను, ఆప్యాయతనూ వెల్లడి చేస్తుంది

మరొక చోట, బార్యను తీసుకు పోవడానికి యింటికి భర్త వస్తాడు తనకు ఇష్టం లేకుండా ఈ పెళ్ళి జరిగిందని పదువు విచారిస్తుంటుంది భర్త జాలరి వలె వల విసిరాడు తనకు తల్లిదండ్రుల్ని విడిచిపెట్టి భర్త వెంట వెళ్ళడం ఇష్టం లేదు ఈ పాట చూడండి ఇందులో ఎంత విచారం గూడు కట్టుకుని ఉందో

జాలరీ వచ్చెనే వలలు దీసుకుని
ఇంటి చుట్టూ పెద్ద వలలు పన్నాడూ
వలలోన పడ్డాది వన్నెల్ల చేప
వావిడిచి యేడ్చినా కార్యమ్ము లేదు
వల యేట్లు తప్పింతు ఇలు ఎట్లు విడుతు
బుట్టలో పెట్టుకుని పయనాలు కట్టే
మాయ జాలరినీ చేపేమి చేసు?

మరొక చోట, ప్రేమికుడు మోసం చేస్తాడు ఆమె ఏకాంతంలో దిగులుగా కాలం వెళ్ళబోస్తూ ఉంది ఎట్టకేలకు ప్రియుడు దగ్గర చేరి బతిమాలుకుంటుంటే ఆమె కోపం వహిస్తుంది

ఏడుస్తూ నేనిక్కడుంటే
నవ్వుకుంటూ నీవక్క డుంటావ్

నన్నొదిలి పోరా దూరంగా
నిన్నెవరూ పిలవలేదు మరి //నన్నొదిలీ//
నీవూ వద్దు నీ మాటలు వద్దు
నా యింట్లో నీకు పనిలేదు //నన్నొదిలీ//
చెవిటోడా విను నా మాటలు //నన్నొదిలీ//

'ఓ చెవిటి వాడా' అని ప్రియుణ్ణి సంబోదించటంలోనే ఉంది ఆమె కోపావేశమంతా

పిల్లని అత్తవారింటికి పంపించే ముందు, పాడే పాటలలో ఎన్నో పురాణ గాథలు ఇమిడి వుంటాయి గ్రామస్థులకు రామాయణంతో ఉండే పరిచయం వల్ల, వాళ్ళు ఆ పాత్రలను పాటలలో పొదిగి, ఇటువంటి సందర్భాలలో పాడుకుంటుంటారు ఈ క్రింది పాట అటువంటి వాటిల్లో ఒకటి జనక మహారాజు సీతను రాముడికి ఇచ్చి వివాహం చేసి, ఆమెను అత్తవారింటికి పంపించే ముందు, అప్పగింతలు పెట్టే సందర్భాన్ని ఈ పాటలో గమనించండి

సెలవిచ్చి మాయమ్మ సెలవిచ్చినాము
చెలగి మీ అత్తింట బుద్ధి గలిగుండు
ఎవ్వరే మాడిన ఎదురాడకమ్మా
వీదిలో నిలుచుండి కురులిప్పకమ్మ
పలుమారు పలుదెరచి నవ్వబోకమ్మ
పరమాత్మతోగూడి మెలగు మాయమ్మ
ఆకలి ఉంటేను అడుగ బోకమ్మ
అత్తగారితో పోరు చేయబోకమ్మ
నాతోటి చేసిన మంకు పోరెల్ల
ఎరుగని అత్తింట చేయబోకమ్మ

రామునికి అప్పగించిన తరువాత, అత్తగారైన కౌసల్యాదేవి చేతిలో, సీత చేతిని ఉంచి పాడే పాట ఇది

ఈ బాల యెరుగదు ఏమియునైన
మీ శాంతతో నొక్క బాలగా జూడు
బొమ్మరిండ్లని యాడు, బుద్దెరుగదమ్మా
మెల్లగా నేర్పుతో పని నేర్పవమ్మ
ఆకలెరిగి అన్నంబు పెట్టినా దాక
అడుగ నేరదు నీవు అడిగి పెట్టమ్మ
కోడలు మీ సొమ్ము కొడుకు మీ సొమ్ము
ఆడువారిని గన్న అలుసింతెనమ్మ

ఆ సమయంలో సీత చెలికత్తెలు ఆటలు ఆడడానికి రమ్మని, సీతని పిలవడానికి వస్తారు అప్పుడు జనకుడు వారి వైపుకి తిరిగి, ఈ విదంగా అంటాడు

చెలగి ఆడలాడ చేడెరో వినుమ
ఈ సీత మన యింటి సీత గాదమ్మ
ఆటకూటాలలో అతివ మిముగూడి
ఆడుటకు మీ కింక ఎవ్వరున్నారు
బొమ్మలకు పెండ్లిండ్లు పొందుగా జేసి
బొమ్మలాటల నాడ ఎవ్వరున్నారు
చిట్టి చేతుల తోడ వంటలూ చేసి
విందులకు పిలుచుటకు ఎవ్వరున్నారు
ఊరి చేడెల తోడ ఉయ్యాల లూగా
పరగ మన నట్టింట ఎవ్వరున్నారు

ఆ తండ్రి గుండె తల్లడింపు స్పష్టంగా చిత్రింపబడ్డది సీత అత్తగారి ఇంటికి బయలుదేరుతుంది పట్టరాని విచారంతో ఆమె తల్లి, సీతను ఒక్క సారి మోము తిప్పి ఇంటివైపు చూడమని అర్థిస్తుంది

మోమిటు దిప్పవే ముద్దుల్ల సీతా
ముత్యాల దలపించు ముద్దుమొగం చూపు
రత్నాల దలపించు నేత్రాల దిప్పు

బాగుగా మెరిసేటి బాషికం జూపు
పచ్చల పతకాన్ని బాదొప్ప జూపు
ముద్దులొలికే మోము ముదమొప్ప జూపు

అటువంటి వీడ్కోలు పాటలు జానపదులు ఎన్నో పాడుకుంటారు సంప్రదాయపరమైన సమావేశాలు జరిగినప్పుడు, కౌటుంబికమైన ఉత్సవాలు జరిగినప్పుడు, ఇటువంటివి ఎన్నో పాటలు వినిపిస్తుంటాయి ఈ పాటల నిండా సామాన్యుల జీవనానికి సంబంధించిన సమకాలిక సంఘటనలే వర్ణింపబడతాయి పాత్రలు పురాణాల నుంచి గ్రహించినవే అయినా, అక్కడ వర్ణింపబడిన వారి జీవితం, సామాన్యమైన జీవితమే. పురాణ పాత్రలలో కూడ వాళ్ళు తమనో తమకి దగ్గరి వారినో చూసుకుంటుంటారు ఇక్కడి సీత వాళ్ళ కూతురు, రాముడు వారి ఇంటి అల్లుడు

అడవులు ప్రేమికులు కలుసుకునే సంకేత స్థలాలు ఏటి గట్టునా, లోయ లోపల, కొండ అంచున, వారి సమాగమ స్థలాలు నిర్ణయింపబడతాయి చెంచులు పాడుకునే ఈ పాట చూడండి

ఓబులేశుని కొండల నడుమా
వొంచెగడ్డీ కోసేదానా
వొంచె గుడ్డా పల్లె గుడ్డేమే //హరి ఓబులేశుని//
గిద్దలగిరి కొండల నడుమా
ఎద్దులు కాచే ముద్దుల మరిదీ
నన్ను జూచి నవ్వబోకోయీ //హరి//
కట్టమీద నుంచెళ్ళేదానా
కాలు కురచా చిన్నదానా
కాసులిస్తా యెంట వస్తావా //హరి//
ముందటరకా దున్నేవాడా
ముద్దుల మేనత్త కొడుకా
దాపటెద్దుకు దప్పితె కాయెరా //హరి//

శృంగార పరమైన ఇటువంటి సంబాషణాత్మక గేయాలు లెక్కలేనన్ని అవి సహజత్వంతో శోభిస్తూ మిక్కిలి సరళంగానూ, సూటిగానూ, గ్రామీణ హృదయాలకు తగిలి వచ్చేటట్లు అందంగా కల్పింపబడతాయి

వీళ్ళ పాటలలో రామాయణాన్ని గురించిన ప్రసక్తి ఉంటుంది అదే విదంగా మహాబారత ప్రసక్తి కూడా కనిపిస్తుంది విదురుని పత్ని పాండవుల పట్టపురాణి అయిన ద్రౌపది అందాన్ని చూసి ఈ రకంగా అంటుంది

*ఈ అంద చందాలు ఎక్కడివె పడతీ*
*నిను జూచి మగవాడు నిలవ గలడటవె*

పెళ్ళి అయిన తరువాత వర్తక వ్యాపారాల కోసరమై బర్త దేశాంతర గతుడైతే, భార్య వియోగ దుఃఖంతో కృశించిపోతుంది ఆమె ఎవరితోనో ఒకరితో బర్తకు సందేశాలు పంపుతుంది ఈ క్రింది పాటలో తన మరిదిని సందేశం మోసుకు పోవలసిందిగా ప్రార్థిస్తూ వీలైనంత త్వరగా ఇంటి నుంచి బయలుదేరమని వేడుకునే స్త్రీ ఆవేదన వర్ణింపబడినది

*త్వరపడుము తమ్ముడా త్వరపడుము వేగ*
*నాలుగేళ్ళ నుంచి చూపులే లేవు*
*మీ బావ జాడలు కనరావు తండ్రి*
*అయిదు పంటలు ఇంట నిండాయి తండ్రి*
*మీ బావ జాడలు తెలియగా రావు*
*అన్నలూ తమ్ములూ ఎందరున్నా గాని*
*తల్లిదండ్రుల ప్రేమ తరగకున్నా గాని*
*తాళిగట్టిన వాడు ఏల రాకుంటే*
*తరగనీ సంపదలు చిల్ల పెంకుల్లు*

ఈ రకంగా ఒంటరిగా వియోగాన్ని అనుబవించే స్త్రీల వర్ణనలు, 'గాదా సప్తశతి' నిండా కోకొల్లలు

III 5 బర్త దేశాంతరగతుడు కాగా, ఒక యిల్లాలు బల్యర్చన కొరకు, అన్నం ముద్దను కాకులకు పెడుతుండేది వియోగ వ్యధ వలన కృశించిన ఆమె చేతినుంచి, అన్నం పెడుతున్నప్పుడు, గాజు జారి, కింద

సున్న అన్నం ముద్ద చుట్టూ ఒక కవచం లాగా పడి పోయింది కాకి దాన్ని చూసి, బహుశ తనను పట్టుకోవడానికి వేసిన ఉచ్చు ఏమో నని భ్రమించి, అన్నం దరిదాపులకు రాలేదు

III 36 ఒక పురుషుడు, బార్యను ఇంట వదలి విదేశాలకు వెళ్తున్నాడు అప్పుడు తన బార్య చెలికత్తెలతని చుట్టూ చేరి, 'ఓ యువకుడా! నీ బార్య మీద నీకున్న ప్రేమ ఎంత గాఢమైనదైనా, వియోగ దశ వలన, అది అరచేతిలో పోసున్న నీటికి మల్లే, జారిపోతుందేమో సుమా!" అని హెచ్చరించారు

III 44 విప్రలంబ దుఃఖాన్ని పొందుతున్న ఒక స్త్రీ, తన ప్రియుడికో ఉత్తరం పంపడానికి ప్రయత్నిస్తున్నది ఉత్తరం వ్రాస్తుండగా, వణికే వేళ్ళ మద్య నుంచి కలం జారి పోసాగింది అందువలన లేఖ వ్రాయడం సాద్యం కావడం లేదని ఆమె తన చెలికత్తెలతో మొర పెట్టుకుంది

IV 7 ఒక స్త్రీ తన బర్త దేశాంతర గతుడు కాగా, మొదటి రోజునుంచీ చేతివేళ్ళ మీద రోజులు లెక్కించడం మొదలు పెట్టింది పది వేళ్ళూ పూర్తి కాగానే కాలివేళ్ళను కూడా వాడుకోసాగింది అవి కూడా అయిపోయినా, బర్త ఇంటికి రాకపోయేసరికి, ఇంకా ఎలా లెఖ్ఖపెట్టాలో తెలియక ఏడవడం మొదలు బెట్టింది

ఈ పాటలో అత్తా కోడళ్ళ మద్య గల వైమనస్యం వర్ణింపబడి ఉంటుంది అత్త గయ్యాళి, బర్త తప్పులెన్నేవాడు ఆ యువతి తన విచారాన్ని ఈ క్రింది పాటలో చక్కగా వర్ణిస్తుంది

*అడవిలో ఆడపులి మా అత్తగారు*
*అసలైన పులిబిడ్డ మనువాడి నోడు*
*ఇద్దరీ సందునా ఇరుకునా బడ్డ*
*లేగ దూడా వంటి అరి పేదదాన్ని*

మరొక పాటలో ఒక స్త్రీ తనను సరిగ్గా చూడని బర్తను గురించి అత్త గారి దగ్గర మొర పెట్టుకోవడం కనిపిస్తుంది

*అత్తరావో యత్త అలి నీలవేణి*
*నీ కొడుకు నా వైపు చూడనే రాడు*

అటు జూచు ఇటు జూచు మీదికి జూచు
నేనేల మీ యింట ఊడిగం జేయ
నేనేల మీ యింట దూలాల నెన్న
నేనేల మీ యింట దొడ్డ కసవూడ్చ
మా పుట్టినింటికి సెలవియ్యి అత్త

అంచటితో ఆగక ఆమె తన మామ గారి ముందు కూడ తన బాదనువెలి కక్కుతుంది ఆ మామగారు పరిస్థితులు చక్కదిద్దలేని అసమర్థుడు

ఓ మామ ఓ మామ మా రాచ మామ
మా పుట్టినింటికో సెలవియ్య రండి
కూడు గుడ్డలు కోరి కూచుండ లేను
నగలు నాణేలకూ ఆగుండ లేను
చావైన రాయవేల బ్రహ్మ దేవుండ
చచ్చినా ఒనగూడు స్వర్గ సౌఖ్యాలు

కలవారింటి కోడలికి, అత్తగారింట ఎదురయ్యే అగచాట్లు ఈ పాటలో గమనించవచ్చును పెళ్ళి అయి అత్తింటికి వచ్చిన తరువాత ఆమె తిరిగి పుట్టింటిని చూడలేదు ఒక రోజున అత్తగారి ఆజ్ఞని అనుసరించి, కుంచెడు వడ్లు దంచి, అలసట చెందుతుంది అప్పుడే చెల్లెల్ని చూసి పోవడానికి అన్న వస్తాడు అన్నను చూసి, తన బాదను తలచుకొని ఆమె కళ్ళ నిండా నీరు పెట్టుకుంటుంది అప్పుడు జరిగిన సంఘటనలను ఈ పాటలో చూడవచ్చు

ఏవమ్మ చెల్లెలా
ఏల కన్నీరు
తుడుచుకో కన్నీరు
ముడుచుకో కురులు
ఎత్తుకో బాలుణ్ణి
ఎక్కు అందలము

మీ అత్త మామలకు చెప్పి రావమ్మ-అని అన్న అనగా, అత్తింటి కోడలు అత్త దగ్గరకు పోయి—

కుర్చీ పీట మీద కూర్చున్న అత్తా
మా అన్న లొచ్చారు మం బంపుతారా

అని అడుగుతుంది అందుకావిడ

"నేనెరుగ నేనెరుగ మీ మామనడుగు" అనగానే,
పట్టె మంచం మీద పడుకున్న మామా
మా అన్నలొచ్చారు మం బంపుతారా

అని అడుగుతుంది ఇంట్లో ఉన్న వారంతా తామెరుగమనీ రెండవ వాళ్ళను అడగమనీ తప్పించుకుంటుంటారు చివరకు భర్తను అనుజ్ఞ అడగగా—

కట్టుకో పట్టు చీర
పెట్టుకో నగలు
ఎత్తుకో బాలుణ్ణి
ఎక్కు అందలమూ
మీ పుట్టినింటికీ పోయిరా పాపా - అని అనుజ్ఞ ఇస్తాడు

ఇద్దరి ప్రేమికుల మధ్య సాగే శృంగార గీతంలోని ఈ హాస్యాన్ని గమనించండి

వినండమ్మలారా చెవులారా //వినం//
తమలపాకుతో తా నిట్లంటే
తలుపు చెక్కతో నే నిట్లంటి //వినం//
విసన కర్రతో తా నిట్లంటే
విసుర్రాతితో నే నిట్లంటి //వినం//
చిగురుటాకుతో తా నిట్లంటే
చీపురు కట్టతొా నే నిట్లంటి //వినం//

'గాదా సప్తశతి'లో (4,36) కోడల్ని కన్నకూతురిలా చూసుకున్న కరుణామయురాలైన అత్తగారి కద కనిపిస్తుంది తన కొడుకు దేశాంతర గతుడు కాగా, విరహం వల్ల కృశించిన కోడల్ని బుజ్జగించి, ఆరోగ్యవంతురాల్ని చేసిన అత్త కద అది నా కోడలు బాగుంటే కొడుకు బాగుంటాడు కొడుకు బాగుంటే నేను బాగుంటాను అన్న తత్త్వం ఆమెది

చాలామంది గ్రామీణులకు ఒకరి కంటే ఎక్కువ భార్యలు ఉండడం కద్దు

వారి పాటలలో సవతుల కొట్లాట సర్వసాదారణంగా కనిపిస్తూ ఉంటుంది శ్రీకృష్ణుడు దక్షిణ నాయకుడు ఒకరిపై ఒకరు మాత్సర్యం వహించే తన బార్యలందరినీ, సమాదాన పరచడంలో సతమతమవుతుంటాడు ఆయన ముఖ్య దేవేరులైన రుక్మిణి, సత్యబామలకు ఒక్క క్షణమైనా సమాధానం కుదరదు ఈ క్రింది పాటలో వారి మద్య నడిచే సంబాషణను గమనించండి

| | |
|---|---|
| సత్యబామ | అది అంతే మాబాగు రుక్మిణి |
| రుక్మిణి | ఓ సత్యా నన్ను ఎద్దేవా చేసేవా |
| సత్యబామ | ఎద్దేవా చేయుటకు సరిదానవటవే |
| | నా సరిదానవటవే రుక్మిణి |

ఒక ఎరుకల పాటలో సత్యబామ ఈ క్రింది విదంగా వర్ణింపబడినది

కాముని చేబంతి కలికి సత్యబామ
గొజ్జంగి పువ్వోలె పరమ సుకుమారి

పురాణాలలోని ఎన్నో పాత్రలు, యక్షగానాలలో చిత్రించబడటం కనిపిస్తుంది

## జోల పాటలు, పిల్లల పాటలు

ఆవేశంతోనూ, ఉత్సాహంతోను, పిల్లలను గురించి పాడే జోల పాటలు, వినడానికి చాలా ఇంపుగా ఉంటాయి ·

ఊచవే చెల్లెలా ఉయ్యాల ఊచు
అలిసిపొయి బాలుడూ పవళించినాడు
విశాఖపట్నాన విసిరెనే గాలి
వింజారం రేవుకూ చేరెనే ఓడ
ఓడనూ నడిపేటి సారంగు ఎవరూ
ఓడ ఒడ్డుకు పట్టు రేవు పేరేమి
ఓడనూ నడిపేటి సారంగు నా కొడుకు
ఓడ ఒడ్డుకు పట్టు రేవు మా యిల్లు
ఓడలో ఉన్నట్టి సరుకేమి సరుకు
మంచి ముత్యపు సరులు మాణిక్య రాశి

గోరంత దీపంబు కొండలకు వెలుగు
గోపాల కృష్ణుండు మాయింటి వెలుగు
మాణిక్య దీపమ్ము మేడలకు వెలుగు
మా చిన్ని బాలుండు మా కళ్ళ వెలుగు

తల్లి తన కూతురిని ఉయ్యాలలో ఊపుతూ ఈ విదంగా పాడుతుంది

చిక్కుడూ పువ్వేరుపు
చిలక ముక్కెరుపు
రక్కె సాపండెరుపు
రాగి చెంబెరుపు
తాయెరుపు అమ్మాయి
తన వారిలోన -

పిల్లవాడు ఏడుస్తుంటే సమాదానపెడుతూ

ఏడవకు నా తండ్రి
ఏడవకు బాబు
ఏడిస్తె నీ కళ్ళ నీలాలు నిండు
నీలాలు నిండితే నే జూడలేను
పాలైన నిండవే బంగారు కండ్ల!

తల్లి అంతటితో ఊరుకోక బగవంతుణ్ణి తలచుకుంటూ, తన బిడ్డను పూర్ణాయుర్దాయం కలగాలని వేడుకుంటుంది

కోటంత దేవుడికి
కొండంత పత్రి
పొట్టి నా తండ్రికీ
పూర్ణమాయుష్షూ
బంగారు తండ్రికీ
బ్రహ్మ మాయుష్షూ

శబర స్త్రీలు జోలపాటల్ని ఎంతో ఉత్సాహంతో పాడుకుంటారు కోకిల కూతలకు మల్లే వీళ్ళ పాటలు మనోహరంగా వుంటాయి

ఇక్కడ ఒక బిచ్చగత్తె పాడే పాటను గమనించండి ఇందులో కద ఉత్తర కాండకు సంబందించిన రామాయణ కద సీతను, చాకలివాడు మోపిన నిందకు బయపడి, రాముడు అరణ్యంలో విడిచిపెడతాడు సీత అడవిలో లవకుశుల్ని వాల్మీకి ఆశ్రమంలో కంటుంది ఉయ్యాలలో పెట్టి వారిద్దరినీ ఊపుతూ ఎంతో ఆవేశంతో ఆమె జోల పాటలు పాడుతుంది

ఏడవకు నా తండ్రి లవకుమారా
ఏడవకు నా తండ్రి కుశకుమారా
శ్రీరామ పుత్రులూ చింతేల మీకు
ఏడిస్తె మిమ్మెవ్వ రెత్తుకుంటారు
బంగారు ఉంగరాలు ఉయ్యాల గొనుచు
ఊర్మిళా పినతల్లి వచ్చె నేడవకు
వజ్రాలు తాపినా హారాలు గొనుచు
లక్ష్మణా పినతండ్రి వచ్చె నేడవకు

ఈ పాటలో సీత అనుబవించే విచారమూ, ఆమె మనోబావాలు ప్రతిబింబింపబడ్డాయి ఒకప్పుడు రాణిగా వుండి, ఇప్పుడు అరణ్యంలో విడిచి వేయబడిన ఆమె తన బిడ్డల దుస్థితిని గురించి విచారిస్తుంది ఏనాటికైనా, తన బర్త పిల్లలను దగ్గరకి తీస్తాడని ఆశిస్తుంది ఇటువంటి పురాణ గాదలు జానపద గాయకుల చేత పాడించి మారుమూల పల్లెలలో ప్రచారం చేయిస్తారు

రాముని వలె కృష్ణుడు కూడా, జానపదులకు ప్రీతిపాత్రుడు ఆయన బృందావనంలో గోపికా బృందంతో నెరిపిన రాస క్రీడలు జానపద గీతాల నిండా వర్ణింపబడి కనిపిస్తాయి మహాబాగవతంలో శ్రీకృష్ణ సంబందమైన గాదల్ని వ్యాసమహర్షి సైతం వర్ణించకుండా విడిచి పెట్టలేక పోయాడు గొల్ల పడుచులు శ్రీకృష్ణునికి ఈ విదంగా జోల పాటలు పాడతారు

లాలనుచు పాడరమ్మా
ఈ బిడ్డ లక్ష్మి విలాసుడమ్మా
పాదమున చక్రమమ్మా
ఈ బిడ్డ వేదాంత వేద్యుడమ్మా

వేణు నాదంబులోనూ
ఈ బిడ్డ వేదములు పాడునమ్మా

శ్రీకృష్ణుడికే కాక సన్యాసి అయిన శివుడికి కూడా జానపదులు జోలలు పాడి ఆయన్ని నిద్ర పుచ్చుతారు ఆయన దిగంబరుడు, పంచభూతాత్మక మైన అనిర్వచనీయ రూపం కలవాడు ఆయన మీద పాడే జోలపాట గమనించండి

లాలి శంకర సదా లాలిత కుమారా
లాలి పటు తాండ వోల్లాస మన దీరా
లాలి పంచాస్య కైలాస సంచారా
లాలి మదురాలాప లాలి గంబీర
పతిత పావన రుద్ర పణిరాజభూషా
జితకాలకూట వర్ణిత బవ్య వేషా

మహా పురుషుల పుట్టుకను గురించీ, పిల్లలు పుట్టి పెరుగుతున్న వివిద దశలలో వారి చేష్టాదికాలను గురించీ ఎన్నో పాటలు జానపదుల్లో ఉన్నాయి కృష్ణ జననాన్ని గురించి యీ పాట చూడండి

కస్తూరి రంగ రంగా
మా యన్న కావేటి రంగ రంగా
నిన్నెట్లు మరతునయ్యా మా యన్న
నువ్వు లేక నిలువనయ్యా
దేవకీ గర్బ మందూ మా యన్న
కృష్ణుండవై పుట్టుచూ
కంసునీ సంహరించీ లోకాల
కొమరొప్ప కాచి నావు //కస్తూరి //
ఆదివారమ్మునాడూ శ్రీరంగ
అష్టమీ దిన మందునా
కావు కావని యేడ్చుచూ

అవని యందవతరించీ మాయన్న
భక్తులను బ్రోచినావూ //కస్తూరి//

శిశువు పెరుగుతున్న వివిద అవస్థలను ఈ కింది పాట వివరిస్తుంది బిడ్డ తల్లిని చూసి—

శ్రీ హస్తములను చాచీ
ఓ యమ్మ నన్నేల ఎత్తుకోవూ - అని అడిగితే తల్లి,

పురిటి మైల వదల లేదు కొంచెముండు తండ్రీ - అని, గంగను ప్రార్థించి, గంగాదేవి పైకుబికి రాగా, స్నానమాడి మైలను పోగొట్టుకుంటుంది తర్వాత కామదేనువును ప్రార్థించి, ఆ దేనువు పాలదార కురిపింపగా, తన బిడ్డ నా పాలతో స్నానమాడిస్తుంది ఆ పైన బిడ్డను పొత్తిళ్ళలో పొదిగి, చేతులలోకి తీసుకుని ఆ బిడ్డ అందాన్ని తనివితీరా చూసుకుంటుంది

వసుదేవ తనయుడమ్మా ఈ బిడ్డ
వైకుంఠ వాసుడమ్మా
నవనీత చోరుడమ్మా ఈ బిడ్డ
నంద గోపాలుడమ్మా
జానకీ నాదుడమ్మా ఈ బిడ్డ

శ్రీరామ చంద్రుడమ్మా ఈ బిడ్డ - అని పాడుకుంటూ ఆయన కొస్తు భలాంచనుడనీ, శ్రుతి శిరస్సీమంత ప్రాయాలైన ఉపనిషత్తులు స్తుతించే బిడ్డ అనీ, సర్వ శుబ లక్షణ లాంచితుడనీ, ఈ బిడ్డ రూపరేఖాదులను తీర్చి దిద్దడానికి బ్రహ్మదేవుడు అహర్నిశలూ కష్టపడవలసి వచ్చిందనీ ఆ తల్లి మురిసి పోతుంది

ఈ పాటవంటిదే, పార్వతీ జననాన్ని గురించి మేనక, చెలికత్తెల మద్య సంభాషణాత్మకంగా ఉన్న పాట కూడా అందమైనదే

మేనక గర్బవతియై అలసట ఆవహించగా, నిస్సత్తువగా ఉండి, పాలి పోయి కనిపించ సాగింది అంతట చెలికత్తెలు—

అమ్మా ఇటు రమ్మా
రుచికరమైన పంచబక్ష్య బోజ్యాలను

కైకొన వమ్మా!
కపిల గోవు క్షీరాలతో చేసిన
పాయసాన్ని గ్రహించవమ్మా
కుంకుమ పువ్వు వేసి, దోరగాచిన
అచ్చనావుల పాలను
ఆరగించవమ్మా - అని వేడుకున్నారు

మేనక ప్రసవ సమయం ఆసన్నం కాగా స్త్రీకి మరో జన్మ ఎత్తడం వంటి దనీ, శుభాలు కలగాలని దేవుళ్ళకు మొక్క వలసిందనీ, వృద్ధ వనితల సలహాలను గ్రహించి, తదనుగుణంగా ఆచరించ వలసిందనీ చెలికత్తెలకు చెపుతుంది చెలికత్తెలు మేనక స్థితికి బెంబేలుపడి ఏంచెయ్యాలో తెలియక దిగులు చెందుతారు చివరకు పార్వతి జనిస్తుంది ఆ బిడ్డ అతిలోక సౌందర్యవతి

కన్నులు కలువ రేకుల బోలూ
కురులు తుమ్మెదల బారును బోలూ
చూపులు విరితూపులను బోలూ
మన్మదుని ముంజేతి చిలుక ఆ బాలా
పరమేశ్వరుని అర్ధాంగ లక్ష్మి ఆ పడతీ

'గాదా సప్తశతి'లో క్రీ శ మొదటి శతాబ్దపు పల్లె జనుల సాంఘిక జీవనం తేటతెల్లంగా వర్ణించబడ్డది ఈ క్రింది గాదలు చూడండి

II. 23 "ఇంటి యిల్లాలికి ప్రసవ సమయమాసన్నమైనది అమితమైన ప్రసవ వేదనతో ఆమె తరతర లాడుచుండగా చెలికత్తెలు చెంత చేరి ఆమె భర్తను గూర్చి ముచ్చటించుకొనుచుండిరి అది విని, ఈ బాద కతడే గదా కారకుడని కోపము తెచ్చుకొని, అతని ప్రసక్తి తన దగ్గర తేవద్దని ఆమె చెలికత్తెలను కసరినది"

III 90 ఆమె గర్బవతి బీదరాలు తనలో రేగెడి యెన్నో కోర్కెలను లోలోన అణచివైచుకున్నది చుట్టునున్న చెలికత్తెలు ఆమెకేమి కోర్కెలు కలవో చెప్పుమని తొందర చేయసాగిరి ఆమె తన కాంక్షలను తన లోనే అణచుకొని, నాకేమియు వలదు ఒక పాత్రతో మంచి నీరు తెండు! అది చాలు అన్నది'

## మృత్యువు

హైందవ దర్మశాస్త్రం ప్రకారం మృత్యు సంస్కారం, మనిషి పొందే షోడశ సంస్కారాలలో చిట్ట చివరిది బ్రాహ్మణులకు మిగిలిన వారికంటే, ఎక్కువ సంస్కారాలు విహితమైనాయి ఆయా మనుష్యులు తాము చేపట్టే మత విశ్వాసాలను బట్టి సంస్కారాలు కూడా భేదిస్తూ ఉంటాయి ఉపనయనం కాని వారూ, అవివాహితులూ మరణిస్తే, వారిని దహనం చెయ్యకుండా పూడ్చి పెడతారు మనిషి చనిపోతే అతనితో రక్త సంబందం కలిగిన వారు పట్టే మైల విషయంలో కూడా ఆయా కులాల్ని బట్టి, మనుష్యుల్ని బట్టి, బేదాలు కనిపిస్తుంటాయి

వీరశైవుడు చనిపోతే అతణ్ణి కూర్చున్న స్థితిలో పూడ్చి పెడతారు కొందరు వీరశైవులు మైలను పాటించరు బ్రాహ్మణ క్షత్రియులకు అపరకర్మ కలాపం చాలా నిడివిగా ఉండగా, శూద్రులకు అంత తతంగం ఉన్నట్లు కని పించదు బ్రాహ్మణులు శవాన్ని మౌనంగా స్మశానానికి కొని పోగా, అ బ్రా హ్మణులు మేళ తాళాలతో తీసుకుపోతారు పోయే దారి పొడుగునా, మరమ రాలూ, చిల్లర నాణాలూ, వెదజల్లుకుంటూ పోతారు చనిపోయిన వానికి పొడుం గానీ, చుట్టు తాగడం గానీ, తాగడం గానీ, అలవాటుంటే ఆయా వస్తు వుల్ని చితి దగ్గర ఉంచుతారు ఒక్కొక్కసారి చనిపోయిన మనిషి వాడుకునే పనిముట్లను కూడా సమాధిలో వేసి పూడ్చిపెడతారు

బ్రాహ్మణుల్లో చనిపోయిన వారికి సంవత్సరం వరకూ ప్రతి నెలా పింద ప్రదానం చేస్తారు అబ్రాహ్మణులు, సంవత్సరానికి ఒక్కసారే శ్రాద్ధ క్రియ నిర్వర్తిస్తారు చనిపోయిన పెద్దలకు ఆశ్వయుజ మాసంలోని అమావా స్యనాడు, పితృ దినంగా బావించి, అబ్రాహ్మణులు పిండ ప్రదానం చేస్తారు అవివాహిత కన్యగానీ, వివాహం కాని పిల్లవాడు కానీ, ఉన్న యింట్లో పెద్ద వాళ్ళు పోతే, వాళ్ళకు వివాహపలం దక్కడానికై సంవత్సరం లోపునే పిల్ల లకు పెళ్ళిళ్ళుచేస్తారు ఇటువంటి ఆచారాలు మనిషి మృత్యువును ఆశ్ర యించుకుని కూడా, జానపదుల్లో ఎన్నో కనిపిస్తాయి

# 5
# పండుగలూ-జాతరలు

ఆంధ్రదేశంలో జనం చేసుకునే పండుగలు, దేశంలో మిగతా ప్రాంతాలలో కూడా కనిపిస్తున్నా, ఇక్కడి పండుగల్లో, ప్రాంతీయమైన విశేషాలు మనస్సును ఆకట్టుకుంటాయి పండుగల్ని గురించి తెలుసుకునే ముందు తెలుగు నెలలూ, వాటికి సమానమైన ఇంగ్లీషు నెలలూ మనకు తెలియడం అవసరం

| ఇంగ్లీషు నెలలు | | తెలుగు నెలలు |
|---|---|---|
| మార్చి-ఏప్రిల్ | - | చైత్ర మాసం |
| ఏప్రిల్-మే | - | వైశాఖ మాసం |
| మే-జూన్ | - | జ్యేష్ఠ మాసం |
| జూన్-జూలై | - | ఆషాఢ మాసం |
| జూలై-ఆగస్టు | - | శ్రావణ మాసం |
| ఆగస్టు-సెప్టెంబర్ | - | బాద్రపద మాసం |
| సెప్టెంబర్-అక్టోబర్ | - | ఆశ్వయుజ మాసం |
| అక్టోబర్-నవంబర్ | - | కార్తీక మాసం |
| నవంబర్- డిసెంబర్ | - | మార్గశిర మాసం |
| డిసెంబర్-జనవరి | - | పుష్య మాసం |
| జనవరి-ఫిబ్రవరి | - | మాఘ మాసం |
| ఫిబ్రవరి-మార్చి | - | పాల్గుణ మాసం |

## హిందువుల పండుగలు

### ఉగాది

ఇది తెలుగు సంవత్సరాది చైత్ర శుద్ధ పాడ్యమినాడు దీన్ని జరుపుకుంటారు

ఆంధ్రులే కాక, మహారాష్ట్రులు, కన్నడిగులు కూడా దీన్ని అదే రోజున జరుపుకుంటారు ఆ రోజు ఉత్సాహానికీ, ఆనందానికీ నెలవు ఈ రోజు సుఖం కానీ, దుఃఖం కానీ, ఏది జరిగినా సంవత్సరం పొడుగునా అదే ఫలితం కలుగుతుందని జనులు గట్టిగా నమ్ముతారు ఆవేళ ఇంటిల్లపాదీ వేకువ జామున లేచి, తలార స్నానం చేసి, కొత్త బట్టలు కట్టుకుంటారు ఇంటి గుమ్మాలకు మామిడి ఆకుల తోరణాలు శుభ సూచకంగా కట్టుకుంటారు ఇంటి ముంగిట గోమయంతో అలికి, రంగవల్లులు తీర్చిదిద్దుకుంటారు పూర్ణపు బూరెల్ని ఆనాడు తప్పకుండా వండుకుంటారు వీటిని భక్ష్యాలని అనడం కద్దు కొత్త చింతపండు, కొత్త బెల్లం, మామిడి పిందెలు, వేప పువ్వు అన్నీ కలిపి పచ్చడి చేస్తారు దీన్నే ఉగాది పచ్చడి అని పిలుస్తారు దీన్ని కొత్త మట్టి పాత్రలో ఉంచి దేవుడికి నివేదన చేశాక, ఇంట్లో అందరూ ప్రసాదంగా స్వీకరిస్తారు చేదు, తీపి, పులుపు, వగరు వంటి భిన్న రుచుల సమ్మేళనం, జీవితంలో తటస్థ పడే చెడూ, మంచి, సుఖం, దుఃఖం, వంటి అనేక అనుభవాలకు ప్రతీకలుగా, జనులు భావిస్తారు ఆవేళ స్త్రీ పురుషులు రకరకాల సంతోషదాయకమైన క్రీడల్లో పాల్గొంటారు ఆడపిల్లలూ, మగపిల్లలూ ఉయ్యాల పందేలలో పాల్గొంటారు పురుషులు కోడి పందేలు ఉత్సాహంతో జరుపుతారు సాయంత్రం గుళ్లల్లో గుమిగూడిన జనులు ఊరి పురోహితుడు చెప్పే పంచాంగం విని, కందాయ ఫలాల్ని తెలుసుకుంటారు సంవత్సరం పొడుగూతా, దేశానికి, ఊరికి సంభవించే మంచి చెడ్డల్ని తెలుసుకుంటారు వానలు కురవడం పంటలు పండడం, లేదా కరువు కాటకాలు వాటిల్లడం, అతివృష్టి దోషానికి లోనుకావడం, వంటి ఫలితాలెన్నో ఈ పంచాంగ శ్రవణం వలన జనులకు తెలుస్తాయి పట్టణాల్లో, నగరాల్లో ఆ వేళ కవి పండిత సభలు జరుగుతాయి ఆ రోజున ప్రతి వ్యక్తీ, ఏడాది పొడుగునా, తన జీవిత గమనం ఎలా ఉంటుందో తెలుసుకోవడానికి కుతూహలం చూపిస్తాడు

## శ్రీరామనవమి

ఈ పండుగ చైత్ర శుద్ధ నవమినాడు జరుగుతుంది మహా విష్ణువు అవతారమైన శ్రీరామచంద్రుడు జనించిన శుభ దినం ఆ రోజు సతీత్వానికి పరాకాష్ఠ అయిన సీతాదేవి రాముని అనుగు తమ్ముడు లక్ష్మణుడు, నమ్మిన

బంటు హనుమంతుడు, వీరందరూ ఆ వేళ జనుల చేత పూజలందు కుంటారు ఆ వేళ శ్రీరామజన్మదినమే కాక సీతారాముల కల్యాణదినం కూడా అందుకని ప్రసిద్ధ రామాలయాల్లోనూ, సమావేశ స్థలాల్లోనూ రామ కల్యాణం రంగ రంగ వైభవంగా జరపబడుతుంది పానకం, వడపప్పు విస న కర్రలు పంచి పెడతారు కృష్ణా, గుంటూరు జిల్లాలలో, వీది వీధికీ పందిళ్ళు వేసి, అన్ని పందిళ్ళూ కలుపుకుంటూ, ఎంతో వైబవంగా రామనవమి ఉత్స వాలను నిర్వహిస్తారు ఆ పందిళ్లలో తొమ్మిది రోజులూ, హరికథలు, పురాణ కాలక్షేపం, బజనలు, రామాయణ పారాయణాలు, ఒకటేమిటి ఎన్నో రకాల యిన జనరంజక, ధర్మబోధక ప్రచారాలు చేస్తుంటారు. శ్రీరామనిలయంగా బావించబడే భాద్రాచలం పేరు మోసిన పుణ్యక్షేత్రం రాముడు, తాను అరణ్య వాసం చేస్తున్నప్పుడు సీతా లక్ష్మణ సమేతుడై అక్కడ వాసం చేసి నట్లు కదలున్నాయి శ్రీరామ బక్తుడైన కంచర్ల గోపన్న, భద్రాచలంలో తన దేవుడికి ఆలయాలు కట్టించాడు ఆయన మీద కీర్తనలు వ్రాసి తన భక్తిని వెల్లడించుకున్నాడు జనులు ఆ కీర్తనలనే రామదాసు కీర్తనలుగా వ్యవహ రిస్తూ బక్తితో పాడుకుంటుంటారు

## ఏరువాక పున్నమి

ఆషాడ పూర్ణిమనాడు గ్రామస్థులు జరుపుకునే పండుగ ఇది ముఖ్యంగా ఇది వ్యవసాయదారుల పండుగ వాళ్లు తమ నాగలిని, ఎద్దుల్ని, కాడినీ, ఆ రోజు పసుపు కుంకుమలతో పూజ చేస్తారు కొబ్బరి కాయలు కొడతారు అప్పుడు సంవత్సరంలో తొలిసారిగా, పొలంలో నాగలిని తొమ్మిది చాళ్ళుగా గానీ, ఐదు చాళ్ళుగా గానీ, తిప్పి వ్యవసాయానికి ప్రారంబం చేస్తారు పాయసం వండుకుని పండుగ చేసుకుంటారు కొన్ని చోట్ల ఎద్దుల్ని శుభ్రంగా కడిగి, కొమ్ములకు రంగులూ, ముఖానికి పసుపూ కుంకుమా అద్ది, గిట్టలకు నూనె పూసి, వాటికి పులగం వండి పెడతారు వాటి మెళ్ళో ఆరు బయట ప్రదే శంలో వాటిని స్వేచ్ఛగా తిరగడానికి ఆ రోజు వదలిపెట్టేస్తారు ఊరి మొగన, పచ్చనాకుల తోరణాలు కడతారు పశువులు పగలంతా తిరిగి సందెవేళ ఆ తోరణం కింద నుంచి ఊరిలోనికి ప్రవేశించిన తరువాత, గ్రామస్థులు ఆ తోరణాల ముక్కల్ని పంచుకుని ఇంట్లో దాచుకుంటారు అందువల్ల పాడీ పంటా అబివృద్ధి

చెందుతాయని వాళ్ళ నమ్మకం అదేవిదంగా, పండుగకు ముందు, పిల్లలు, ఊరు గుడి పక్కన నవదాన్యాలను మట్టిలో చల్లి ఉంచుతారు పండుగ నాటికి అవి మొలకలెత్తగా, ఆ మొలకల్ని పెద్దలు తన గాదెల్లో దాచుకుంటారు అందు వలన కూడా తమ పంట వృద్ధి చెందుతుందని వాళ్ళ విశ్వాసం రంగురంగుల వస్త్రాలు దరించిన గ్రామస్థులు, రంగులద్దుకున్న పశు సమూహం, అన్నీ గ్రామాన్ని శోబాయమానంగా వెలిగించే పండుగ ఇది

## నాగుల చవితి

ఈ పండుగను కొన్ని చోట్ల శ్రావణ మాసంలోనూ, మరికొన్ని చోట్ల కార్తీక మాసం లోనూ చేస్తారు శ్రావణ మాసమైతే పంచమినాడూ, కార్తీక మాసమైతే చవితి నాడూ ఈ పండుగ జరుగుతుంది ఆంద్ర ప్రదేశమంతటా నాగపూజ జరుపుకో వడం ప్రాక్చారిత్రక కాలం నుంచీ ఉన్నది ఆంద్రదేశాన్ని నాగభూమి అని పిలి చినట్లుగా బౌద్ధమత సంబందమైన వ్రాతల్లో కనిపిస్తుంది ప్రతి గ్రామంలోనూ నాగ ప్రతిమలను ప్రతిష్ఠించి గ్రామస్థులు పూజ చేసుకుంటుంటారు

సాధారణంగా స్త్రీలు, ఆ రోజు ఉపవాసముండి ఆవుపాలు, పుట్టలో పోసి నాగ దేవతను అర్చిస్తారు వెండితో చేసిన చిన్నచిన్న కళ్ళూ, పడగ లూ, పుట్ట కోనలలో జారవిడుస్తారు కొందరి యిళ్ళల్లో తమ పూజా గృహా లలోనే వెండి, బంగారు నాగ ప్రతిమలు ప్రతిష్ఠించి పూజించుకునే ఆచారం ఉంది చలిమిడి, పానకం, వడపప్పు నైవేద్యం పెడతారు సంతాన వృద్ధి కోసం, సర్పబాధ లేకుండా నివారింపబడడం కోసం, నాగదేవతను అర్చిం చిన వెనుక, పుట్ట మట్టిని, జనులు తమ కళ్ళకూ చెవులకూ, పూసుకుంటా రు దీన్ని పుట్ట బంగారమని వ్యవహరించడం కద్దు నాగ దేవతల మీద ఎన్నో జానపద గీతాలు లభిస్తాయి

## వరలక్ష్మి వ్రతం

శ్రావణ మాసంలో మంగళ, శుక్రవారాలలో నిర్వహించే వ్రతం వరలక్ష్మి వ్రతం సంపద, సంతానం, అబివృద్ధి చెందడానికై స్త్రీలు, ఈ మాసంలో లక్ష్మిదేవిని పూజిస్తారు కన్యలు, గౌరిదేవిని వివాహ ప్రాప్తికై మంగళ వారా లలో పూజ చేస్తారు పువ్వులు, కుంకుమ, పసుపు, కాటుక, కొబ్బరికాయలు, మొదలైన అర్చ వస్తువులతో దేవిని పూజిస్తారు ఆ రోజు తొమ్మిది రకాల

పిండి వంటలు చేసి నైవేద్యమిచ్చి, తొమ్మిది పువ్వులతో తోరాలల్లి తమ చేతికి కంకణంగా దరిస్తారు ముత్తైదువల్ని పిలిచి వాయనాలిస్తారు కొత్తగా పెండ్లయిన వదువులు ఈ వ్రతం తప్పకుండా ఆచరిస్తారు నవ వదువుల చేత ఈ వ్రతాన్ని తల్లి, పుట్టినింట పట్టిస్తుంది

## శ్రీకృష్ణాష్టమి

శ్రావణ బహుళ అష్టమీ దినాన, శ్రీకృష్ణుడు పుట్టిన దినంగా బావించి జనులు ఆయన పుట్టిన రోజు వేడుకల్ని జరుపుకుంటారు శ్రీరామ నవమికి మల్లే ఇది కూడా చాలా ప్రాముఖ్యం వహించిన పండుగ వైష్ణవులకిది యింకా ముఖ్యమైనది కృష్ణ, కేశవ, వేణుగోపాల ఆలయాలు ఆ రోజున అద్భుతంగా అలంకరించ బడతాయి ఉత్సవ విగ్రహాలను వాయిద్యాలతో నూ, బజన మేళాలతోనూ ఊరేగించి, పూజిస్తారు పులిహూర, దద్యోదనం, ప్రసాదాలుగా బక్తులకు పంచి పెడతారు బాలింతలకు ఒళ్ళు ఆరడానికి ఉపయోగించే 'కాయాన్ని' ఆ రోజు తయారు చేసి స్త్రీలకు పంచుతారు కృష్ణ జననం తరువాత దేవకీదేవికి ఇచ్చినందుకు గుర్తుగా దీన్ని పంచి పెట్టడం ఆచారం ఉట్లు కొట్టడం, ఈ రోజున ఆబాలగోపాలం ఆచరించే వేడుక వీదికి అటూ ఇటూ రెండు కర్రలు పాతి వాటికి ఎత్తుగా ఒక తాడు కట్టి, ఉట్లు వేలాడదీస్తారు వాటికి రంగు గుడ్డల్లో జొన్న కంకులూ, డబ్బు, కొబ్బరి కాయలూ కట్టి, కప్పీ సహాయంతో వాటిని కిందికి దించుతూ పైకి లాగుతూ ఉంటారు ఉట్లు అందుకోగలిగిన వాడు విజేత వాడు దాన్ని అందు కోవడానికి వీలు కాకుండా నీళ్లు మొహాన కొడుతూ చూపుకు అడ్డంకి కలిగి స్తుంటారు శ్రీకృష్ణుని ఊరేగింపు జరిగే దోవ పొడుగునా ఈ ఉట్లు కొట్టే వేడుక జరుగుతూ ఉంటుంది

## వినాయక చవితి

బాద్రపద బహుళ చతుర్థి నాడు జరిగే పండుగ ఇది సాదారణంగా హైందవ గృహాలలో ఏ మత ప్రదానమైన చర్య అయినా వినాయక పూజలేనిదే ఆరంబం కాదు ఈయన గణపతి, గజముఖుడు, ఏకదంతుడు, శివ పార్వతుల ముద్దు బిడ్డడు, మూషిక వాహనుడు, విఘ్న నాశంకరుడు ధర్మ మార్గంలో పయ నించే వారికి అడ్డంకులు తొలిగించి జ్ఞానాన్ని ప్రసాదించే దేవర గ్రామాలలో

ఈ పండుగవాడు పూజించుకునే విగ్రహాలను కంసాలి వాళ్ళు మట్టితో తయారు చేస్తారు. నగరాలలోనూ పట్టణాలలోనూ మట్టి విగ్రహాలతో పాటు రంగులు వేసే బచ్చెనబొమ్మలు కూడా అమ్ముతారు ఆ వేళ ఇంటి ముంగిట రంగవల్లులు తీర్చి, తోరణాలు కట్టి, తల స్నానం చేసి, దేవుణ్ణి నెలకొల్పుతారు పైన పాలవెల్లితో, రకరకాల పత్ర, పుష్పాలతో బగవంతుణ్ణి బక్తితో కొలుస్తారు కళాకారులు తమ తమ పరికరాలనూ, పిల్లలు పుస్తకాలను, బగవతీశ్వరం దగ్గర పూజలో ఉంచుతారు నగరాల్లోనూ, పట్టణాలలోనూ ఈ ఉత్సవం తొమ్మిది రోజుల పాటు జరుగుతుంది బజనలూ, ఆటలూ, ప్రదర్శన కళలూ, మొదలైనవన్నీ ప్రదర్శించబడి ఆ తొమ్మిది రోజులూ జనులకు వేడుకనూ ఉత్సాహాన్ని కలిగిస్తాయి దేవుడికీ ఆయన వాహనమైన ఎలుకకూ ప్రీతికరమైన కుడుములూ ఉండ్రాళ్ళూ, నివేదన చేయబడతాయి ఇవి కాక, పాయసం, చలిమిడి, పానకం, వడపప్పు, అప్పాలు వంటి యెన్నో బక్ష్యాలు దేవుడికి నివేదన చేయబడతాయి ఇంటినిండా వినాయక పాద ముద్రల వంటి ముద్రలు ఒత్తుతారు ఆ వేళ యింటిల్లపాదీ, పూజ చేసిన తరువాతనే, ఏదైనా తినడం కానీ, తాగడం కానీ చేస్తారు పూజ అయిన మరునాడు, దేవుడికి ఉద్వాసన చెప్పి, పత్రితోనూ, పువ్వులతోనూ, విగ్రహాన్ని బావుల్లోనో చెఱువుల్లోనో కలిపేస్తారు కొన్ని ప్రాంతాలలో విగ్రహాన్ని చెట్ల పాదుల్లో ఉంచుతారు బాగా వర్షం కురిస్తే ఆ నీటికి, అ మట్టి విగ్రహం కరిగి నీళ్ళలో కలిసిపోతుంది

ఆ రోజు వినాయక వ్రత కదను వినందే జనులు చంద్ర దర్శనం చేయరు అలా చేస్తే నీలాపనిందలు కలుగుతాయని నమ్మకం ఒకసారి శ్రీకృష్ణుడు, పాలు తాగుతూ పాత్రలోని పాలలో ప్రతిపలించిన చంద్రుణ్ణి చూసి, నిందల పాలయ్యాడట సత్రాజిత్తుకు చెందిన శ్యమంతకమణిని ఆయనే దొంగిలించినట్టుగా అనుకోవడానికి చంద్ర దర్శనమే కారణంగా బాసించింది చవితినాడు శ్యమంతకోపాఖ్యానాన్ని చదువుకుని జనం భక్తి పరవశులౌతారు వైష్ణవులకు వినాయకునికి ప్రతిగా, ఆరాదనీయదైవం విష్వక్సేనుడు

**మహాలయామావాస్య**

బాద్రపద అమావాస్య పితృదేవతల పండుగ సూర్యుడు కన్యారాశిలో ఉన్న

ప్పుడు ఈ పండుగను జరుపుకుంటారు ఆ పదిహేను రోజులూ పితృ పక్ష మని పిలువబడుతుంది జనులు గంగా, కావేరి, గోదావరి, కృష్ణ వంటి నదీ తీరాలలో పితృ దేవతలకు ఆవేళ పిండ ప్రదానం చేస్తారు బ్రాహ్మణులు సమంత్రకంగా, వేదోక్తంగా ఈ క్రియ నిర్వహించగా, మామూలు మనుషులు బ్రాహ్మణుణ్ణి పిలిచి స్వయంపాకం ఇచ్చి పితృదేవతలకు తర్పణాలిస్తారు ఈ స్వయంపాకాన్ని కొన్ని ప్రాంతాలలో సాహిత్యమని పిలుస్తారు మాంసా హారులు, ఆ రోజు కల్లు నైవేద్యమిచ్చి మాంస బోజనం చేస్తారు

దసరా

బీదా గొప్పా తారతమ్యం లేకుండా అందరూ చేసుకునే పండుగ ఆశ్వయుజ శుద్ధ దశమినాడు జరుపుకునే పండుగ ఇది ఆ నెలలో 9వ రోజును మహ ర్నవమి అనీ, 8వ రోజున దుర్గాష్టమి అనీ పిలుస్తారు ఈ పండగను దేవీ నవ రాత్రులని పిలిచి, దుర్గాదేవిని ఆరాదిస్తారు దుర్గారాదనలో దక్షిణాచార, వామా చారాలు అని రెండు రకాలయిన విదానాన్ని బక్తులవలంబిస్తారు అన్ని పండు గలకు మల్లే తలంట్లు, ఇళ్ళు కడుక్కొని ముగ్గులు తీర్చుకోవడం, కొత్త బట్టలు కట్టుకోవడం, పిండి వంటలు చేసుకోవడం, ఈ పండుగలోనూ కని పిస్తాయి అంతేకాక, క్షత్రియులు కత్తులు కటార్లు, పెట్టి ఆయుధ పూజ చేస్తారు వైశ్యులు తూనిక రాళ్ళనూ, కొలతలనూ, రైతులు నాగలి మొద లైన పనిముట్లను, ఇతరులు వారి వారి వృత్తికి సంబందించిన పరికరాలను, విజయదశమి నాడు పూజిస్తారు తర్వాత అందరూ విందు భోజనాలతో సంతోషిస్తారు మాంస బోజనులకూ, కల్లుతాగే వారికి ఇది చాలా సరదా అయిన పండుగ గ్రామాలలో బీదవాళ్ళు కూడా కల్లు తాగి, తందనాలు తొక్కుతూ, పాత పగల్ని రేకెత్తించుకుని కొట్లాటలకు దిగుతుంటారు సాయం త్రాలు గ్రామాలలో రచ్చబండల దగ్గరా, గ్రామ కూటాలలోనూ గుమిగూడి దేవతలను అర్చిస్తారు గొర్రెల్ని, మేకల్నీ బలి యిచ్చి రక్త తర్పణం చేస్తారు ఆ రక్తం చుక్క బొట్టులాగా పెట్టుకుంటే, దుష్టశక్తులూ, పిశాచాలూ పారిపో తాయని జనుల నమ్మకం తర్వాత జనులంతా గుంపుగా, తప్పెట్లు మోగు తుండగా, ఊరేగింపుగా ఊరి బయట జమ్మి చెట్ల దగ్గరికి పోతారు ఆ ఊరే గింపులో పులి వేషాలు, గరిడి సాములు, బాణా సంచా పేలుడు, అన్నీ ఉండి

చూపరులకు వేడుక కలిగిస్తుంది జమ్మి చెట్ల దగ్గరకి పోయాక, ఊరి బ్రాహ్మడు శమీ పూజచేస్తాడు ఊరి కరణం, మునసబు, 'జమ్మి క్రింది వ్రాతలు' అని కొన్ని వ్రాతలు వ్రాసి వాటిని బాణవు చువ్వకు చుట్టి చెట్టుకు గురి చూచి కొడతారు ఆ వ్రాతల్లో, పలానా ప్రాంతం పలానా వారిదనీ, పలానా ప్రాంతం సుభిక్షంగా ఉందనీ—ఇటువంటి విషయాలు వ్రాయబడి ఉంటాయి తర్వాత అందరూ జమ్మి ఆకులు కొన్ని సంతరించుకుని యింటి ముఖం పడతారు స్త్రీలు ఇళ్ళ ముందు వాళ్ళ వాళ్ళ హారతి పళ్ళేరాలతో ఎదురై మంగళ వాచకం పలుకుతారు ఇళ్ళ దగ్గరున్న వారికి జమ్మి ఆకుల్ని పంచి పెడతారు వాటిని బంగారమనీ వ్యవహరిస్తారు కొన్ని స్థలాలలో శమీపత్రాలకు బదులు 'గార' పత్రాలు పంచిపెడతారు

కొన్ని ప్రాంతాలలో దసరా ఉత్సవాన్ని ఇంకోవిదంగా జరుపుకుంటారు సాయంకాలపు ఉత్సవంతో పాటు ఉదయ వేళ కొందరు 'పారు వేట' నిర్వహిస్తారు స్త్రీలు, ఆడ పిల్లలూ, బొమ్మల కొలువు పెడతారు గ్రామాలలో బడి పిల్లలను అయ్యవారు ఇంటింటికి తీసుకుపోతాడు మగపిల్లలు చేతుల్లో విల్లంబులు, ఆడపిల్లలు చేతుల్లో కోతి గడలు, జండాలు దరించి,

"అయ్యవారికి చాలు అయిదు వరహాలు
పిల్ల వారికి చాలు పప్పు బెల్లాలు"

అని పాడుతూ తిరుగుతారు ఇంటి పెద్ద మీద బుక్కా, గులాల్ చల్లి వాళ్లు పెట్టిన తీపి తిని, సంతోషిస్తారు ఈ రకమైన ఆచారం ప్రభుత్వ పాఠశాలలు ప్రాచుర్యంలోకి వచ్చాక వెనక బట్టిందనే చెప్పవచ్చును

కొన్ని కొన్ని ప్రాంతాలలో యువకులు రాణాప్రతాప్, నేతాజీ, మహాత్మా గాందీ, పురాణ పాత్రలు మొదలైన వేషాలు దరించి ఊరేగింపులో కలిసి శమీయాత్ర చేస్తారు

### దీపావళి

ఈ పండుగ ఆశ్వయుజ బహుళ చతుర్దశి నాడు వచ్చే పండుగ దీన్నే నరక చతుర్దశి అని అంటారు శ్రీకృష్ణుడు తన ప్రియ బార్య సత్యబామతో దండెత్తిపోయి నరకాసురుని సంహరించిన రోజు నరకసంహారం వల్ల కలిగిన ఆనందాన్ని టపాకాయలు కాల్చడం ద్వారా జనం వ్యక్తం చేస్తారు ముఖ్యంగా

ఇది పిల్లలకు నిజమైన పండుగ నరక వద వలన కలిగిన ఆనందాన్ని ఇంటింటా దీప మాలికల్ని వెలిగించడం ద్వారా వ్యక్తం చేస్తారు ఈ పండుగకు కొత్తగా పెండ్లయిన కూతుళ్లను అల్లుళ్ళతో పాటు ఇంటికి పిలిచి కొత్త వస్త్రాలిచ్చి, కానుకలు కురిపించి గృహస్థులు తృప్తి పడతారు వర్తకులు ఈ వేళ దనలక్ష్మిపూజ నిర్వహించి, కొత్త ఖాతా పుస్తకాలను ప్రారంబిస్తారు యువకులు రెండు జట్లుగా చేరి, కృష్ణ నరకాసుర యుద్ధ సంరంబాన్ని అనుకరిస్తూ ఒకరి వైపుకు మరొకరు జిల్లీలు విసురుకుంటారు సురేకారంతోనూ, గంధకంతోనూ బొగ్గుపొడిని కలిపి, తయారు చేసే బాణాసంచా జిల్లీలు ఇవి రవ్వలు చిమ్ముకుంటూ దూసుకు పోతాయేగాని పేలవు

## సంక్రాంతి

దీన్ని మకర సంక్రాంతి అని పిలుస్తారు ఇది సౌరగతిని పట్టి నిర్ణయింపబడే పండుగ సూర్యుడు మకర రాశిలో జనవరి 14వ తేదీన ప్రవేశిస్తాడు ఆనాటి నుంచీ ఉత్తరాయణం ప్రారంబమవుతుంది ఉత్తరాయణ ప్రారంబ కాలాన స్వర్గ ద్వారాలు, ముఖ్యంగా వైకుంఠ ద్వారాలు తెరచి ఉంటాయని జనులు నమ్ముతారు ఇంతేకాక, ఈ పండుగ వ్యావసాయికుల పండుగ దీన్ని గ్రామస్థులు కొన్ని ప్రాంతాలలో పెద్ద పండుగ అని వ్యవహరిస్తారు ఆంధ్రదేశంలో, ఈ కాలం పంట యింటికివచ్చే కాలం కొత్త దాన్యం ఇంటికి వస్తుంది కాయగూరలు, పాలు పెరుగు పుష్కలంగా దొరుకుతాయి ఇళ్ళముందు తీరు తీరుల ముగ్గులు తీర్చి, గొబ్బిళ్ళు పెట్టి ఆడపిల్లలు ఆనందిస్తారు ఒక విదంగా ఇది ముగ్గుల పండగ ఇంటికి కూతుళ్ళనూ, అల్లుళ్ళనూ ఆహ్వానిస్తారు సంక్రాంతికి ముందు రోజును బోగి అనీ తరువాతి రోజును కనుము అనీ వ్యవహరిస్తారు బోగినాడు తెల్లవారక ముందే బోగిమంట వేసి యింటిల్లపాదీ తలస్నానాలు చేస్తారు ఆ రోజు చిన్న పిల్లలను కూర్చోబెట్టి రేగుపండ్లను, చిల్లర నాణేలనూ, కలిపి తలమీద పోసి, పెద్దలు ఆనందిస్తారు దీన్ని బోగిపళ్ళు పొయ్యడమంటారు

సంక్రాంతి నాడు, గ్రామమంతా కొత్త బట్టలతో కలకల లాడుతుంది దర్మాన్ని యాచించే బిచ్చగాళ్ళతో వీదులు నిండిపోతాయి డప్పుల వాండ్లు, బుడబుక్కల వాళ్ళు, దాసరులు, జంగాలు, గంగిరెద్దులవాండ్లు వీదులలో, ఇళ్ళ

ముందు, సందడి చేస్తూ తిరుగుతుంటారు బంతి పూల తోరణాలు ఇంటి వాకి ళ్ళను కలకలలాడిస్తుంటాయి ఆ వేళ యింటి చాకలికి, మంగలికి, కమ్మరి, వడ్రంగి మొదలైన వృత్తుల వాండ్లకు, ఇంటి పని మనుషులకు పాలేళ్ళకు, గ్రామానికి సంబందించిన బారిక మొదలైన పనుల వాండ్లకు, రైతు అన్నం పెట్టి ఆదరించడం ఆచారం

కనుము, బాగా విందు చేసుకునే మాంసాహారుల పండుగ అని చెప్ప వచ్చు తాగడం, తినడం, ఈనాటి వేడుకల్లో ఒకటి కోడి, పొట్టేలు, దున్న పోతుల పందేలు జరిపి జనం వినోదం చెందుతారు ఆవుల్నీ ఎద్దుల్నీ బాగా అలంకరించి, పొంగలి తినిపించి, సాయంత్రం వాటిని ఊరేగిస్తారు ఈ తతంగం, కనుము మరునాడు చేస్తారు ఆ రోజు ముక్కనుమంటారు

సంక్రాంతికి గాలి పటాలు ఎగరేసే ఆచారం కొన్ని ప్రాంతాలలో కనిపి స్తుంది ఈ సంక్రాంతిని తిల సంక్రాంతి అని కూడా వ్యవహరిస్తారు నువ్వుల పంట ఇంటి కొస్తుంది తలారా స్నానం చేసేటప్పుడు నువ్వులూ, ఉసిరిక పప్పూ కలిపి నూరి ఒంటికి పట్టిస్తారు బియ్యమూ బెల్లమూ కలిపి కొద్దిగా నువ్వులు వేసి పొంగలి చేస్తారు కొన్ని ప్రాంతాలలో చక్కిలాలు చేస్తారు ఇవీ బియ్యపిండిలో నువ్వులు కలిపి చేసే కారాలు నువ్వులూ, బెల్లమూ కలిపి దంచి ఉండలు కడతారు

### మహాశివరాత్రి

మాఘ బహుళ చతుర్దశి నాడు మహా శివరాత్రి వీర వైష్ణవులు తప్ప హిందు వులందరూ ఆ నాడు శివుణ్ణి పూజిస్తారు ఈ శివరాత్రి ప్రాశస్త్యాన్నీ, మహత్త్యాన్ని గురించి పురాణాలు ఘోషిస్తుంటాయి త్రికాలాతీతుడూ, సర్వ శక్తి మంతుడూ అయిన శివుణ్ణి స్తుతించే పండుగ ఇది ఈ వేళ (1) జనులం దరూ దినమంతా ఉపవాసం చేస్తారు (2) రాత్రంతా మేలుకుని జాగరణం చేస్తారు (3) శివలింగాన్ని పూజిస్తారు ఎంత బీదవాడైనా ఆ నాడు శివుణ్ణి కొలవకుండా ఉండడు అన్ని పండుగలకు మల్లే ఆడంబరంతో కూడి బక్తు లకు ఖర్చు కలిగించే పండుగ కాదు ఆంధ్రదేశంలో ఒకప్పుడు శైవం ముమ్మ రంగా వ్యాపించి ఉండేది ఆ రోజుల్లో వెలిసిన ఎన్నో శైవ దేవాలయాలలో ఈనాటికీ పూజాదికాలు జరుగుతూనే ఉన్నాయి ఈ దేవుడికి నెయ్యి, పండ్లు

పెరుగు, పాలు, తేనె, పూలు, పాయసము మొదలైన ఖరీదైన వస్తువులతో పూజచేసి అబిషేకం నెరిపినట్లుగానే, నీళ్ళు, ఆకులు వంటి ఖర్చులేని వస్తువులతో కూడా అబిషేకం చేసి, ఆయనను తృప్తి పొందించవచ్చు మారేడు, పత్రి, గన్నేరు, నాగమల్లె పువ్వులూ ఈ దేవుడికి మిక్కిలి ప్రియమైన వస్తువులు

వీరశైవు లీయన్ని షట్కాలాలలో ఆరు సార్లు పూజిస్తారు లింగోద్భవ సమయమైన అర్ధరాత్రి ఈయన్ని అర్చించడానికి అనువైన వేళ శివరాత్రి జాగరణ చేసే సమయంలో బజనలు, పురాణ కాలక్షేపాలు మొదలైనవి జరుగుతూ, శివ లీలల్ని కీర్తిస్తుంటాయి రాత్రికి ఉపవాసమూ జాగరణ పూర్తి అయిన వెనుక, శివపూజ చేసి శివరాత్రి అర్చనను పరిసమాప్తం చేస్తారు దనవంతులైన వాళ్ళు శివబ్రాహ్మణులకు, శివయోగులకు, దానాలిచ్చి, వాళ్లను సంతృప్తి చెందిస్తారు శ్రీశైల, కాళేశ్వర, దాక్షారామ, అమరావతి, మహానంది, వేములవాడ, ఐనవోలు, కాళహస్తి, మొదలైన క్షేత్రాలలో, బక్తులు వేలాదిగా గుమిగూడి, శివపూజనం చేసి, శివరాత్రి మహోత్సవాన్ని జరుపుకుంటారు

మొత్తం హైందవ సంఘమంతా జరుపుకునే ఈ పండుగలే కాక, కొన్ని ప్రాంతాలకు మాత్రమే చెందినవీ, కొన్ని సమూహాలు మాత్రమే జరుపుకునేవి, ఎన్నో పండుగలు ఆంధ్రదేశంలో కనిపిస్తాయి

## కాముని పున్నమ

దీన్ని హూలీ అని కూడా పిలుస్తారు పాల్గుణ పూర్ణిమ నాడీ పండుగను జరుపుకుంటారు ఇది ఆంధ్రదేశంలో తీర ప్రాంతాలలో లేదు రాయల సీమలో స్వల్పంగానూ, తెలంగాణాలో ముమ్మరంగానూ ఇది వ్యాప్తిలో ఉంది ఇది ఉత్తర హిందూస్థానం నుంచి తెలంగాణా ప్రాంతాలకు దిగుమతి అయిన పండుగ ఈ ప్రదేశాలలో ఉండే మార్వాడి రాజపుత్ర జాతులకు చెందిన జనులు దీన్ని మిక్కిలి ఆనందోత్సాహాలతో జరుపుకుంటారు పూర్ణిమ నాడు కాముని దిష్టి బొమ్మను తగలబెట్టి, దుష్టశక్తి నశించినందుకు సూచనగా, ఆనందంతో ఒకరిమీద మరొకరు వసంతం చల్లుకుని, ఆ పైన తలార స్నానాలు చేసి తీపి తింటారు ఇంతకూ కాముడంటే మనస్సులో పీఠం వేసుకున్న అలివిమాలిన కోరిక

## భీష్మైకాదశి

బీష్ముడు, గంగాశంతనుల పుత్రుడు కురువంశ బూషణుడూ, కురు పాండవయుద్ధ కాలంనాటికి మిగిలిన వృద్ధుడూ। ఆయన స్వచ్ఛందంగా తన యిష్టం వచ్చినప్పుడు మరణించే వరం కలిగిన వాడు దక్షిణాయనంలో ఆయన యుద్ధంలో క్షతగాత్రుడు అయినా, ఉత్తరాయణ పుణ్య కాలం ప్రాప్తించిన వెనుక, మాఘ ఏకాదశినాడు మరణించ సంకల్పించాడు బీష్ముడు అవివాహితుడు కనుక అపుత్రకుడు అందువల్ల జనులు ఆయన్ని తమ తండ్రిగా బావించి, తర్పణాలు వదలడానికి బీష్మైకాదశిని జరుపుకుంటారు ఆ రోజు బ్రహ్మ, క్షత్రియ కులాలకు చెందిన వారు, బ్రాహ్మణుల ద్వారా బీష్మ జీవన కదను విని, వాళ్ళకు స్వయంపాకాన్నీ, డబ్బునూ ఇచ్చి సంతోషింపజేస్తారు

## మార్గశి

రామానుజ మతస్థులైన వైష్ణవులు మార్గశీ పూజను జరుపుతారు ఈ పూజ మార్గశిర మాసమంతా జరుగుతుంది శ్రీరంగనాదుని ప్రియురాలూ, బార్యా అయిన గోదాదేవి మహాబక్తురాలు, ఈమె వైష్ణవ ముని ప్రవరులైన పన్నిద్ద రాళ్వారులలో ఒక్కతె ఈమెకు చూడికుడుత్త, ఆండాళ్ అనే పేర్లు కూడా ఉన్నాయి ఈమె రచించిన వైష్ణవ బక్తి గీతాలను పాశురాలంటారు పాశురాలను భక్తులు, మార్గశిర మాసమంతటా, తెల్లవారు ఝామున నాలుగు గంటలకే లేచి పారాయణం చేస్తారు ఇది నెల రోజుల పాటు జరిగిన వెనుక, గోదా-రంగనాదుల కల్యాణంతో మార్గశి వ్రతం ముగుస్తుంది

## కేచదమరు

ఆదిలాబాద్ జిల్లాలో ఉట్నూరు తాలూకాకు చెందిన ఆటవిక తెగలు ఈ పండుగను జరుపుకుంటారు ఇది కేవలం అవివాహితలైన పడుచులకు మాత్రమే ఉద్దేశింప బడ్డది ఇది శ్రావణ అమావాస్యనాడు జరుగుతుంది మదుర జాతికి చెందిన కన్యలందరూ ఊరి నాయక్ ఇంటి ముందు గుమిగూడుతారు డప్పులు మోగుతుండగా వాళ్ళు గురువును గురించి పాటలు పాడతారు సెనగ పప్పూ బెల్లం తయారు చేసిన గోగ్రి అనే తీపివంటకం తింటారు ఇట్లా తొమ్మిది రోజులు చేసి 10వ రోజున సెనగలో, గోదుమలో, తడిమట్టి తెచ్చి అందులో

చల్లుతారు ఆ మట్టిని పలాశ పత్రంలో ఉంచుతారు. ఇట్లా ఉంచడాన్ని 'దోపీ' అని పేరు మళ్ళీ పూర్ణిమ వచ్చేవరకూ ఆగి, ఆనాడు మదురా జాతికి చెందిన పురుషుల చేతులకు రాఖీ తోరాన్ని కడతారు అప్పుడు ఆ ఆడపిల్లలకు కానుకలిచ్చి సంతోషపెట్టాల్సి ఉంటుంది ఆ తరువాత మూడు రోజులపాటు ఆడపిల్లల సామూహిక గానం, కొనసాగిన తరువాత, మూడవ రోజున ఆడపిల్లలు ఉపవాసం చేసి, మట్టితో స్త్రీ దేవత బొమ్మను తయారు చేసి యింట్లో ఉంచి పూజిస్తారు ఇట్లా చెయ్యడాన్ని "తీజ్" అని పిలుస్తారు నాలుగవ రోజున ఆడపిల్లల అన్నదమ్ములు, తమ అప్ప చెల్లెళ్ల దగ్గరున్న మట్టి విగ్రహాలను తన్ని తోసేస్తారు అప్పుడు వాళ్ళ బొమ్మల్ని నాయక్ ఇంటి ముంగిటికి తీసుకు పోయి అక్కడే వాటిని ఉంచేస్తారు అప్పుడు మదురా తెగకు చెందిన పురుషులు ఆబాలవృద్ధమూ అక్కడ చేరి విగ్రహాల చుట్టూ పాటలు పాడుతూ నృత్యం చేస్తారు నాయక్ అందరికి టీ తాంబూల మిస్తాడు అప్పుడు ఆడపిల్లలు విగ్రహాలను జల నిమజ్జనం చేసి, అంతకు ముందు మొలక లెత్తించిన మొక్కలను పురుషులందరికీ పంచి ఇంటి ముఖం పడతారు

## ఆయక్ లేక భీమన పండుగ

ఉట్నూరు తాలూకా, ఆదిలాబాద్ జిల్లాలోని లయింది గూడాలో నివసించే కోలామ్ జాతి జనులు జరిపే పండుగ ఇది ఇది డిసెంబర్ నెలలో వచ్చే పండుగ. కోలామీల ముఖ్యదేవత బీమన్న ఆయనకే మరొక పేరు బీమ్‌దేవ్ ఆ దేవత ప్రతిమ ఒక చెక్క గొడ్డలిలా ఉంటుంది దానికి నెమలి యీనెల అలంకారం చేస్తారు దీనిని 'పెర్' అని పిలిచే కుండ మీద ఉంచి, ఆ కుండకు గజ్జెల పట్టెడ బిగిస్తారు పక్కన మట్టితో చేసిన చిన్న చిన్న ప్రతిమలుంచుతారు. ఒక గురువారం, భీమన్న దేవుడి చిహ్నాల వన్నిటినీ తెచ్చి ఊరి మధ్యలో నెలకొల్పుతారు దాని మీద పచ్చనాకుల పందిరి వేస్తారు మొదటి రోజు కోడిని కానీ మేకను గానీ బలి యిస్తారు రెండవ రోజున అక్కడ నుంచి దేవతా ప్రతిమను మోడంలొద్ది అనే కొండ వాగు దగ్గరికి తీసుకుపోయి అందులో స్నానం చేయిస్తారు తిరిగి మొదటి చోటుకు కొని తెచ్చి ఊరంతా ఉమ్మడిగా కొన్న దున్నపోతును బలియిస్తారు తరువాత ఎవరికి వచ్చినట్లు

వారు వ్యక్తిగతంగా కానుకలనూ, బట్టలనూ దేవర కర్పిస్తారు తరువాత ఉమ్మడిగా బలియిచ్చిన పోతును వండి, ఆ ప్రసాదాన్ని ఊరంతా కలిపి భుజిస్తారు ఈ నైవేద్యాన్ని ఉపయోగించే ముందు, ఆ జాతికి సంబంధించిన వేల్పులోడు, జొన్నల్ని వండి ఆ అన్నాన్ని బలి జంతువు రక్తంతో కలిపి ఊరి చుట్టూ తిరిగి నాలుగు వేపులా పొలిమేర రాళ్ళమీద ఉంచి తిరిగి వస్తాడు మూడవ రోజున ఊరి మద్య నుంచి దేవత తన నిజస్థానానికి తిరిగి పోగానే పండుగ ముగుస్తుంది ఇది కేవలం కోలామీ జాతికి చెందింది ఈ పండుగ చేసుకునే రోజుల్లో ఇతర జాతి మనుష్యులెవ్వర్నీ కోలామీ జాతి వారు రానీయరు

## సంతలూ-ఉత్సవాలూ

సంతలు ఆంధ్రదేశంలో విరివిగా జరుగుతాయి ఒక్కో ప్రదేశంలో వారానికి ఒక్కొక్క రోజున, ఆ చుట్టుపక్కల నుంచి మనుష్యులు, తమ సరుకును మారకం వేసుకోవడానికీ, అమ్ముకోవడానికీ, లేదా తమకు కావలసిన వస్తువుల్ని కొనుక్కోవడానికి వచ్చి చేరుతుంటారు అనగా వారానికొక రోజున ఒక్కొక్క ప్రదేశం వ్యపార కేంద్రంగా మారుతుంటుంది అక్కడ నిత్యావసర వస్తువులే కాక, విలాస వస్తువులు కూడా దొరుకుతాయి ఈ సంతను అంగడి అని కొన్ని ప్రాంతాల్లో వ్యవహరిస్తారు

ఉత్సవాలకు మత ప్రాదాన్యం ఉంటుంది వాటిని ఆచరించే కాలం నియమితమై ఉంటుంది అప్పుడు ఆరాదింపబడే దేవతలు పురాణోక్త దేవతలు కాక, గ్రామ దేవతలై ఉంటారు ఈ ఉత్సవ సమయాల్లో మొక్కుకున్న వారు తమ తమ మొక్కుల్ని తీర్చుకుంటారు తల నీలాలివ్వడం, బలులివ్వడం, సిడులు వ్రేలడం, మొదలైనవి యీ మొక్కుల్లో కొన్ని తలనీలాలివ్వడం సర్వసాదారణంగా మొక్కుకునే మొక్కుల్లో ముఖ్యమైనది ఈ నీలాలివ్వడం రెండు రకాలుగా కనిపిస్తుంది పిల్లలు పుట్టిన అయిదేండ్ల లోపు, పుట్టు వెంట్రుకలు తీయాలనే ఆచారాన్ననుసరించి వెంట్రుకలు తీయడం ఒక రకం పెద్ద వారైన తరువాత ఏ ఆపద సందర్భంలోనో భగవంతుని ప్రీతికి పాత్రం కావడం కోసం యిచ్చే మొక్కు రెండవ రకం-ఉత్సవ సమయాల్లో కోటప్ప కొండ, కోరుకొండ, తిరుపతి, సింహాచలం మొదలైన ఎన్నో

క్షేత్రాలలో తలనీలాలివ్వడం జరుగుతుంది ఈ మొక్కుకు శైవ వైష్ణవ మత బేదం లేదు

ఆంధ్రదేశంలోని దేవతల ఆకారాలు చిత్ర విచిత్రాలుగా ఉంటాయి పీఠాపురంలో దేవుడు కోడి ఆకారంలో ఉంటాడు ఆయన కుక్కుటేశ్వరుడు పట్టిసంలో కౌగిలించే బాహువుల రూపంలో లింగాకారిగా శివుడు కనిపిస్తాడు మండపాకలో కాకతి దేవత డమరుకాన్ని వహించి సృష్టిలో ఉన్న ధ్వన్యాత్మక లయను చాటుతూ ఉంటుంది ఆచంటలో లింగం స్త్రీ వక్షస్థల రూపంలో ఆరాదింపబడుతుంది ర్యాలిలో జగన్మోహినీ శివ విష్ణుల స్వరూపాన్ని ఏక మూర్తిగా బాసింప జేసే విగ్రహం సుందరంగా దర్శన మిస్తుంది

జాతరలు, ఉత్సవాల సమయంలో, గ్రామ దేవతలతో పాటు, స్థానిక వీరులు కూడా అర్చింపబడతారు వీరులతో పాటు బర్త మరణం వల్ల సహగమనం చేసిన పేరంటాండ్రు కూడా అర్చింపబడతారు ఉయ్యూరులో ఒక పేరంటాలి జాతర చాలా సంబరంతో జనులు నిర్వహించడం ఈనాటికీ ఉంది ఒక భూస్వామి, ఒక నవ వదువు సౌందర్యానికి ఆశపడి ఆమె బర్తను చంపిస్తాడు అది గ్రహించి ఆమె బర్తతో పాటు చితి యెక్కుతూ, ఆ భూస్వామి వంశం నిర్వంశం కావాలని శపిస్తుంది అంతేకాక, కూలి పోయిన అతని ఇంటిమీద తాను ఉయ్యాల ఊగుతానని శపదం చేస్తుంది అందువల్ల ఆ పేరంటాలి జాతర నిర్వహించేటప్పుడు, వెనుక ఆ భూస్వామి ఉన్న ఇంటి స్థలంలో ఉయ్యాల కట్టి, ఆ దేవత విగ్రహాన్ని ఉంచి ఉయ్యాల ఊగిస్తారు ఇటువంటి పేరంటాండ్రు ఆంధ్రదేశం నిండా కోకొల్లలు

పల్నాటి వీరచరిత్రకు కార్య స్థానం కార్యమపూడి దీన్ని జనులు కారెంపూఢి అని వ్యవహరిస్తారు ఇది బారతకదలో జరిగినట్లుగానే అన్నదమ్ముల మధ్య జరిగిన యుద్ధానికి సంబందించిన వీరుల కద ఈ యుద్ధ కదను మౌఖిక ప్రచారంలో బందించి, జానపద వీర గాయకులు ఇప్పటికి పాడుతుంటారు ఈ యుద్ధాన్ని గుర్తుకు తెచ్చుకునే పల్నాటి వీరుల ఉత్సవం ప్రతి సంవత్సరము జరుపుకుంటుంటారు అప్పటి వీరులు వాడిన ఆయుధాలుగా చెప్పబడే వాటిని నాగులేరులో కడిగి, వాటిని పూజిస్తారు వాటికి బలి యిచ్చి సంతృప్తి కలిగిస్తారు ప్రతి వీరునీ పేరు పేరునా పిలిచి గుణగణాలను గానం చేస్తారు

బక్తులు మొక్కుకునే మొక్కులూ, దేవతల్ని పూజించే విదానమూ, చిత్ర విచిత్రాలుగా ఉంటాయి కొందరు తామున్న ప్రదేశాన్నుంచి దైవ సన్నిదికి కాలినడకన వస్తామని మొక్కుకుంటారు కొందరు కోళ్ళు, మేకపోతులు మొదలైన జంతువుల్ని బలి యిస్తామని మొక్కుకుంటారు దేవత ముందు అన్నం కుప్పగా పోసి, పోతును బలి యిచ్చి, ఆ రక్తాన్ని అన్నంతో మిశ్రమం చేసి, దాన్ని బద్రంగా యిళ్ళల్లో దాచుకోవడానికి బక్తులందరికి తలా కాస్త పంచే పూజా విదానం ఒకటి ఉంది

కోటప్పకొండ తిరునాళ్ళకు ప్రబలు కట్టే మొక్కుబడి ఉంటుంది వెదురు కర్రతో దీర్ఘ చతురస్రంగా పొడవైన ఆకారాలు నిర్మించి పైన ముక్కోణంగా అగ్ర బాగాన్ని అమర్చి, రంగు రంగుల గుడ్డలతోనూ, కాగితాలతోనూ వాటిని కప్పుతారు వాటి మీద రకరకాల బొమ్మలూ, నగిషీలు లిఖించి కన్నుల పండువుగా ప్రబల్ని తయారు చేస్తారు వాటిని బలమైన యెద్లు పూన్చిన బండ్ల పైకెక్కించి కోటప్ప కొండకు తీసుకొని పోతారు ప్రబకు చివర గంటలనూ, కలశాలనూ, దీపాలనూ ఉంచడం కద్దు ఈ దీపాలను ఆకాశదీపాలని పిలుస్తారు దీపం జ్ఞానానికి సంకేతం జ్ఞాన చోదకులకు ఈ ఆకాశ దీపం సంకేతం ఈ ప్రబలు కట్టే సంప్రదాయం శైవ సంప్రదాయం

నిప్పు తొక్కే ఆచారమూ దాన్ని మొక్కుగా తీర్చే ఆచారమూ కొన్ని చోట్ల కనిపిస్తుంది నెల్లూరులో రెండు వీరబద్రాలయాలున్నాయి వీరభద్రుడు, దక్షాద్వరాన్ని ధ్వంసం చేయడానికి శివునిచే కల్పింపబడ్డవాడు శివునికి దక్షుడు చేసిన అపమానానికి ప్రతీకారంగా ఆయన యజ్ఞ ధ్వంసం చేయడం చాలా బయంకరంగా చిత్రింపబడ్డది అందువల్ల ఈ దేవుణ్ణి ఆరాదించే బక్తులు, నిప్పు తొక్కే ఆచారాన్ని పాటిస్తారు

నిప్పు తొక్కే కార్యక్రమం ఈ కింది విదంగా ఉంటుంది గుడి ఆవరణలో ముందు బాగాన దీర్ఘ చతురస్రాకారంగా పెద్ద గొయ్యి తవ్వుతారు ఇంటింటి నుంచీ వంట కట్టెలు పోగు చెసి అగ్ని గుండాన్ని రగిలిస్తారు నిప్పుతొక్కే పనికి ఒడి కట్టే వారు, మొక్కుకున్నవారు కాక, పూజారి కుటుంబానికి చెందిన వారై ఉంటారు అంతకుముందు ఆహార విహారాలను నియమబద్దం చేసి, దేవాలయ తటాకంలో స్నానం చేసి, నిప్పు తొక్కడానికి సిద్ధంగా

ఉంటారు. అంతకు ముందుగా దేవతా విగ్రహాన్ని ఊరేగించి, అగ్ని గుండం అంచున నెలకొల్పుతారు నిప్పు తొక్కేవారు దేవుడికి ముమ్మారు ప్రదక్షిణం చేసి అగ్ని కుండంలో ప్రవేశిస్తారు దేవత మీది విశ్వాసం చేత వారిని అగ్ని ఏమీ బాదించదు అట్లా ఒకటి నుంచి యేడు సార్లు అటూ ఇటూ నడుస్తారు

నెల్లూరులోనే మరో ఆలయం దర్మరాజుల వారి ఆలయం పాండవ పత్ని ద్రౌపది పేరు కృష్ణ ఆమె నియమానుసారంగా ఒక బర్తతో గడిపి, మరొక బర్త దగ్గరకు పోయే లోపల అగ్ని స్నానం చేత పునీత అవుతుందని కదలున్నాయి ద్రౌపదీదేవి అగ్ని తొక్కడం, పాండవులు ద్రౌపదీ సమేతంగా దేవతలై పూజలందుకోవడం ఇక్కడి విశేషం నిప్పు తొక్కడమనే ఆచారం రాయ్‌కోడ్, బాదంపేట, షామెనాపూర్, కొత్తకొండ, తేగడ, చిలమనూరు మొదలైన ఎన్నో ప్రదేశాలలో కనిపిస్తుంది

ఉత్సవాలు, జాతరలు జరిగిన సమయాలలో జనులు పురాణ కదల్ని నాలుగేసి రోజుల పాటు నాటకాలుగా ఆడతారు జానపద గాయకులు ఎన్నో కదల్ని వంతపాటగాళ్ళ సహాయంతో కదాగేయాలుగా వినిపిస్తారు వాళ్ళు పాడే పద్ధతీ, ఆ సమయంలో పాడే వాయిద్యాలు, అందులో ఇమిడి ఉండే లయ, మొదలైనవన్నీ గ్రామీణుల్ని చక్కగా ఆకర్షించి ఉత్తేజితుల్ని చేస్తాయి రకరకాలుగా ప్రదర్శన కళలు జనులను సంతోషపెట్టడానికి ప్రదర్శింప బడతాయి ఇవికాక రంగుల రాట్నాలు, సర్కసులు, బజనలు, వీదిపాటలు, నృత్యము మొదలైనవన్నీ ఆ సమయాల్లో జన సమూహానికి ఆనందాన్ని పంచిపెడతాయి ఇటువంటి సమయాలలో ఆచరించే మరొక ఆచారము వింతకొల్పుతూ ఉంటుంది ఎండుగడ్డితో తాడు పేని దానికి అక్కడక్కడ గడ్డి ఉండలను చుట్టపెడతారు దాన్ని ఊరి ముందు తోరణంగా వ్రేలాడదీస్తారు దానికి అగ్ని రగులగొల్పి ఆ తోరణం మండుతుండగా దాని క్రింది నుంచి దేవతా విగ్రహాలను ఊరేగింపుగా, తీసుకెళతారు అలా దేవత తోరణం క్రిందినుంచి బయలుదేరిన తర్వాత తోరణం పూర్తిగా కాలి నుసి అయిపోగానే ఆ బూడిదను జనులు ప్రోగు చేసి ఇంటికి తీస్కుకువెళతారు దాన్ని పశువులకు వేసే మేతలో కలుపు

తారు అందువల్ల పశువులకు ఏ రకమైన జబ్బులు రావని జనుల విశ్వాసము బహుశా ఆ గడ్డితాడు మనుష్యుల పాపాలకు చిహ్నమై దాన్ని కాల్చడం పాపాల నుంచి విముక్తి చెందడంగా జనులు బావించి ఉండవచ్చు ఈ రకమైన ఆచారము లేకి, ముక్తేశ్వరం మొదలైన ప్రాంతాలలో కనిపిస్తుంది భక్తులు భగవంతుని ఎప్పుడూ కోరికలు కోరుకుంటారు రోగగ్రస్తులు, ఆపదల్లో ఉన్నవారు, గొడ్రాండ్లు, ఎక్కువగా మ్రొక్కులు మ్రొక్కుకొని ఉత్సవ సమయాలలో వాటిని తీర్చడానికి ప్రయాణమవుతారు మ్రొక్కు తీరిన వెనుక వాళ్ళకు మానసికంగా శాంతి లబిస్తుంది

మన దేశంలో మతపరమైన ఉత్సవాలు వారానికి, నెలకు సంవత్సరానికి జరిగేవి ఎన్నో కనిపిస్తాయి ఆంధ్ర దేశంలో ప్రతి గ్రామంలోను, పట్టణంలోను, ఆలయాలు ఎక్కువగా కనిపిస్తాయి అందులో స్థానికమైన ప్రాదాన్యం కలిగినవి కొన్ని, జనులందరికి ముఖ్యమైనవి మరికొన్ని అమరావతి, శ్రీశైలం, త్రిపురాంతకం, కాళేశ్వరం, దాక్షారామం, కాళహస్తి, వేములవాడ, అయినవోలు మొదలైనవి శివ క్షేత్రాలు, శ్రీకూర్మం, సింహాచలం, నెల్లూరు, తిరుపతి, అహూబిలం, శ్రీకాకుళం, యాదగిరి, బద్రాచలం, మంగళగిరి, మొదలైనవి ప్రముఖ వైష్ణవ క్షేత్రాలు వరంగల్, మండపాక, ఆలంపురం, సికిందరాబాదు, బెజవాడ, సూళ్ళూరు పేట, దొనకొండ మొదలైనవి ప్రముఖమైన శక్తి క్షేత్రాలు ఈ క్షేత్రాలన్నీ సంవత్సరం పొడుగూతా ఎంతో మంది బక్తుల్ని ఆకర్షిస్తూ ఉంటాయి ఇవి గాక మరికొన్ని చిన్న చిన్న దేవస్థానాల గురించి ముచ్చటించుకుందాం

**1 కోటప్ప కొండ**

ఇది గుంటూరు జిల్లాలోని నరసారావుపేట తాలూకాలో ఉంది అక్కడ క్షేత్ర దైవం కోటేశ్వర స్వామి ఇక్కడ మహా శివరాత్రి నాడు పెద్ద ఉత్సవం జరుగుతుంది అప్పుడు జరిగే సంతలో తినుబండారాలు, పండ్లు, గిన్నెలు, వ్యవసాయపు పనిముట్లు, గుడ్డలు, బొమ్మలు, వెదురు సామాన్లు, మేకలు, ఆవులు మొదలైనవి అమ్మకాని కొస్తాయి దాదాపు 500 లకు ఎక్కువగా ప్రబలు అక్కడికి వస్తాయి అందులో కొన్ని దాదాపు 35 మీటర్ల ఎత్తు ఉండి, అవి చెయ్యడానికి 7,8 వేల రూపాయల ఖర్చు అవుతుంది

## 2 పెద్దాపురం

ఇది తూర్పు గోదావరి జిల్లాలో తాలూకా ముఖ్య పట్టణం ఇక్కడ శివుడు, రాముడు, వెంకటేశ్వర్లు, చంద్రశేఖరుడు, ఆంజనేయుడు, సూర్యనారాయణుడు, మరిడమ్మ, కన్యకాపరమేశ్వరి, నూకాలమ్మల ఆలయాలు ఉన్నాయి ఇక్కడ మరిడమ్మ జాతర చాలా వైభవంగా జరుగుతుంది జ్యేష్ఠ అమావాశ్యనాడు ఆరంభమై ఆపాఢ అమావాశ్య వరకు 31 రోజుల పాటు ఈ జాతర నిర్విరామంగా జరుగుతుంది వేలకొద్ది జనులు ఈ సంబరంలో పాల్గొని ఆనందిస్తారు కోలాటాలు, గరగ నృత్యాలు, కుస్తీపట్లు, ఆటలు, పాటలు ఎక్కువగా ప్రదర్శింప బడతాయి పొట్టేళ్ళు, మేకలు, దున్నపోతులు మొదలైన జంతువుల్ని ఇక్కడ బలి యిస్తారు అంతేకాక దేవతకి పండ్లు, దాన్యం, వెండి, బంగారం, చీరలు, రవికలు, పసుపు, కుంకుమ, కర్పూరం, దక్షిణ మొదలైనవి యిస్తారు కప్పు లేని బండి మీద కుండల్ని అన్నం వండుకొని ఊరేగింపుగా గుడి దగ్గరకి తీసుకుపోతారు ఆ బండ్ల మీద ఒక్కొక్కప్పుడు పురాణ పాత్రల బొమ్మలు అలంకరింప బడతాయి కొన్ని సమయాలలో మనుష్యులే వేపాలు వేసుకొని నిలబడతారు గుడి దగ్గర అన్నాన్ని ప్రసాదంగా పంచిపెడతారు

## 3 మండపాక

పశ్చిమ గోదావరి జిల్లాలోని తణుకు తాలూకాకు చెందిన మండపాకలో సోమేశ్వరస్వామి, కేశవస్వామి, శ్రీరాములు, ఎల్లారమ్మ మొదలగు దేవాలయాలు ఉన్నాయి సోమేశ్వరస్వామి కళ్యాణం మాఘ మాసంలో 5 రోజుల పాటు వైభవంగా జరుగుతుంది కేశవస్వామి కళ్యాణం పాల్గుణ మాసంలో 7 రోజుల పాటు జరుగుతుంది చైత్ర పూర్ణిమనాడు ఎల్లారమ్మ జాతర జరుగుతుంది ఎల్లమ్మ, కాకతమ్మకు సైదోడు కాకతమ్మ కాకతీయులకి కులదైవం, ఎల్లమ్మకి నాలుగు చేతులు ఆమె ఎడమ చేతులలో ఒక దానిలో బల్లెం, రెండవదానిలో పాన పాత్ర ఉంటాయి కుడి చేతులలో పెద్ద కత్తి, డమరుకం ఉంటాయి కాలి దగ్గర నక్క వంటి ఆకారం కలిగిన ఒక జంతువుంటుంది దీనిని కొందరు పందికొక్కుగా తలంచుతారు ఎల్లమ్మ ఆంధ్రదేశమంతటా పూజింపబడే దేవత ఇక్కధ ఉత్సవ సందర్భంగా జరిగే 'గరగ'ల ఊరేగింపు చూడదగింది

## 4 కొల్లేటి కోట

కృష్ణా జిల్లాకు చెందిన కైకలూరు తాలూకాలోని కొల్లేటి కోట చారిత్రక ప్రసిద్ధి వహించిన స్థలం ఇది జలదుర్గం కొల్లేరు సరస్సుకు మధ్యగా ఒక ద్వీపంలా ఉంటుంది ఇప్పుడా కోటకు సంబంధించిన పురాతన వైభవమంతా నశించి అది కేవలం పల్లెగా మిగిలిపోయింది అక్కడకు పడవ మీద తప్ప ఇతర ప్రయాణ సాదనాల వల్ల కుదరదు ఇక్కడి స్థల దేవత 'జలదుర్గ' ఈ జల దుర్గను ఒరిస్సా దేశపు రాజు అంబాదేవరాయలు కొల్లేటి కోటను జయించిన ప్పుడు అక్కడ స్థాపించడం జరిగింది అంతకుముందు అక్కడ పెద్దింటమ్మ అనే పేరు గల మాతంగిదేవి పూజలు అందుకొంటుండేది ఆమె ఉత్సవాలు పాల్గుణ మాసం ఆరంభం నుంచి 16 రోజులపాటు జరుగుతాయి 10, 11, 12, రోజులు చాలా ముఖ్యమైన రోజులు 11వ రోజున జలదుర్గకు, గోకర్నే శ్వరస్వామికి కళ్యాణం జరుగుతుంది అప్పుడు 10,000 కోళ్ళు, 500 మేకలు, 1000 గొర్రెలు బలి ఇవ్వబడతాయి బలి గుడికి దూరంగా కోట వెనుక వైపున జరుగుతుంది కొబ్బరి కాయలు, అరటిపండ్లు, కుంకుమ, కుంకుమ పువ్వు ఇచ్చి బక్తులు దేవిని అర్చిస్తారు దాదాపు లక్షమంది జనం ఈ ఉత్సవానికి దూర ప్రాంతాలనుంచి వస్తారు

## 5 విడవలూరు

నెల్లూరు జిల్లాలోని కొవ్వూరు తాలూకాకు చెందిమ విడవలూరులో పోలే రమ్మ, అంకమ్మల గుడులున్నాయి మహాలక్ష్మమ్మకు, పోతురాజుకు ఆల యాలున్నాయి ఈ ముగ్గురు దేవతలు అక్క చెల్లెళ్ళనీ, పోతురాజు వాళ్ళ తమ్ముడనీ, జనులు తలుస్తారు ఇవేకాక కోదండరామస్వామి, రామలింగేశ్వ రస్వాముల ఆలయాలు కూడా ఉన్నాయి చైత్రమాసంలో కోదండ రామస్వా మికి, పాల్గుణంలో రామలింగేశ్వర స్వామికి, ఉత్సవాలు జరుగుతాయి

పోలేరమ్మ జాతర మూడు రోజులపాటు నిర్వహించ బడుతుంది అన్నం రాశి పోసి దాని మీద బలి జంతువు రక్తం పారించి రక్తసిక్తమైన అన్నాన్ని. ఊరి పొలిమేరల్లో చల్లడం, ఈ జాతరలో అవలంబించే ఆచారం ఆ అన్నాన్ని మోసుకు పోతున్న వాడి తలమిద, బలాడ్యులైన యువకులు కొందరు కత్తు లాడిస్తూ కాపలాగా వెంట నడుస్తారు పొరుగూరి వారెవరైనా వచ్చి బల్య

న్నాన్ని తీసుకు పోకుండా ఉండేందుకీచర్య ఆ ఊరివాళ్ళు కాని వాళ్ళు, అన్నాన్ని సంగ్రహిస్తే, ఆ ఊరికి జాతర వలన కలుగవలసిన మేలు, ఇతరులకు జరుగుతుందని జనులు నమ్ముతారు

అంకమ్మ జాతర ఆషాడ మాసంలో అయిదు రోజుల పాటు జరుగుతుంది దేవతను పల్లకీలో ఊరేగిస్తారు బల్యాన్నాన్ని కుంభం పోసి పొట్టేలును బలియిస్తారు మర్నాడు అంకమ్మ వ్యాఘ్ర వాహనం మీదా, ఆమె చెల్లెలు మహాలక్ష్మమ్మ సృగాల వాహనం మీద ఊరేగింపుగా బయలు దేరుతారు వారి వెంట పెద్ద బుట్ట ఉంటుంది దారి పొడుగునా భక్తులు ఆ బుట్టలో వేపాకునూ, అన్నాన్నీ వేస్తుంటారు బండి చువ్వలకు, ఒక బల్లి, పంది, మేక, కోడి, ఇంకా పిండితో చేసిన మనిషి, వీటిని గుచ్చుతారు ఊరేగింపు వాయిద్యాలతో ఆటపాటలతో గుడిని చేరుకుంటుంది నాలుగవ రోజు అన్నమూ, బెల్లమూ దేవతకు నైవేద్యం పెడతారు పప్పూ, బియ్యం పులగం వండి, బండ్ల మీద పేర్చి, బండ్లను గుడి చుట్టూ తిప్పి దేవతకు అర్పిస్తారు అన్ని సంబరాలతో నైవేద్యం సమర్పించిన తరువాత, అంకమ్మ తన బలగంతో, తృప్తిగా భోజనం చేసే వీలు కలిగిస్తూ గుడి తలుపుల్ని మూడు రోజుల పాటు మూసి వేస్తారు ఎవరైన గడువు లోపల తలుపులు తెరిస్తే వాడి తల ముక్కలవుతుందని జనుల నమ్మకం అయిదవ రోజున మరో విశేషం జరుగుతుంది అంకమ్మ, మహాలక్ష్మమ్మ ఊరికి ఉత్తరం దిక్కుకు వేటకు పోయినట్లుగా, ఊరేగింపు చేసి, అక్కడ ఒక పొట్టేలు చెవి కోసి, దాన్ని గుడి వైపుకు తరుముకొస్తారు

## 6 దప్పేపల్లి

కడప జిల్లాకు చెందిన దప్పేపల్లి గ్రామంలో బ్రహ్మగిరి అనే గుహ ఉన్నది ఈ గ్రామం రాయచోటి తాలూకాలో ఉంది ఎత్తెద్దయ్య, పసెద్దయ్య, అనే రెండు ఆంబోతుల విగ్రహాలున్నాయి ఈ రెండు ఆబోతులూ ఎప్పుడో ప్రాచీన కాలంలో ఆ ఊళ్ళో పుట్టి మనుష్యాతీత మహిమల్ని జరిపాయని కదలున్నాయి ఇప్పటికీ వర్షాలు పడకపోతే, ఊరి పూజారి తడి గుడ్డలతో, ఆ గుహకు పోయి వాటిని పూజిస్తే కుంభవృష్టి కురుస్తుందనే నమ్మకం జనులలో ఉంది

ఆవు దేవత ఉత్సవం జేష్ఠ మాసంలో మూడు రోజుల పాటు జరుగుతుంది మొదటి రోజు గుహలోని విగ్రహాలను ఊరేగింపుగా బయటకి తీసుకు వస్తారు తెచ్చి ఊరి మధ్య నెలకొల్పి పూజలు చేస్తారు మూడవ రోజున ఉద్వాసన చెప్పి తిరిగి గుహలో ప్రతిష్ఠిస్తారు ఆ దేవతకు గొడుగులు ఇచ్చే మొక్కులు భక్తులు మొక్కుకుంటారు నూలువీ, పట్టువీ, పూలు కుట్టినవీ, రకరకాల గొడుగులూ, నెమలి యీకలు సమర్పిస్తారు ఈ దేవత పేరు మీద, ఆవులక్క, ఎద్దయ్య, పసన్న అనే పేర్లు తమ బిడ్డలకు పెట్టుకుంటారు

## 7 ఉరవకొండ

అనంతపురం జిల్లా ఉరవకొండలో సిద్ధేశ్వర, మల్లేశ్వర, పాండురంగస్వామి ఆలయాలున్నాయి సిద్ధేశ్వర స్వామి గుడి, గవి మఠం అనే పేరుగల ఎత్తైన ప్రహరీ గోడల మధ్య ప్రదేశంలో ఉంది వైరాగ్య చెన్నబసవస్వామి బక్తుడూ, శిష్యుడూ అయిన కరి బసవస్వామి యీ మఠాన్ని నెలకొల్పాడు ఈయన నెలకొల్పిన మఠాలు ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్రలో ఎన్నో ఉన్నాయి యోగ మంటపం దగ్గర ఉన్న ఈయన సమాది బక్తులకు యాత్రాస్థలం పాల్గుణ మాసంలో ఇక్కడ రదోత్సవం నిర్వహిస్తారు వేల కొద్దీ జనులు ఈ ఉత్సవంలో పాల్గొంటారు సంతలు కూడి, వ్యాపార కేంద్రంగా, అక్కడ జనులు ఎన్నో వస్తువుల్ని కొనుక్కుంటారు బీదలకు అన్నదానం విరివిగా జరుగుతుంది

## 8 అలంపురం

మహబూబ్ నగరం జిల్లాలోని అలంపురం, చరిత్ర ప్రసిద్ధి చెందిన స్థలం ఇది తుంగబద్ర ఒడ్డున ఉన్న ఒకప్పటి గొప్ప పట్టణం శ్రీకృష్ణదేవరాయల కాలంలో ఇక్కడ ఒక బలిష్ఠమైన కోట నిర్మితమైంది చాళుక్య కాలానికి చెందిన ప్రాచీన దేవాలయాలిక్కడ ఎన్నో ఉన్నాయి కోట గోడల మీద మహా బారత కదలు శిల్పాలుగా చెక్కబడ్డాయి కాశీ క్షేత్రం ఉన్నట్లుగా ఇది, నాద వతి, వేదవతి అనే రెండు నదుల మధ్యగా ఉండడం చేత, దీన్ని దక్షిణ కాశిగా వ్యవహరిస్తారు ఈ తీరం పొడుగునా 84 స్నాన ఘట్టాలున్నాయి కాశీ లోని మణికర్ణికా తీర్థం వంటిది ఇక్కడి పాపనాశని తీర్థం ఇక్కడి దేవత జోగుళాంబ విశాలాక్షికి సరిజోడు అలంపురంలో కోటి లింగాలున్నాయని

ప్రతీతి ఆ ప్రదేశాన్ని బ్రహ్మేశ్వర మంటారు బ్రహ్మ, సృష్టి కార్యం నిర్వహించడానికి ముందు, ఇక్కడ శివుణ్ణి తపస్సు చేయగా శివుడాయనకు బాలరూపంలో ప్రత్యక్షమయ్యాడట అందువల్ల అక్కడి దేవుణ్ణి బాలబ్రహ్మేశ్వరుడని పిలుస్తారు ఇక్కడ చతుర్ముఖుడైన బ్రహ్మ పూజింపబడతాడు దీన్ని పరశురామ క్షేత్రమని కూడా వ్యవహరిస్తారు ఆయన తన తల్లిదండ్రులైన జమదగ్ని రేణుకలతో ఇక్కడ నివసించే వాడట ఇక్కడే తండ్రి ఆజ్ఞను పాలించి, పరశురాముడు తల్లి కంఠాన్ని ఉత్తరించాడు అప్పుడు తల చండాలుని చేతుల్లో పడి, ఎల్లమ్మగా పూజింప బడుతున్నది ఆమె మొండెం భూదేవిగా పూజలందుకుంటున్నది ఈ మొండెం ప్రతిమకు వెన్నను నైవేద్యం పెట్టి దాన్ని ప్రసాదంగా స్వీకరిస్తే, పిల్లలు లేని వాళ్ళకు పిల్లలు కలుగుతారని జనుల నమ్మకం బాలబ్రహ్మేశ్వ రాలయం దగ్గర ఒక మంటపంలో అందమైన రేణుకాదేవి ప్రతిమ నెలకొల్పబడి ఉంది అలంపురం కోటలో తొమ్మిది బ్రహ్మేశ్వరాలయాలున్నాయి బాలబ్రహ్మ, కుమారబ్రహ్మ, అర్కబ్రహ్మ, వీరబ్రహ్మ, విశ్వబ్రహ్మ, తారకబ్రహ్మ, గారుడబ్రహ్మ, స్వర్గబ్రహ్మ, పద్మనాభ దేవలయా లివి బాలబ్రహ్మ లింగం స్వయంభువు ఇక్కడి అభిషేక జలంలో ఒక చుక్కయినా బయటికి పోకుండా, అక్కడికక్కడే ఇంకిపోతుంది ఇవి కాక, ఢుంఠి గణపతికి, దత్తాత్రేయునికి, నరసింహస్వామికి, ఆంజనేయస్వామికి, సూర్యనారాయణ, బసవేశ్వర, నీలకంఠేశ్వర, శ్రీకృష్ణులకు విగ్రహాలున్నాయి

బాలబ్రహ్మేశ్వర స్వామి ఆలయం శిల్ప కళలకు నిలయం జోగులాంబ విగ్రహం భయదమై చూసే వాళ్ళకు ఒళ్ళు జలదరింప చేసేదిగా ఉంటుంది శ్రీ శంకరాచార్యుల వారు తమ జైత్రయాత్రలో ఈ ప్రదేశానికి వచ్చి సంప్రోక్షణ కార్యక్రమాలు నిర్వహించి దీన్ని దేవీస్థానంగా స్థిరీకరించారట ఇక్కడ ఒకే రాతి పలక పైన చెక్కబడ్డ, బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండి అనే పేర్లు కల సప్త మాతృకలు చెక్కబడ్డాయి ఈ పలకకు పక్కన వీణాపాణియైన చతుర్భుజ వీరభద్రుడూ, కుమారస్వామీ ఉన్నారు ఇది కాక, సుందరంగా మలచబడ్డ, చాళుక్యుల

కులదైవం, కుమారస్వామి విగ్రహం చూపరుల నాకట్టుకుంటుంది ఇంకా బ్రహ్మ, ఈశ్వర, విష్ణు, కాలభైరవులకు-లేశ, అర్ధనారీశ్వర, హరిహర, విగ్రహాలు సౌందర్య ఖనులుగా తీర్చి దిద్దబడ్డాయి చాముండి విగ్రహం, నగ్నంగా, కపాల మాలాలంకృతమై, ఆసవ పాత్రను చేతుల్లో ఉంచుకుని, తల మీద గుడ్లగూబ, బల్లి, తేలు, చిహ్నాలు కలిగి, బయద సుందరంగా దర్శనమిస్తుంది బాలబ్రహ్మేశ్వరాలయ నిర్మాణానికి కర్త అయిన రస సిద్ధుని విగ్రహం కూడా ఉంది ఆలంపురంలోని ఎన్నో దేవాలయాల నిర్మాణం కావించిన వాడీయనే అని జనులు చెప్పుకుంటారు

బాలబ్రహ్మేశ్వర స్వామికి శివరాత్రి నాడారంబమై అయిదు రోజుల పాటు ఉత్సవాలు నిర్వహించబడతాయి దాదాపు పదివేల మంది జనం వివిద ప్రాంతాలనుంచి స్వామిని సేవించడానికి వచ్చి చేరుతారు ఆశ్వయుజ మాసంలో జోగులాంబకు పెద్ద ఉత్సవం తొమ్మిది రోజుల పాటు జరుగుతుంది

**9 సంగారెడ్డి**

మెదక్ జిల్లాలోని సంగారెడ్డిలో మాణిక్యప్రభు, శ్రీరామ, ఆంజనేయ, నరసింహ, విరలేశ్వర, సంగమేశ్వర, బసవన్న దేవాలయాలూ, డొక్కలమ్మ, దుర్గమ్మ, ఎల్లమ్మ అనే పేర్లు గలిగిన గ్రామ దేవతల గుడులూ ఉన్నాయి

బాద్రపద మాసంలో నాలుగు రోజుల పాటు దుర్గమ్మ జాతర జరుగుతుంది మొదటి రోజున దేవతా విగ్రహాన్ని అబిషేకించడానికి మంజీరా నది నుంచి నీళ్ళు తెస్తారు రెండవ రోజున బలి యివ్వడానికి నిర్దేశింపబడ్డ దున్నపోతును నదికి తీసుకు పోయి దాన్ని కడిగి, పువ్వులు కుంకుమ మొదలైన వాటితో అలంకరించి గుడికి తెస్తారు మర్నాడు దాన్ని గుడి ముందు బలి యిస్తారు భక్తులు కూడా తమ తమ మొక్కుల్ని బట్టి, కోళ్ళు, మేకలు, పొట్టేళ్ళు మొదలైన జంతువుల్ని బలికి యిస్తారు సాయంత్రం, గుడి ముంగిటిని శుభ్రం చేసి, అన్నం వండి రాశిగా పోసి నైవేద్యం యిస్తారు ఆవంలో కాల్చని పచ్చి కుండను అంచు వరకూ మట్టిలో పాతి దాని మీద చెట నొక దానిని పెట్టి, ఆ చేట మీద, ఊరి గణాచారి కూర్చుని బవిష్యత్తు చెవుతుంది

ఆ సమయంలో ఆమె మీదకు అమ్మవారు పూనుతుందని జనులు నమ్ముతారు గణాచారితో పాటు గుడికో పోతురాజు ఉంటాడు ఇతడు అమ్మ వారికి తమ్ముడు ఇంత పసుపూ కుంకుమా మెత్తుకొని, బయంకరంగా కనబడుతూ, మొలకూ, చేతులకూ, మెడకూ వేపాకు మండలు కట్టుకుని గావుపట్టుతో గొర్రె పిల్లను మెడ కొరికి చంపి, గుడి చుట్టూ తిరుగుతాడు నాలుగో రోజున, జనం కొత్త కుండలలో అన్నం వండుకుని, దానిమీద మూకుడు పెట్టి పైన జ్యోతులు వెలిగించుకుని, వాటిని తలమీద పొందికగా అమర్చుకుని గుడికి వస్తారు వాటిని బోనాలంటారు ఆ అన్నాన్ని అమ్మవారికి నైవేద్యం పెడతారు ఇంతేకాక, తమకుండే యెడ్ల బండ్లను చక్కగా అలంకరించి, గుడి చుట్టూ ముమ్మారు ప్రదక్షిణం తిప్పుతారు

మాణిక్య ప్రబు జయంతి మార్గశిర మాసంలో అయిదు రోజుల పాటు చాలా పెద్ద యెత్తున జరుగుతుంది మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాల నుంచి కూడా ఈ ఉత్సవానికి జనం గుంపులు గుంపులుగా వస్తారు

**10 నిజామాబాద్**

నిజామాబాద్‌లో బడ రామమందిరం, దత్త మందిరం, హనుమాన్, రఘునాద, నీలకంఠేశ్వర, వెంకటేశ్వరాలయాలున్నాయి నిజామాబాద్‌కు మొదటి పేరు ఇందూరు ఇది చారిత్రక ప్రాదాన్యం కలిగిన స్థలం శివాజీ గురువైన సమర్ధ రామదాసస్వామి రామమందిరాన్ని నిర్మించాడట ఇక్కడ శ్రీ రామనవమి ఉత్సవాలను తొమ్మిది రోజుల పాటు నిర్వహిస్తారు మార్గశిర మాసంలో దత్త జయంతి ఉత్సవాలను జరుపుకుంటారు అప్పుడు బీదలకు అన్నదానం జరుపుతారు బజనలూ, హరికదా కాలక్షేపాలూ నిర్వర్తించబడతాయి నీలకంఠస్వామి ఆలయం చిన్న గుట్ట మీద ఉండి, చూడ ముచ్చటగా కనిపిస్తుంది ఉదయసూర్యుని కిరణాలు సూటిగా ఈ ఆలయంలోని లింగం మీద పడడం ఇక్కడి ప్రత్యేకత మాఘ మాసంలో రదసప్తమికి ఈ దేవుడి ఉత్సవాలు రెండు రోజులపాటు చేస్తారు

బాద్రపద మాసంలో వేంకటేశ్వర స్వామికి పదిహేను రోజుల పాటు పతాకోత్సవాన్ని చేస్తారు స్వామి విగ్రహానికి బదులు ప్రతీకగా ఊరి మద్య

ఒక జెండాను పాతి, దానికి భక్తులు పూజలు నిర్వహించడం వలన ఇది పతాకోత్సవంగా పిలువ బడుతున్నది పూజ అనంతరం ఈ జెండాను మేళతాళాలతో చిత్తూరు జిల్లాకు చెందిన తిరుమల క్షేత్రానికి తీసుకుపోయి, తిరిగి తీసుకు వస్తారు తిరుపతిలో మొక్కులు చెల్లిస్తామన్న భక్తులు, అక్కడికి పోలేకపోతే, ఉత్సవ సమయంలో ఇక్కడే చెల్లించవచ్చు

**11 బుర్నూరు**

ఆదిలాబాద్ జిల్లా, ఉట్నూరు తాలూకాలోని బుర్నూరు గోండుల నివాసస్థానం వాళ్ళ దేవతలు, అకిపెణ్, ఆవులపెణ్, మాసోబా, సత్తిపెణ్, అనే వారు ఊరి పొలిమేరల్లో నెలకొల్పబడిన దేవతలు

అకిపెణ్ గ్రామానికి రక్షక దేవత వ్యవసాయాన్ని ఆరంబిస్తూ విత్తులు చల్లేటప్పుడు ఈ దేవతను కొలుస్తారు ఒక పెద్ద గడ కర్ర కట్టి దానికి రెండు చిన్న కర్రలను అనుసందించి, తెల్ల జెండాతో అలంకరిస్తే అది అకిపెణ్ విగ్రహమౌతుంది ఈ దేవతను ప్రతిష్టాపించ బోయేముందు పచ్చనాకుల్ని గోతిలో వేస్తారు మేకను గానీ, కోడిని గానీ బలి యిచ్చి ప్రార్థనలు చేస్తారు ఈ తతంగ మంతా మద్యాహ్నం లోపల ముగించి, మద్యాహ్నం నుంచీ విత్తనాలు చల్లే కార్యక్రమాన్ని ఆరంబిస్తారు ఈ దేవతను పూజించడం వలన విత్తనాలు చక్కగా మొలకెత్తి పుష్కలంగా పంట చేతికి వస్తుందని వారి విశ్వాసం

ఆవులపెణ్, పోచమ్మకు ప్రతి చైత్ర, శ్రావణ మాసాల్లో ఈ దేవతను, రోగాల నుండి కాపాడమని కొలుస్తారు మేకను బలి యిచ్చి సంతృప్తురాల్ని చేస్తారు కొత్తగా పెండ్లయిన దంపతులు తమ జీవితాలు సుఖవంతంగా సాగాలని యీ దేవతను కొలుస్తారు

మాసోబా ఊరి పొలిమేరలను రక్షించే దేవత ముక్కోణాకారంగా చెక్కిన రాయి ఈయన విగ్రహం ఈయన్ని దసరా దినాలలో పూజించి మేక పోతుల్ని బలి యిస్తారు

సత్తిపెణ్ పంటల దేవత నవంబర్ మాసంలో ఈ దేవతను పూజిస్తారు కొత్త పంట యింటికి రాగానె కొంత ఆ దేవత ముందు నైవేద్యంగా పెట్టిగాని

దాన్ని అనుభవించరు అలా చేస్తే తమ పంటలు అభివృద్ధి చెందుతాయని వారి విశ్వాసం

పోలం రాజు, అనే దేవత పేరు మీదుగా రాజుల పండుగ జరుగుతుంది ఈ పోలం రాజుకే నాగోబా అనికూడా పేరు ఇతనికి కొండల మీదా, అడవుల మీదా ఆధిపత్యం ఉన్నట్లుగా జనుల విశ్వాసం అడవుల్లో మేతకు పోయే పశువుల్ని వాటిని తరలించుకు పోయే కాపరుల్నీ ఈ దేవత కాపాడుతుంటాడు ఆషాఢ పూర్ణిమ నాడు ఈయనకు ఉత్సవం జరుగుతుంది ఆ రోజు పురుషులంతా చిన్న పిల్లలతో సహా వాళ్ళ వాళ్ళ పశు సంపదతో అడవిలోకి వెళతారు అక్కడ 'రాజుల' దేవుడికి మేకను బలి చేసి బియ్యపు పరమాన్నం చేసుకుని కొంత పశువులకు పెట్టి తామూ తింటారు తర్వాత పొడుగ్గా పసుపుతో ఒక గీత గీస్తారు పశువులనన్నిటినీ ఆ గీత దాటించి అడవులలోకి తోలేస్తారు వెంట కాపరి ఎవరూ ఉండడు మర్నాడు తిరిగీ వాటిని తీసుకొస్తారు ఈ దేవుణ్ణి కొలిచే వరకూ వీళ్ళు టేకు ఆకును ఉపయోగించరు తిరిగిరాని పశువు లేవైనా పులి వాత పడ్డట్లయితే, ఆ యేడాదంతా వాళ్ళకు పులిదాడుల వల్ల ఉపద్రవం కలుగుతుందని నమ్ముతారు

**12 బెజ్జంకి**

కరీంనగర్ జిల్లాలోని 'బెజ్జంకి'లో లక్ష్మీనారాయణ దేవాలయం ఉంది ఒకప్పుడు జైనమత ప్రాబల్యం ఎక్కువగా కలిగిన స్థలం బెజ్జంకి అని చరిత్రకారులు చెవుతారు గుడి స్తంబాల మీద, దేవతలు, మనుష్యులు, జంతువులు, లతలు, అందంగా చిత్రింపబడి ఉంటాయి గోపికల రాస నృత్యం, త్రిమూర్తులు వాళ్ళ దేవేరులు, సముద్ర మదన కద, అన్నీ ఎంతో కళాత్మకంగా చెక్కబడిన గుడి యిది చైత్ర మాసంలో, ఇక్కడ రదోత్సవమూ, ఆండాళ్ కళ్యాణమూ జరుగుతుంది ఈ ఉత్సవం ఆగమశాస్త్ర విహితమైనది చైత్ర పూర్ణిమ నాడు బండ్ల సేవ జరుగుతుంది చిన్నా పెద్దా అన్ని బండ్లకూ వాటి యజమానులు రంగులు వేసి తోరణాలు కట్టి, చక్కగా అలంకరించిన ఎద్దుల్ని పూన్చి, పోటీకి సిద్ధం చేస్తారు గుడి నెలకొని ఉన్న కొండ చుట్టూ 13 ఎకరాల సమప్రదేశం ఉంది ఆ ప్రదేశంలో వేగంగా పరుగెత్తే ఎడ్లను పూన్చి

బండ్ల పోటీలు నిర్వహింపబడతాయి తర్వాత తెల్లవారు ఝామున 3 గంట లకు దేవుణ్ణి మోస్తూ రదం సాగుతుంది ఆ రద యాత్ర జరగడానికనువుగా బక్తులు దోవ పొడుగునా దీపాలంకరణ చేస్తారు కర దీపికలు చేపడతారు బండ్ల సేవ చూడడానికి ఉద్రేకబరితంగానూ, గగుర్పాటు కలిగించేదిగానూ ఉంటుంది

## 13 మేడారం

వరంగల్ జిల్లా ములుగు తాలూకాకు చెందిన మేడారం, అటవీ ప్రాంతం అక్కడి వారు కోయవారు వాళ్ళ దేవత సమ్మక్క ఈ సమ్మక్క జాతర మూడు రోజుల పాటు మాఘ మాసంలో జరుగుతుంది ములుగు ప్రాంతానికి చెందిన కోయలే కాక, ఇతర ప్రదేశాల నుంచి ఎంతో మంది హిందువులు కూడా ఈ జాతరకు హాజరవుతారు ఈ దేవతకు ఒక నికరమైన విగ్రహ మంటూ ఉండదు జాతర జరగడానికి ముందుగా, ఈ దేవత ఒక కోయపిల్ల వాడిని ఆవహిస్తుంది అప్పుడాపిల్లవాడు నిద్రాహారాలు వర్జించి ఒక వారం రోజుల పాటు అడవిలో తిరిగి, తనతో రెండు కుంకుమ బుట్టల్ని తెస్తాడు ఒకటి సమ్మక్కకూ, రెండవది సమ్మక్క కూతురు సారక్కకూ ప్రతీకలు ఈ బుట్టల్ని వేరు వేరుగా రెండు వెదురు బొంగులకు కట్టి, ఆ బొంగులను ఒక, ఎత్తుగా నిర్మించిన వేదికమీద స్థాపిస్తారు కోయ పిల్లవాడు, పులులూ , చిఱు తలూ, పాములూ, ఉన్న బీకరారణ్యంలో తిరిగినా అతనికి ఎటువంటి హానీ కలుగదు ఆ దేవతను తెచ్చిన పిల్లవాడు సాదారణంగా సంవత్సరం లోపునే మరణిస్తాడు జాతర సందర్భంలో జంతు బలి జరుగుతుంది మొక్కుకున్న వాళ్ళు వాటిని తీర్చుకుంటారు ఎంతో మంది బక్తులకు పూనకం వస్తుంది ఈ దేవతకిచ్చే నైవేద్యం బెల్లం కావడం ఇక్కడి విశేషం బెల్లం గుట్టలు గుట్టలుగా ఇక్కడ పోగుపడుతుంది ఒక్కొక్కరు తమ బరువుతో సరితూగె బెల్లాన్ని యిస్తామని మొక్కుకుంటారు బక్తులు తమ పిల్లలకు సమ్మక్క సారక్క అని పేర్లు పెట్టుకుంటారు

## 14 తేగడ

ఖమ్మం జిల్లాలోని నూగూరు తాలూకాకు చెందిన తేగడలో బద్రకాళి, వీర

బద్రుల గుడులున్నాయి మాఘ బహుళ త్రయోదశి చతుర్దశులలో ఇక్కడ ఉత్సవాలు జరుగుతాయి పై దేవతలకు కళ్యాణం నిర్వహింపబడుతుంది అక్కడికి మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న గోదావరికి వీరబద్రస్వామి విగ్రహాన్ని తీసుకుపోయి స్నానం చెయిస్తారు తిరిగి గుడికి తెచ్చిన తరువాత, ఆయన ముందు 'సుంకు' కొలవడం జరుగుతుంది దేవతను స్నానానికి కొని పోవడానికి ముందు కొంత దాన్యాన్ని ఒక కుంచంతో కొలిచి, కొత్త కుండలో పోసి వాసెన కట్టి, దానికి ముద్ర బీగాలు వేసి కట్టుదిట్టం చేస్తారు తిరిగి స్వామి స్నానం చేసి వచ్చాక విప్పి, అదే కొల పాత్రతో దాన్యాన్ని తిరిగి కొలుస్తారు సాదారణంగా దాన్యం మొదటి కొలత కంటే ఎక్కువగా ఉంటుంది అలా ఉండడం శుబ శకునంగా జనులు బావిస్తారు దీన్నే సుంకు కొలవడమంటారు అప్పటి నుంచి రాత్రంతా ఊరేగింపు కొనసాగుతుంది ఊరేగింపు సమయంలో బక్తులు వాడి నారసాలను, నాలుకల మీదా, బుగ్గల్లోనూ నాటించుకుంటారు ఆ నారసాల చివర దూదిని నూనెలో తడిపి ఒత్తిగా చేసి వెలిగిస్తారు ఈ దేవుడికి కొబ్బరి, బెల్లం, పండ్లు, గుమ్మడి కాయలు నైవేద్యం పెడతారు కొందరు బక్తులు నిప్పుల మీద నడుస్తారు మరి కొందరు ఉపవాసాలుండి జాగారాలు చేస్తారు

## 15 మేళ్ళ చెఱువు

నల్లగొండ జిల్లాకు చెందిన హుజూర్ నగర్ తాలూకా, మేళ్ళ చెఱువు గ్రామంలో శంబు లింగేశ్వర స్వామి, కామేశ్వరి, గంగ, ఆంజనేయులు, వీరబద్రుడు, వెంకటేశ్వరస్వామి, ముత్యాలమ్మ, అంకమ్మ, మైసమ్మల గుడులు ఉన్నాయి శంబు లింగేశ్వర స్వామి స్వయంబువు ఈ లింగం పైబాగాన అయిదు సెంటీ మీటర్ల వివరం ఒకటి కనిపిస్తుంది ఇందులో ఎప్పుడూ నీళ్ళుంటాయి ఈ లింగం మొదటి చిన్న దోసకాయంత పరిమాణం కలిగి ఉండేదనీ, ఇప్పుడు ఆరడుగుల ఎత్తుకు ఎదిగిందనీ చెప్పుతారు ప్రతి అడుగుకూ లింగం చుట్టూ ఒక వర్తుల రెఖ దానంతట అదే ఏర్పడిందట ప్రస్తుతం ఏడవరేఖ ఏర్పడుతున్నదట లింగం లోపల ఉన్న జలాన్ని బక్తులకు తీర్థంగా ఇస్తుంటారు ఈ దెవుడి కళ్యాణం మహాశివరాత్రి మొదలుకొని అయిదు రోజుల పాటు వైబవంగా జరుగుతుంది మొదటి రోజున 20 అడుగుల ఎత్తున ఉండె

ప్రబలు కట్టి ఊరేగింపు నడుపుతారు ఒక్కొక్క రోజున, కళ్యాణము, రదోత్సవం, పవళింపుసేవ వంటి సేవలు జరుగుతాయి నగలు, నగదు, దేవుడికి భక్తుల ర్పిస్తారు తమ తమ మొక్కుల్ని బట్టి భక్తులు ఆవుల్ని, దూడల్ని తెచ్చి ద్వజ స్తంబానికి కట్టేస్తారు

బిడ్డలు లేని గొడ్రాళ్ళు, తడి వస్త్రాలతో ప్రాణాచారం పడితే స్వామి కరుణిస్తాడని భక్తులు నమ్ముతారు గుడి చుట్టూ ఉన్న నలబై ఎకరాల స్థలంలో సంత దరుగుతుంది ఎక్కడెక్కడి నుంచో వేలాది భక్తులు స్వామిని పూజించడానికి ఆ సమయంలో గుమిగూడుతారు

# 6

# మౌఖిక సాహిత్యము

వ్యాసమహర్షి మహాభారతంలో యాజ్ఞికులూ, మేధావులూ అయిన వాళ్ళతో పాటు జానపదుల్ని కూడా పేర్కొన్నాడు ఈ జానపదులు రచించినవన్నీ జానపద గేయాలు ఇవి రాశిలో ఎక్కువగా ఉండి, జానపద సాహిత్యంలో అంతర్భాగంగా ఉంటాయి పండితులు ఈ సాహిత్యాన్ని దేశి సాహిత్యమని చిన్న చూపు చూడడం కాడా కద్దు అయినా జానపదులకు సంబంధించిన మతం, గాదలు, చరిత్ర మొదలైన అంశాలన్నీ ఈ సాహిత్యంలో నిక్షిప్తాలయి చదివేవాళ్ళ కుతూహలాన్ని ఆకట్టుకుంటాయి

తెలుగు సాహిత్యాన్ని మార్గ, దేశి సాహిత్యాలుగా రెండు రకాలుగా విభజించవచ్చు ఇందులో మార్గ సాహిత్యం నాగరకమైనదీ, ప్రత్యేకంగా పేర్కొనదగిన కర్తను కలిగింది కూడా రెండవది, గ్రామజనుల ఉద్రేకోత్సాహాలను, నమ్మకాలను, తెలియజెప్పే సాహిత్యం మొదటిది నాగరకమై, కళాదృష్టితో చికిలీ పట్టి తీర్చి దిద్దినది కాగా, రెండవది, సమాజ గ్రామీణ వాతావరణం రంగరించుకుని సుందరమై తాను జనించిన కమ్మని మట్టి వాసనల్ని వెదజల్లుతున్నట్లుగా మౌలికంగా బాసిస్తూ ఉంటుంది

చైల్డ్ చెప్పినట్లుగా పోక్ శబ్దం యొక్క అర్థం మిక్కిలి తరచి నిర్ధారించ దగ్గది స్థూలంగా ఈ పదానికి ఒక గుంపుకు చెందిన మనుష్యులు అని అర్థం చెప్పవచ్చు సంతోషమూ, జీవన ప్రయత్నాలూ, నివాస పద్ధతులూ, అన్నీ సమానంగా ఉండే ఏ గుంపుకైనా ఈ పదం వర్తిస్తుంది 'పోక్ లోర్' అనగా, ఒక గుంపుకు సంబంధించిన, పురాణ గాదలు, కదలు, నమ్మకాలు, ఆచారాలు, మంత్ర-తంత్రాలు, తత్త్వ చింతనా, సామెతలు, ప్రదర్శన కళలు, వాస్తు కళలు పండుగలు మొదలైనవన్నీ లోబడతాయి

సంప్రదాయ మార్గ సాహిత్యం పుట్టడానికి ముందే ఏ బాషలోనైనా

జానపద గేయాలు, కదా గేయాలూ పుట్టి ఉంటాయని విమర్శకులు అంగీకరిస్తారు మానసికోద్రేకం కలిగిన క్షణాలలో, ఆనందమో, మరొక నిర్భర బావమో పట్టలేక, స్త్రీ పురుష బెదం లేకుండా జనులు నృత్యగానాలకు వశులవుతారు ఇటువంటి సందర్భాలలో స్వేచ్చగా బహిర్గతమయ్యే సాహిత్యానికి ఆలంకారికంగా పరిపుష్టమైన శైలి కానీ, పాండిత్య స్పర్శ గానీ ఉండక పోవచ్చు

సాదారణంగా ఒక జానపద గెయం పుట్టేటప్పుడు లయాత్మకమైన పునరుక్తిని తోడు తెచ్చుకుంటుంది ఒకానొక చరణం నిర్ణీత వ్యవదానంతో పాడగానే దాన్నె పదిమంది తిరిగి ఆవరిస్తారు ఆ విదంగా ఆ చరణం, తాను పుడుతూనే చుట్టూ ఉన్న వాళ్ళల్లో నిలిచిపోయే విదంగా రూపు దిద్దుకుంటుంది అందువల్ల ఒక పాటకు కర్తగా ఏ ఒక్కరినీ చెప్పడానికి వీలు కుదరదు హామెండార్ఫ్ బైసన్ కొండ రెడ్లు" అనే తన పుస్తకంలో ఈ క్రింది పాటను ఉదాహరణగా గ్రహించాడు

కొండ కొమ్ము మీద కొండముచ్చు
కింది లోవలోన ఎలుగుబంటి
కొండ వాగువెంట కోతి పరుగు
చీమలు దోమలు దట్టి గట్టీ
చక్కెర దేవత యింటిపైన
చిక్కని దాడికి సిద్ధమాయెరా
ఊరి అమ్మతల్లి ముత్యాలమ్మా
చిక్కని దాడికి చేతులు గలిపీ
సత్యం గెలిచీ తిరిగి వచ్చిరీ
చుక్కల్ని జూదూ సూర్యుణ్ణి జూడూ
పొడుచుకు వచ్చే పొద్దును జూడూ
పొద్దుపొడుచూ వెలుగు పాకూ
ప్రకాశమంతా దిక్కుల నిండూ।

ఈ పాటను పెళ్ళిళ్ళలో పాడతారు పెళ్ళికి సంబంధించిన ఇరు వైపుల వారి మద్యా సంబాషణా రూపంగా ఇది సాగుతుంది ఈయనె సంయుక్తి

గురించి వ్రాస్తూ ఆడపిల్లలు సమూహంగా చేరి పాడుకునే ఈ క్రింది పాటను ఉదాహరించాడు "కోదన్న మాదన్న నారికేళో"- అనే పల్లవితో ఈ పాట సాగుతుంది

| | |
|---|---|
| వేటపొయ్యేరాములు | నారికేళో |
| బంగారి పాశల | ,, |
| బంగారి బొడ్లె బాకు | ,, |
| పిడికెడు వడ్లుతీసి | ,, |
| కొన గోరా వలిసి | ,, |
| చిక్కుడూ పువ్వోలె | ,, |
| సిరిగె తోమి | ,, |
| కొనగోర బియ్యమొలిసి | ,, |
| మోచేత పోటేసి | ,, |
| అమ్మలావాయమ్మ | ,, |
| నీళ్ళైన యియ్యవమ్మ | ,, |
| మీ యమ్మ మరదల | ,, |
| నేను వుండా మరిది | ,, |

ఇటువంటి పాటలన్నీ అప్పటికప్పుడు ఆశువుగా జన్మిస్తాయి ఈ చరణాలు ఎన్నిసార్లయినా ఆవర్తింపబడవచ్చు ఇలా తిరిగీ తిరిగీ అనడం వల్ల తొలిసారి వెలికి వచ్చిన పదాల స్థానంలో, కొత్త పదాలు, చేర్చబడవచ్చు కాని లయా, విరామమూ, చివరవరకూ మారకుండా అలాగే ఉంటాయి అయితే జానపద గేయాలలో అన్నీ సమూహగానం కలిగినవిగా ఉండవు బండి తోలుకుంటూ, ఆనందమయ ప్రకృతిని చూస్తూ పరవశించే చిన్నవాడు తాను గొంతు సారించి ఒక్కడే కైగట్టుకుంటాడు గొడ్లుకాచే పిల్లవాడు ఆ గొడ్డు పృష్ఠభాగాన్నే మద్దెలగా చేసుకుని, దాన్ని వాయిస్తూ గొంతు సారించి పాట మొదలు పెడతాడు గుడ్డ ఉయ్యాల్లో బిడ్డను పడుకోబెట్టి, తల్లి తానొక్కతే గొంతెత్తి జోలపాట అందుకుంటుంది ఏతం తొక్కేవాడూ, మోట కొట్టేవాడూ, తాముగా పాటలల్లుకుంటారు ఈ పాటలే తిరిగీ తిరిగీ ఆవర్తింపబడి, మార్పులూ చేర్పులూ చెంది, చివరకు జానపద వాఙ్మయ మహా వృక్షానికి బలమైన

వేళ్లలాగా స్థిరంగా పాతుకుపోతాయి రాను రానూ ఇవి కర్తృత్వ విషయంలో, తమ గుర్తింపును కోల్పోతాయి ఈ పాటలుగానీ, జట్టుగా పాడే సామూహిక గానాలు వింటున్నప్పుడు గానీ, మనకు పాటల్లోని ఆవర్తన మీదా, లయ మీదా దృష్టి నిలుస్తుందే తప్ప, ఆ పాట కర్త ఎవరా అన్న ఆలోచన రాదు

జనులు తమ హృదయాలను ఆకర్షించే ఎటువంటి చిన్న సంఘటనల నైనా కైగట్టి పాడుకుంటారు ఆ సంఘటన తమ నిత్య జీవితంలోనిది కావచ్చు లెదా, ఒక విక్రమ గాదలు తెలిపే చారిత్రకోదంతం కావచ్చు ఆ సంఘటనలపై జనులకుండే అబిమానాన్నీ, విశ్వాసాన్నీ, ప్రేమనూ ఆ పాటలు స్పష్టం చేస్తుంటాయి ఈ నమ్మకాన్నీ, ఆసక్తినీ గుర్తించి, నాగర సాహిత్య కారులైన కవులు తమ అబిమానాన్నీ జానపద సాహిత్యం వైపుకు మళ్ళించడం జరుగుతున్నది దేశ్యాలయిన చందో వైవిద్యాలనూ, ప్రకృతి చిత్రణల్నీ ఎంతో మంది నాగర కవులు తమ రచనల్లో చొప్పించుకున్నారు

ప్రాఙ్నన్నయ శాసనాల్లో, దేశీచ్ఛందాలు కనిపిస్తాయి నన్నెచోడుడు తన కుమార సంబవంలో అంకమాలిక, గౌడు గీతాలు, రోకటి పాటలు, ఉయ్యాల పాటలు తలవడం జరిగింది పాల్కురికి సోమన పండితారాద్య చరిత్రలో ఎన్నో జానపదగీతాల పేర్లను వినిపించాడు తన బసవపురాణాన్ని గురించి చెపుతూ జనుల నోళ్ళల్లో జానపద గీతాలుగా ఉన్న బసవన్న మహాత్మ్య కదలు తనను బసవ పురాణ రచనకు ప్రేరేపించాయని వివరించాడు

నాగర సాహిత్యంలో ప్రతి కవీ సమకాలిక జానపద గీతాలను స్మరించిన వాడే పద కవితా పితామహుండుగా ప్రసిద్ధి గాంచిన తాళ్ళపాక అన్నమాచార్యులు (1424-1503) జానపద గీతాల బాణీలలో ఎన్నో పదాలు రచించాడు ఆయన మనుమడు పెదతిరుమలాచార్యుడు ఏల, గొబ్బిళ్ళు, చందమామ పదాల వంటివి గ్రహించి తాను పద రచన కావించాడు మొదట ముద్రణా సౌకర్యం లేక పోవడం వలనా, పండితుల అనాదరణ వలన 15 వ శతాబ్దానికి ముందున్న జానపద గీతాలేవీ ఈనాడు మనకు లబ్యం కావు త్యాగరాజు (1767-1847) తరువాతి పాటలు, ముద్రణా సౌకర్యం ఉండడం వలన నేటికీ, నిలిచి ఉండడం జరిగింది జానపద సాహిత్యంలో

ఎంతో విషయ వైవిధ్యమూ, ఎన్నో విభాగాలూ ఉన్నాయి వాటిని సంగ్రహంగా ఈ క్రింద వివరించే ప్రయత్నం చెయబడుతుంది

## పౌరాణిక కథలు

వేదాలలో కదలు, రామాయణ, మహాబారత, బాగవత కదలూ, ఇతర పురాణ కదలూ, కదాసరిత్సాగరంలోని కదలూ, అన్నీ జానపదులు ఉయోగించుకున్నవే జానపదుల్లో విస్తారమైన వాడుకలో ఉన్న రామాయణాలు ఎన్నో ఉన్నాయి అవి, కూచికొండ, శారద, దర్మపురి, మోక్షగుండ, సూక్ష్మ, సంక్షేప, గుత్తెనదీవి, చిట్టి, రామాయణాలే కాక, రామకద యింకా శ్రీరామదండాలు, రామాయణ గొబ్బిపాట, శ్రీరామ జావళి, అడవి గోవింద నామాలు, శాంత గోవిందనామాలు, పెండ్లి గోవింద నామాలు వంటివి రామాయణ పాత్రల పైన కూడా ప్రత్యేకంగా పాటలు రచించి జానపదులు పాడుకోవడం కద్దు శాంతాకల్యాణం, పుత్రకామేష్టి, కౌసల్య బైకలు, శ్రీరాముల ఉగ్గుపాట, రాఘవ కల్యాణము, రాములవారి అలక, సుందర కాండ పదము, ఋషుల ఆశ్రమం, సుగ్రీవ విజయం, కోవెల రాయబారం, అంగద రాయబారం, లక్ష్మణ మూర్ఛ, లంకాయాగం, గుహ బరతుల అగ్ని ప్రవేశం, లక్ష్మణ దేవర నవ్వు, ఊర్మిళా దేవి నిద్ర, కుశలాయకం, కుశలవ యుద్ధం, పాతాళ హోమం, శతకంఠ రామాయణం, శ్రీరామ పట్టాబిషేకం వంటి పాటలు వివిదాలయిన రామాయణ సంఘటనలపైనా, పాత్రలపైనా, అల్లబడి జానపదుల నోళ్ళలో చిరంజీవత్వాన్ని పొంది ఉన్నాయి ఇంకా సీతాచరిత్రను గురించి, సీత పుట్టుక, కళ్యాణం, అత్తవారింటి కంపడం, సమర్త, శుబగోష్ఠి, గడియ, వాయన గుంటలు, అలుక, వసంతం, దాగిలి మూతలు, ఆనవాలు, అగ్ని ప్రవేశం, వేవిళ్ళు ఇట్లా ఎన్నెన్నో సంఘటనలు పాటల్లో బందింపబడి ఉన్నాయి

రామాయణం లాగే బారతం కూడా జానపదులకు మిక్కిలి ప్రీతిపాత్రమైనది నల చరిత్ర, దేవయాని చరిత్ర, సుబద్రా కల్యాణం, సుబద్ర సారె, దర్మరాజు జూదం, ద్రౌపదీ పలువలు, పండు పాట, విరాట పర్వం, పద్మవ్యూహం బగవద్గీత, సావిత్రి కద, శశిరేఖ పరిణయం, గయోపాఖ్యానం, పరాశర మత్స్యగంధి సంవాదం మొదలైన కదలన్నీ జానపదులు బారతాన్నించి గ్రహించి అల్లుకున్న పాటలు

బాగనత కదలు, శ్రీకృష్ణ దేవుని వలన గ్రామీణులకు మరీ సన్నిహితా లయినాయి ఆయన చిన్నతనపు చిలిపి చెష్టలూ, గోపికలతో చేసిన రాస క్రీడలూ జానపదుల హృదయాల్లో స్థిర స్థానాన్ని వహించిన అంశాలు శ్రీకృష్ణ జననం, కృష్ణుని చల్దులు, బాలకృష్ణ లీలలు గుమ్మడి పాట యశోద కొంగ పాట, గోపికల జలక్రీడలు, రుక్మిణీ కల్యాణము, చిలుక రాయబారం, సత్య బామ సరసం, రుక్మిణి ముచ్చట్లు, రుక్మిణి సీమంతం, పారిజాత పల్లవి, ఉషా స్వప్నం, కుచేలోపాఖ్యానం భ్రమర గీతలు ఇవన్నీ జానపద గేయా లు ఇవి కాక బాగవత కదలైన ప్రహ్లాద చరిత్ర, అంబరీషోపాఖ్యానం వంటివి కూడా వాళ్ళు అల్లుకున్నారు

ఇతరాలలో, సత్య హరిశ్చంద్ర, దత్తాత్రేయ జననం, దక్షయజ్ఞం, గంగా వివాహం, గంగా గౌరి సంవాదం సవతుల కయ్యం, ఈశ్వర బృంగి సంవా దం, మేనకా పార్వతీ సంవాదం, లక్ష్మి పార్వతీ సంవాదం, త్రిపురాసుర సంహారం, సురాబాండేశ్వరం, మార్కండేయ జననం, సిరియాల రాజు చరిత్ర, బళ్ళాణ రాజు కద, కొమిరెల్లి మల్లన్న కద, వరదరాజు పెండ్లి పాట, ఆండాళ్ చరిత్ర, శ్రీరంగ మహాత్మ్యం, తిరుమంత్రపు పాట, దశావతారాల పాట, లక్ష్మిదేవి సొంగటాలాట, లక్ష్మిదేవి వర్ణనం, వెంకటేశ్వర్ల వేట, చెంచిత కద, ఏకాదశి మహాత్మ్యం, వరహావతార చరిత్ర, నూట యెనమిది దివ్య స్థలములు—వంటి యెన్నో కదలూ, సంఘటనలూ జానపదుల చేత చేపట్ట బడి పాటలుగా, యక్షగానాలుగా వెలిశాయి మూల కద కంటే బిన్నంగా ఎన్నో కల్పనలు చేయడం, జానపదులకా కదల మీద ఉండే ప్రీతిని తెలియ జేస్తుంది తమ జీవన పద్ధతి కనుగుణంగా, ఆ పాత్రల్లో తాదాత్మ్యం వహిం చడం వలననే, ఎన్నో మార్పులూ, చెర్పులూ ఆయా కదల్లో కలగడం సంబ వించింది

జానపద గాయకులు ఈ కదల్ని గేయరూపంలో పాడేటప్పుడు, కేవలం కద చెప్పటమే కాక, సమకాలిక సంఘటనల్నీ, వ్యక్తుల నడవడికల్నీ అన్నిటినీ వ్యాఖ్యాన రూపంలో మలిచి కదను జోడిస్తారు అందువల్ల విశ్వదనీనాలైన కదల్లోని పాత్రలు ఒక్కొకసారి జానపదుల అనుబవాలూ జీవితమూ జోడిం పబడడం వల్ల కేవలం వారికి సంబంధించిన కాలానికో నేలకో పరిమిత

మైన వస్తువులుగా గోచరిస్తాయి జానపదుల సీత కానీ, ఊర్మిళ కానీ, అచ్చు తెలుగు పడతులు వాళ్ళు తెలుగు వారి బిడ్డలు సంస్కృత కవుల సృష్టిగా వాళ్ళను చెప్పడానికి వీలుండదు కొన్ని చోట్ల కొన్ని పాత్రల విషయంలో సంస్కృతంలో లేని పెంపు కనిపిస్తుంది ఉదాహరణకు రామాయణంలోని ఊర్మిళా పాత్ర కేవలం ఊర్మిళా లక్ష్మణుల వివాహ సందర్భంలోనే మనకు కనిపిస్తుంది భర్త వెంట, సీతలాగా, అడవికి పోలేని ఆమె నిస్సహాయతను గ్రామీణులు గుర్తించారు ఆ సానుభూతి వలన ఊర్మిళాదేవి నిద్ర అనే ఒక చక్కని కల్పనను కల్పించి పాటలో బందించ గలిగారు ఆ విదంగా జాన పదుల కల్పనల వలన పురాణ పాత్రల వన్నె పెరిగిందే కాని తరగలేదు

## చారిత్రకేతి వృత్తాలు

చరిత్రకు సంబందించిన కదా గేయాలు జానపద సాహిత్యంలో ఎన్నో ఉన్నాయి స్థానిక వీరుల ఉదాత్త వర్తనం, త్యాగ దీక్ష, పరాక్రమం ఇటువంటి కదలలో ప్రస్ఫుటమై ఉంటాయి వినే వాళ్ళకు ఒళ్ళు ఉప్పొంగేటట్లుగా జానప దులే కదాగానం చేస్తారు కాటమరాజు కద, పల్నాటి వీర చరిత్ర, బొబ్బిలి కద, కుమారరాముని కద, పల్నాటి వీరుల కద వంటి వెన్నో చారిత్రక కదలు, కాటమ రాజు కద, ఒక్కొక్క కద కాక కదా చక్రమని చెప్పవచ్చు

కుమార రాముని కద ఆంధ్ర, కర్నాటక దేశాలకు రెంటికీ సంబందిం చింది అలాగే దేశింగు రాజు కద ఆంధ్ర తమిళ దేశాలకూ, ఆరె మరాటీల కద ఆంధ్ర, మహారాష్ట్ర దేశాలకూ సంబందించింది ఇవి కాక మియాన్ సాహిబ్, సోమనాద్రి, రాజా రామేశ్వరరావు, రాణి శంకరమ్మ, సవై వెంకటరెడ్డి, కర్నూలు నవాబు, సదాశివరెడ్డి, సర్వాయి పాపడు, బలుగూరి కొండయ్యా లకు సంబందించిన కదలు తెలంగాణా ప్రాంతానికి చెందినవి అల్లూరి సీతా రామరాజు కద మన్య ప్రాంతానికీ, పెద్దాపురం కోడి పందేల కద తీర ప్రాంతానికి చెందినవి

## పారమార్థిక గేయాలు

మోక్షం పొందడానికి భక్తి, కర్మ జ్ఞానాలు మూడూ మార్గాలు అందులో భక్తిని బోదించే గీతాలు కోకొల్లలు ఆ భక్తి శివ వైష్ణవ బేదాలు కలిగి ఉంటుంది

శివ భక్తిని బోధించే తుమ్మెద పాటలు తెలుగు జానపద గేయాలలో కోకొల్లలు రామదాసు, తూము నరసింహదాసు, పరాంకుశదాసు, విట్టల ప్రకాశదాసు, తాటంకం వెంకట దాసు, వైష్ణవ భక్తి గీతాలను ప్రచారం చేసినవారు వీరి పాటల్ని బిచ్చగాళ్ళు, సన్యాసులు పాడుకుంటుంటారు ఇవి కాక, మేలు కొలుపులు, లాలి, జోల పాటలు, కోలాట పాటలు, మంగళ హారతులు, బగత్పరంగా భక్తి స్ఫోరకంగా పాడబడుతుంటాయి కోలాట పాటలలో మదుర భక్తి నెలకొని ఉంటుంది పారమార్థిక గేయాలలో ఒక శాఖగా తాత్త్విక గేయాలు కనిపిస్తాయి ఇవి జీవాత్మ పరమాత్మల తత్త్వాన్ని చెప్పేవి వాటి ఏకత్వాన్ని ఇవి కీర్తిస్తాయి ఈ తత్త్వాలు పాడేవాళ్ళు సాదారణంగా అబ్రాహ్మణులు బ్రాహ్మణులు నిర్వర్తించే కర్మ కాండనూ మంత్రాదికాలనూ వీళ్లు నిరసించడం ఈ తత్త్వాలలో కనిపిస్తుంది అందువల్ల వాటిని ఎగతాళి చేసే మార్మికత ఈ పాటలలో గూడు కట్టుకుని ఉంటుంది ఏగంటి లక్ష్మయ్య, పోతులూరి వీరబ్రహ్మం, వేమన, దూదేకుల సిద్ధప్ప, శేషాచల స్వామి, బోజదాసు, ఎడ్ల రామదాసు మొదలైన వారి తత్త్వాలు ఆంధ్ర దేశమంతటా ప్రసిద్ధాలు ఇవే కాక, సీతాపతి, నారాయణ, రమారమణ శతకాలూ, ఆత్మబోదామృత తత్త్వాలు, కలి ప్రమాణ తత్త్వాలు, కాల జ్ఞాన తత్త్వాలు, తారకామృత సారం, శ్రీరామ గీత, గురు జ్ఞానామృతం, బ్రహ్మానంద కీర్తనలు వంటిని కొన్ని అచ్చు పడి జనుల కందుబాటులో ఉన్నాయి ఈ తత్త్వాలు, రాజయోగాన్ని, అచల జ్ఞానాన్ని, గురుభక్తినీ, దర్మాన్నీ, అహింసనూ, న్యాయ వర్తనాన్ని, నిరపేక్షతనూ, బోదిస్తాయి వర్ణ విబాగాన్ని నిరసిస్తాయి

మతపరమైన కర్మకాండ, నోములు, పురాణాలలోను, కల్పాలలోను వివరింపబడి జనుల జీవితంలో ప్రముఖ స్థానాన్ని వహిస్తున్నాయి ఈ కర్మకాండను ఎక్కువగా ఆచరించేది స్త్రీ సమూహం అందుకని వ్రతాలను గురించీ, ఆచారాలను గురించీ పాటలల్లుకుని ప్రచారంలో నిలిపే వారు స్త్రీలే అవన్నీ స్త్రీల పాటలు దేశంలో ఒకప్పుడు ప్రాముఖ్యం సంపాదించిన వీరశైవ, వీరవైష్ణవ మతాలు స్త్రీలలో ఈ కర్మకాండ వేళ్ళూనడానికి కృషి చేశాయని చెప్పవచ్చు

మదన ద్వాదశి వ్రతం, నిత్యదానం నోము, మోచేటి పద్మం నోము, చాతుర్మాస్య వ్రతం, కృత్తిక దీపాల నోము, పెండ్లి గుమ్మడి నోము, వర లక్ష్మీవ్రతం, తులసీ నోము, లక్ష వత్తుల నోము, కామేశ్వరీ వ్రతం, శ్రావణ శుక్రవారపు నోము, శ్రావణ మంగళవార వ్రతం వంటి వెన్నో గృహిణులాచ రించే నోములు వీటిని అగ్రకులాల వారు నిర్వహించగా, క్రింది వర్ణాల వారు ఎల్లమ్మ, మైసమ్మ, పోచమ్మ, బాలమ్మ వంటి దేవతల్ని పూజిస్తారు

భగవద్గీత సారాంశాన్ని తత్త్వాల్లో పొదిగి పాడుకుంటారు ఇవన్నీ సర ళంగానూ, క్లిష్టత లేకుండానూ ఉండడం వల్ల, పాడే వాడికి గానీ, వినే వాడికి గానీ, విసుగనిపించదు ఒక్కొక్కసారి వీరు గాదల్లో, ప్రసంగ వశాత్తూ ఈ తత్త్వచింతన పొదిగి ప్రజల కందించడం కద్దు

స్త్రీల పాటలు చాలా జనప్రియమైనవి పనులు చేసుకుంటూ పాటలు పాడుకోవడం వాళ్ళ జీవితంలో ఒక భాగం తెల్లవారక ముందే, లేచింది మొదలు రాత్రి పడుకునే వరకూ, వాళ్ళకు పనీ, పాటా కలగలిసి జీవితంలో విడరాని బందాన్ని ఏర్పరచుకుంటాయి ఇంటి ముంగిట నీళ్ళు చల్లేటప్పు డు, బిడ్డకు ఉయ్యాల ఊపేటప్పుడు, పూజాదికాలు నిర్వహించేటప్పుడు, పొలాల్లో పనిచేసేటప్పుడు, స్త్రీ పాడుతూనే ఉంటుంది, ఆ పాటల్లో సహ జత్వం, కొట్టవచ్చినట్లు కనపడుతూ, ఆమె జీవన విదానాన్ని ప్రతిబింబిస్తూ ఉంటుంది

స్త్రీకి తల్లి కావడం ఒక గొప్ప దశ తల్లి అయిన తరువాత ఆమె పాడు కునే పాటలెన్నో ఉంటాయి పిల్లలు లేని పడుచు గొడ్రాలు, అనుభవించే మానసిక వ్యద యింతా అంతా కాదు కనపడ్డ దేవుళ్ళనంతా పిల్లల నివ్వ మని మొక్కుకుంటుంది నోములు నోస్తుంది పడరాని పాట్లు పడుతుంది

పాటలెక్కువగా కనిపించే రెండవ దశ వివాహ సందర్భాలలో స్త్రీలు పాడుకునే పాటలెన్నో ఉన్నాయి కొట్నాలు దంచేటప్పుడు, నలుగు పెట్టేట ప్పుడు, కళ్యాణ సమయంలో ఎన్నో పాటలున్నాయి తలుపు దగ్గర పాటలు, బంతులాట లాడేటప్పుడు పాటలు, బువ్వం బంతి పాటలు, అలక పాటలు, కట్నాల పాటలు, ముఖం కడిగే పాటలు మిదున విడెం పాటలు, అరివేణి పాటలు అప్పగింతల పాటలు ఇట్లా వివాహ సందర్భాన జరిగే ఎన్నో సంప

టనల్ని బట్టి ఎన్నెన్నో పాటలు వినిపిస్తాయి పసుపు బొట్టు పెట్టడం, వధూ వరులకు తలంట్లు, ఉయ్యాల లూపడం, వసంతం చల్లడం, పాన్పు సవరించడం వంటి అంశాలన్నీ పాటల్లో పొదగబడి ముచ్చట కొల్పుతాయి

## అద్భుతేతి వృత్తాలు

జానపదులు అద్భుత విషయాల్ని బాగా అబిమానిస్తారు అతి సామాన్య విషయాల్ని చెప్పవలసి వచ్చినప్పుడు కూడా వాటిని గోరంతలు కొండంతలుగా చేసి మనస్సుకుల్లాసం కలిగించే విదంగా వాటిని మలచడం వారి ప్రత్యేకత అందుకై వాళ్ళు మమూలు మనుషులకు అతి మానవ శక్తుల్ని అంటగడతారు మహిమాన్వితులైన మహా పురుషులో, దేవుడో వాళ్ళకు అదునెరిగి సహాయం చేస్తున్నట్లుగా కల్పిస్తారు తాము చెప్పే కదల్లో నాయకుడు కష్టతరమైన సన్నివేశంలో ఇరుక్కున్నప్పుడు, ఒక మంత్ర దండమో, మహిమాన్విత దర్పణమో, పావుకోళ్ళో, అతనికి సహాయం చేసి కష్టాల నుంచి గట్టెక్కిస్తాయి అతణ్ణి ఆకాశ మార్గంలో పయనం చేయిస్తాయి ఈ విదమైన అద్భుత కదలు జానపద సాహిత్యం నిండా కోకొల్లలు బాల నాగమ్మ కద జనులకు స్దానిక రామాయణం వంటి కద నాగమ్మను మాయల పకీరు చెఱగొని పోతాడు మాయల పకీరు అద్భుత శక్తులా కదలో రకరకాలుగా వర్ణింపబడతాయి అటువంటిదే కమ్మవారి పణతి, పసుల బాలరాజు కద, మరొకటి గాందారి కద, దర్మాంగద పాము పాట, కాంబోజరాజు కద, బాలరాజు కద మొదలైనవి ఎన్నో కదలు అద్భుతాపాదక విషయాలతో మనస్సును ఆకట్టుకునే కదలు ఈ కదలన్నీ వీరుడి దర్మవర్తనాన్ని, చివరకు దర్మ విజయాన్నీ నొక్కి చెపుతుంటాయి

## కరుణ ప్రదానేతి వృత్తాలు

అద్భుతానికి మాదిరిగానే కరుణ రసానికి కూడా జానపదుల్లో ఎంతో ఆదరం కనిపిస్తుంది తమ జివిత విదానంలో తామనుబవించే విచారాన్నీ, క్లిష్ట సంపుటనలనూ కైగట్టి వినేవాళ్ళ మనసు ద్రవించేటట్లుగా జానపదులు పాడుకుంటారు ఉదాహరణకు స్త్రీలు తమ అత్తల వలన పొందె అరళ్ళు క్రూరులైన బర్తల

వలన అనుభవించే యిక్కట్లు, సవతుల పోరు, తోడి కోడళ్ళ కయ్యాలు, లేదా యిరుగు పొరుగుల వలన బాద యిటువంటి సంఘటనలన్నీ పాటలుగా రూపు దిద్దుకుంటాయి ఇవి కాక విషాదాంత వస్తువుల్ని తీసుకుని కదలుగా తీర్చి దిద్దుకోవడం కూడా కనిపిస్తుంది కన్యకామ్మవారి కద, లక్ష్మమ్మ, కామమ్మ, సన్యాసమ్మ, మండపేట పాపమ్మ, ఎఱుకమ్మ, తిరుపతమ్మ, వీర రాజమ్మ, ఎఱుకుల నాంచారి, రాములమ్మ, సరోజని కదలు కరుణాత్మ కాలైన కదలు

## జానపద కదలు

ఇళ్ళల్లో ముసలి వాళ్ళు పిల్లలకు రాత్రి వేళల, తీరిగ్గా చెప్పే కదలు దేశ మంతా వ్యాపించి ఉంటాయి పిల్లలు తమ అమ్మమ్మలు, నాయనమ్మలు చెప్పే కదల్ని యెంతో ఆసక్తితో వింటారు వీటిల్లో చాలా కదలు నీతి బోద కాలు పెద్దలు కూడా వినే కదల్లో చాతుర్యమూ, హాస్యస్ఫోరకతా కలగలిసి కనిపిస్తాయి

తెలుగు జానపద కదల్ని మూడు విబాగాలుగా చేయవచ్చు (1) దేవ తల్ని గురించి చెప్పే కదలు (2) జంతు ప్రపంచాన్ని పాత్రలుగా చేసి చెప్పే కదలు (3) మనిషికి ప్రకృతిలో ఉన్న స్థానాన్ని నొక్కి చెపుతూ అందులో అద్భుతాలను మేళవించి జానపదుల కుతూహలాన్ని పెంపొం దించే విదంగా ఈ కదలుంటాయి

ఇటువంటి కదలు లెక్కకు మిక్కిలిగా పెద్ద వాళ్ళ ముఖాంతర్గతాలై ఉన్నాయి పాటలకుమల్లే వీటికి పుస్తక రూపాల్లో అచ్చు పొందడం ఇంకా విరివిగా సాగడం లేదు అట్లా అచ్చయినవి కొద్దిగా మాత్రమే మనకు కనిపి స్తాయి అవి, టి రాజగోపాలరావు సంపాదించిన ఆంధ్ర దేశ్య కదావళి ఇది మూడు సంపుటాలుగా ముద్రింపబడ్డది

మదిర సుబ్బన్న దీక్షితుల కాశీమజిలీ కదలు, తెనాలి రామలింగని కదలు, మర్యాద రామన్న కదలు, పరమానందయ్య కదలు, రేచుక్క పగటి చుక్క కదలు తెలుగు జాతియుముల కదలు స్త్రీల వ్రత కదలు మొదలైనవి అచ్చుపడాయి ఇందులో తెలుగు జాతియూల కదల్ని ముసునూరి వెంకట

శాస్త్రి, స్త్రీల వ్రత కదల్ని నేదునూరి గంగాదరం గారు సంపాదించారు అంతే కాక, చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారూ, టేకుమళ్ళ కామేశ్వరరావు గారూ కలిసి వినోద కదల్ని సంపాదించారు బారతి, గృహలక్ష్మి వంటి పత్రికల్లో ప్రచురింపబడిన పిట్ట కదలు సంపుటంగా వచ్చింది

వీటితో పాటు, ప్రాచీన కాలంలో సంస్కృత ప్రాకృతాది బాషల్లో కని పించిన జానపద కదలు, తెలుగులోకి అనువదింపబడి ప్రచురితమైనాయి అవి, కదా సరిత్సాగరం, పంచతంత్రం, శుకసప్తతి, హంస వింశతి కదలూ, ప్రాచీన రాజ వంశాలకు చెందిన రాజుల కదలూ ఉన్నాయి విక్రమాది త్యుడు, శాలివాహనుడు, బోజుడు మొదలైన వారిని గూర్చి ఎన్నో కదలు తెలుగులో చెప్పుకుంటారు ఇంకా పవిత్ర క్షేత్ర, తీర్దాలను గురించీ, దైవతా లనూ, కొండలను గురించీ, నదులూ నిదులను గురించీ, శైవ వైష్ణవాది మతాలనూ, ప్రవక్తలనూ గురించి ఎన్నో జానపద కదలు వాడుకలో ఉన్నాయి అవి పారంపర్యంగా పెద్దవాళ్ళనుంచి చిన్నవాళ్ళకు అందింపబడే నిదులు ఇందులో కొన్ని బాషా, స్థల విబేదాలను పాటించక అన్నిచోట్లా కనపడుతు న్నా, వాటికి స్థానికమైన వైశిష్ట్యంగా ఉండకుండా పోదు ఈ కదలు స్థానిక మైన మత విశ్వాసాలనూ, అలవాట్లనూ, సంస్కృతి వైశిష్ట్యాన్నీ, ఆహార వివ రణలనూ, వేష బాషాదికాలనూ, కల్పనా ప్రతిబనూ చక్కగా స్పష్టం చేస్తూ ఆంధ్ర దేశపు ప్రత్యేకతను నిలువబెడుతూ ఉంటాయి

# 7
# జానపద నృత్యగానాలు

## జానపద సంగీతం

నాగరకత అబివృద్ధి చెందిన సంఘాలలో, పాటకూ, సంగీతానికీ, మద్య చాలా తేడా కనిపిస్తుంది అక్కడ పాటను కైగట్టుకునే కవికి, ఆ పాటను పాడే వాడికీ మద్య అంతరం ఉంది అందుకు బిన్నంగా జానపదుల్లో ఈ యిద్దరూ సమానం ఇక్కడ పాటా, ఆ పాటలో పొదగబడిన సంగీతమూ ఒక్కటిగా, ఏ బేదాలూ లేకుండా ఆవిష్కృత మవుతుంటాయి

తెలుగు జానపద గానం, ఆ మాటకు వస్తే ఈ విశాల దేశంలో ఏ మూలకు చెందిన జానపద గానమైనా, పుట్టుక ఎరుగరానిది 'గాదాసప్తశతి', పంట బాగా పండినప్పుడు రైతు ఆనందంతో పాటలు పాడుకున్నట్లు చెపుతుంది మూడవ చాళుక్య సోమేశ్వరుడు తన 'అబిలషితార్థ చింతామణి'లో షట్పదిచ్ఛందాన్ని కదాకదనానికి వాడుకుంటారని చెప్పాడు

జానపద సంగీతానికి, పాటతో పాటు, రాగం యొక్క సహాయం మిక్కిలి అవసరమైనది అందులో పాట సాహిత్యపరంగా మనస్సులో ఉన్న గాడ బావాల్ని వెల్లడించడానికి ఉద్దేశింపబడగా రాగం, కదాకదనాన్ని సులబతరం చేసేందుకు వాడబడుతుంది ఈ రాగాన్ని పటిష్ఠం చేసుకోవడానికి వాద్య సహాయం కూడా అవసరమవుతుంటుంది పాటలో కుదురుకుని ఉండే సరిగమ పదని స్వరాలకు బలమిచ్చేవిగా, రాగాన్ని అనుసరిస్తూ లయజ్ఞానం మందంగా మనో మోహనంగా సాగుతుంది, రాగ ప్రసారంలో నిర్ణీత కాలంలో వ్యవదానం పాటించి శ్రోతలను తన్మయుల్ని చేయడమే లయను ప్రదర్శించడం అంతేకాక పాట ద్వారా గాయకుడు వ్యక్తం చెయదలచుకున్న బావానికి పల్లవి చరణం, ధ్రువగానం వంటివి కాల వ్యవదానాన్ని కలిగిస్తాయి

జానపద గానాన్ని ఈ క్రింది విభాగాలుగా చేయవచ్చు

(1) పొలంలో పని చేసుకుంటూనో, బండి తోలుతూనో, గేదెల వీపుల మీద సవారి చేస్తూనో, జానపదుడు పాడుకునే సంగీతం

(2) ఆడపిల్లగానీ, మగ పిల్లవాడు గానీ, ఇండ్ల నుంచి పనికి వస్తూనో, పనినుంచి యింటికి మరలుతూనో ఒకరు చెప్పగా, చుట్టూ ఉన్న పదిమంది అందుకోగా, సాగిపోయేవి

(3) పనులు చేసేటప్పుడు ఒకరొక చరణం అందీయగా మిగిలిన పని వారు అందుకుని పునరావర్తించేవి

(4) ఇతరుల సంతోషం కోసం, తీరిక సమయాల్లో జానపద కదాగాయకుడు, గానాన్ని వాహికగా కదను ఆవిష్కరించేది

ఈ పై విభాగాలు ఇంటి బయట ప్రవర్తిల్లేవి

ఇక ఇళ్ళల్లో పాడుకునే వాటిని కూడా నాలుగు విభాగాలు చేయవచ్చు

(1) స్త్రీలు తెల్లవారి లేచింది మొదలు మజ్జిగ చిలికే కార్యక్రమం దగ్గర ఆరంభించి, కొనసాగించే పాటలు

(2) పూజ చేసేటప్పుడు స్త్రీలు పాడే మంగళ హారతులు మొదలైనవి

(3) పెళ్లీపేరంటం మొదలైనవి జరిగేటప్పుడు స్త్రీలు పాడేవి

(4) ఆడపిల్లలు ఆడుకుంటూ పాడుకునే పాటలు

సంప్రదాయ సాగర సంగీతంలో సప్త స్వరాల ఆరోహణావరోహణ క్రమాల ప్రాతినిధ్యం ఎక్కువగా ఉంటుంది వీటికి వాయిద్యాల సహాయమూ, అను స్వరాల తోడ్పాటూ ఉండడంవల్ల రాగ ప్రస్తారం చెయ్యడానికి వీలు కలుగుతుంది జానపద సంగీతంలో రాగ ప్రస్తారానికి గానీ, స్వర కల్పనకు కానీ పెద్దగా అవకాశం ఉండదు శాస్త్ర పరమైన ఈ ప్రస్తార క్రమం జానపదుడికి తెలియడానికి వీలులేదు అతను తన గళ నిర్గతమైన గానాన్ని కేవలం నిర్ణీత వ్యవదానం వల్ల లయను నిర్మించుకుని శ్రుతి మనోహరంగా బహిర్గతం చేస్తాడు అందువల్ల ఈ లయ మాత్రమే జానపద సంగీతంలో ప్రధానం. అంతేకాని సంగీతాన్ని ఒక శాస్త్రంగా, నాగరకులు ప్రస్తరించే విధంగా జానపదుడు చేయలేదు

అతని కదాకదనంలో, గానం వెలువరించడంలో ఉండే వేగం, మాటలు ఆవర్తించడంలోని తొందర, లయ, అనే అంశాలే సన్నివేశానికి తగినట్లు బావ స్ఫోరకాలై వెలుగొందుతాయి అక్కడక్కడా వినిపించే పాముల వాళ్ళ నాగ స్వరంలోనూ, రాయలసీమలో వినిపించే లేపిల పాటల్లోను ఈ స్వరజ్ఞానం కొద్దిగా, కర్పూరం మీద వచ్చే ఉండీ లేని సువాసనలాగా మనసుకు తగులు తుంది గొడ్లు కాచే పిల్లవాళ్ళ పాటల్లో గానీ, బళ్ళు గొట్టే వాళ్ళ పాటల్లో గానీ, ఒకే స్వరం నిండి ఉండడం గమనించవచ్చు ఇది సంప్రదాయ సంగీ తజ్ఞులు చెప్పే 'అర్చిక' అని నా అభిప్రాయం

జోల పాటల్లో ప్రముఖంగా చరణం చివర రెండు స్వరాలు వినిపిస్తాయి అవి 'రి 'స' లు 'రి' నిద్రపోతూ జోగుతున్న మెదడును పరాకాష్ఠ నందు కునే ఎత్తులకు తీసుకుపోగా, 'స' తిరిగి క్రిందికి తెచ్చి భూమిమీద విడిచి పెడుతుంటుంది ఈ రెండు స్వరాలూ చరణం చివర నుండే జోజో అనే పల్లవిలో నిక్షిప్తమై ఉంటాయి హాలుని గాదా సప్తశతిలో ఈ రెండు స్వరాలూ జోజోలకు అనుబంధింపబడి ఉన్నాయి దీన్ని సంగీతశాస్త్రం ప్రకారం "గాదిక" అన వచ్చు పెరుగు చిలికే వేళ, ప్రాతఃకాలపు పాటల్లో మూడు స్వరాలు 'మేలుకో' అనే పల్లవిలో నిక్షిప్తమై ఉంటాయి ఈ మూడూ నిద్ర పోతున్న మనిషి చెవు లకు తడలు తడలుగా తాకుతూ అతణ్ణి జాగ్రదవస్థలోకి తెచ్చి విడిచి పెడ తాయి ఇది 'సామిక' అని పిలువబడే రాగ ప్రస్తార విశేషం వేదాల్లో కొన్ని ఋక్కులలో ని, స, రి, అనే త్రి స్వరాల మేళనం కనిపిస్తుంది ఈ మేళనమే అన్ని దేశాల జానపద సంగీతంలోనూ కనిపిస్తుంది

నాలుగు స్వరాల సమ్మేళనాన్ని స్వరాంతరమంటారు స్త్రీల పాట లలో కనిపించే అనుపల్లవుల్లో ఇది కనిపిస్తుంది అనుపల్లవి పాట మధ్య చర ణాలలో ఉంటుంది సాదారణంగా పాట పాడేవాడికి మద్య స్దాయిలో పాడడం సులువు కాని తార స్థాయిలో చేసే గానం జనాన్ని బాగా ఆకర్షిస్తుంది మద్య స్థాయి నుంచి స్త్రీలు, తాము పాడేటప్పుడు, తార స్థాయిని అందుకోవడమే స్వరాంతరం మంగళ హారతుల్లో ఈ స్వరాంతర లక్షణం బాగా కనిపిస్తుంది

జానపదులు పాడే శృంగార గేయాలలో ఈ స్వరాలతో కుస్తీపట్లు చాలా అరుదుగా కనిపిస్తాయి ఆంధ్ర జానపద సంగీతానికి, శ్రుతిపేయంగా రాగాన్ని

వెలయించడమే ముఖ్య లక్షణం జానపదుడికి, తన పాటలో తాను స్వర పాండిత్యాన్ని ప్రదర్శించాలనే కుతూహలం ఉండదు స్వరమంటే మనస్సును రంజింప జేసేది అనే నిర్వచనానికే ప్రాదాన్యమిస్తూ, ఇతరులకు శ్రవణ సుబగతను అందించడమే ద్యేయంగా అతను గానాన్ని వెలయిస్తాడు

గాయకుడు తాను పాడే కద వలన ఉత్పన్నమయ్యే రసానికి సంగీతాన్ని కేవలం అనుపానంగా స్వీకరిస్తాడు తాను పాడే పాటలోని చందోగతి, షట్పదిలో ఉన్నా, ఖండగతి కలిగి ఉన్నా, జానపద గాయకుడికి ఆ తేడాలేవీ తెలియవు అతని లయాన్వితమైన రాగ ప్రస్తారానికి, పై రెండూ ఒకే విదంగా నడిచి అబేదాన్ని పాటిస్తాయి కాని ఈ రెండింటినీ దగ్గరకు తెచ్చి పరిశీలిస్తే వాటి మద్య స్వరాంతర లక్షణం కనిపిస్తుంది ని, స, రి, మ, ప, స్వరాలు అక్కడ మాలికల్లాగా వినిపిస్తాయి అందునల్ల వినేవాడికి శ్రవణ సుఖం కలగడంతో పాటు, పాడేవాడికి శరీర శ్రమను మరిపించే సుగుణం కనిపిస్తుంది తిరిగి తిరిగీ ఆవర్తిస్తుండడం వలన నరాలు, చిఱు ప్రకంపనాలకు లోనై, అలసట తగ్గి, విశ్రాంతిని పొందుతాయి

ఎన్నో గొంతులు ఒక గొంతుకగా కలిసి రాగ ప్రస్తారం చేయడం జానపద సంగీతానికుండే ముఖ్య లక్షణం అన్ని గొంతులు షడ్జమంలో ఏకత్వాన్ని సాదించడం జానపద సంగీతంలోనే కనిపిస్తుంది గాని, శాస్త్రీయ సంగీతంలో కనిపించదు ఒక వేళ, అన్ని గొంతుల్లో ఒక గొంతు కొద్దిగా కలవకుండా విడిగా ఉండిపోయినా, జానపద సంగీతం సహిస్తుంది ఏక ముఖంగా సాగిపోయే రాగ ప్రవాహంలో, కలవని గొంతు కూడా, సరి నడకలు నడిచి అందులో లీనమై పోతుంది

సామూహిక గానానికి ప్రాణంవంటిది లయ ఈ లయ పాడేవాళ్ళ అంగచాలనం వల్ల కూడా వ్యక్త మవుతుంటుంది సామూహిక గానం చేసేటప్పుడు, పాట పాడే వాళ్ళంతా మండలాకారంగా గుమిగూడుతారు అందులో ఒక్కడే పాట రూపంలో కద చెప్పేవాడు వాడు, రామకద చెప్పేటప్పుడు తానే సీత, హనుమంతుడు, విబీషణుడు, రావణుడు, అయి కదను కొనసాగిస్తుంటాడు చుట్టూ ఉన్న గుంపు చేతుల్లో చిఱతలు మ్రోగిస్తూ, తాము ఏర్పాటు చేసుకున్న వర్తులాన్ని విశాలం చేస్తునో, కుంచించుకుంటూనో, కదకుడు కొన

సాగించే పాటను ఆవర్తిస్తూ, లయ తప్పకుండా అడుగులు వేస్తుంటారు ఉద్రేక భరితంగా కథ సాగేటప్పుడు వాళ్ళు, తమకాన్ని ఆపుకోలేక గొంతెత్తి, రాగ ప్రస్తారం చేస్తూ, ఒక్కొక్కసారి కదనం చేసే బాధ్యతను తామే వహిస్తుంటారు అప్పుడా గానంలో బహిర్గతమయ్యే తాళం సర్వసాధారణంగా ఏకతాళం అప్పుడప్పుడూ త్రిపుటను కూడా వాళ్ళు వాడడం కద్దు

పాటకు చాలా సార్లు సహాయక వాద్యం మద్దెల శాస్త్రీయ సంగీతం విషయంలో మద్దెల వాదనం క్లిష్టంగా కనిపిస్తుంది కాని జానపద సంగీతం పట్ల అది చాలా సరళమైనది స్వరానికి మల్లే తాళం కూడా శ్రవణపేయతను కలిగిస్తుంది కథ మీదనే దృష్టి ఉంటుంది గాని తాను ప్రదర్శించే రాగ విన్యాసం ఎంత శాస్త్ర సమ్మతంగా ఉంటుందా అన్న ధ్యాస ఉండదు

నాగర సంగీతానికీ, జానపద సంగీతానికి మధ్య నుండే మౌలికమైన భేదం ఆకారంలో కాదు కేవలం ఆ భేదం ఆంతరంగికమైనది జానపద సంగీతం హృదయ వాది సంగీతం కాగా, నాగర సంగీతం శాస్త్ర బద్ధమైన బుద్ధి వాది సంగీతం శాస్త్రీయ సంగీతంలో రస ప్లావిత లక్షణం, జానపద సంగీతంలో ఉన్నట్లుగానే ఉంటుందని నాగరకులు వాదించినా, ప్రకృతి సహజమైన సారళ్యమూ, హార్దికతా, ఇందులో ఉన్నంత ఎక్కువగా మొదటి దానిలో కానిపించవు

కంఠ ధ్వనీ, ఆ ధ్వనిలో నిండి నిబిడీకృతమయ్యే మాధుర్యమూ, సామూహిక గాన లక్షణమూ, జానపద సంగీతాన్ని విలక్షణంగా నిలువబెడతాయి జానపద గీతం ఆరంభమయ్యేటప్పుడో, ముగింపు పొందేటప్పుడో, ఆలాపన ఉంటుంది అయితే యిక్కడ అక్షర స్వరాలకు, నాగర సంగీతంలో ఉన్నట్లుగా ప్రాముఖ్యం ఉండదు జానపద గీతానికి చివరివరకూ తోడుగా, ఏకతార గానీ, తంబురా గానీ, మ్రోగుతూ శ్రుతిని నిలువబెడుతూ ఉంటుంది ఇక్కడి స్వరాలను విశ్లేషిస్తే, అవి అదర షడ్జమానికి చెందేవిగా ఉంటాయి బృంద గానం చేసేటప్పుడు కూడా ఆ గొంతులన్నీ విభిన్న శ్రుతులకు తావలమయ్యేవిగా ఉండక ఏక శ్రుతిని కలిగినవిగా ఉండి అధర షడ్జమానికి లొంగుతాయి అయితే యిద్దరు యాచక దంపతులు భిక్షాటనంలో పాటలు పాడుతూ తిరిగేటప్పుడు, పురుషుడు మధ్యమ స్థాయిలో రాగ ప్రస్తారం చేస్తే, స్త్రీ,

తారస్థాయిలో రాగాన్ని ఎత్తు కోవచ్చు అయితే యిక్కడ కూడా స్థాయిలో బేద మేకాని, శ్రుతిలో బేదం ఉండదు

జానపదుడు తానొక్కడే గొంతు సారించి పాడడానికి ఉపక్రమించిన ప్పుడు స్వర సమ్మర్ధం కనిపిస్తుంది కాని ఒక జానపద గేయ గాదా ప్రవర్త కుడు కదాగేయాన్ని పాడేటప్పుడు స్వర ప్రకటనకు తావుండదు కేవలం ఆరంభంలోనో, అంతంలోనో వీటి ప్రదర్శన ఉండవచ్చు అందుకని జానపద గేయ గాదల్లో మనం అంత్య స్వరాలను వినవచ్చు సంగీత సమ్రాట్టులైన వాగ్గేయ కారులు తమ గేయాలను అర్చిక, గాదిక, సామిక, స్వరాంతర, వంటి వివిద స్వరాలతో, రాగాల ఆరోహణావరోహణ క్రమాలతో, సమకూర్చు కుంటారు ఈ మొదటి నాలుగు స్వరాలూ జానపదులకు చెందిన దేశ్య సంగీతానికి చెందినవిగానే ఉంటాయి శాస్త్రీయ సంగీతాన్ని విశ్లేషించే వారంతా రాగానికే ప్రాదాన్యం ఇస్తుంటారు వాళ్ళు మార్గ, దేశి విబాగాలుగా సంగీతా న్నంతా రెండు బాగాలు చేసినా, మార్గ విబాగం మీద చేసినంత కృషి దేశి విబాగం మీద చేయలేదు వేదాలలో సామవేదం, జానపద సంగీ తానికి చెందినదే అందులో మూడు స్వరాలు, అర్చిక, గాదిక, సామికలు కనిపిస్తాయి

జానపద సంగీతానికి రాగ విశ్లేషణ అక్కర లేదు కాకలి, కైశికి, అంతర, సాదారణ అంటూ రాగ విశ్లేషణకు పూనుకుంటే, మనకక్కడ ఏదీ స్పష్టంగా రూపు చెందదు అంతే కాక, జానపద గితాలన్నీ అహాహా , ఓహోహో వంటి ఆశ్చర్యార్ధక ద్వనులతో కూడి, ఏ రాగానికీ దొరకకుండా పోతాయి, కాని కొన్ని కొన్ని సందర్భాలలో ఒకే విదమైన రాగాన్ని వాడడం, జానపద గీతా లలో కనిపిస్తుంది ఉదాహరణకు, మేలు కొలుపులు బూపాల రాగంలోనూ, జోల పాటలు నౌరోజు రాగంలోనూ, జాజర పాటలు హిందోళ, వసంతరాగా లలోనూ వినిపిస్తాయి దక్షిణ దేశపు వాగ్గేయకారుడు అన్నమాచార్యుడు (1424-1503) జానపద సంగీత పద్దతుల నుంచి ఎంతో ఎరువు తెచ్చు కున్నాడు ఆ బాణీలలో ఎన్నో పాటలు వ్రాశాడు

ఈ నౌరోజు రాగంలోని లాలి పాట చూడండి

రామలాలీ మేము శ్యామలాలీ

*తామరస నయన దశరధ తనయ లాలీ* — ఇందులో సౌరాజు రాగ చ్ఛాయయున్నాయి కాని చివర వినిపించే రి, స, లు పసిపాపను స్వప్రకుపక్ర మించేట్లు చేస్తాయి

ఈ రకంగా సీత ముద్రికలు, రామువ కళ్యాణం వంటి వివాహ గితాలు, కూడా ఈ విశ్లేపణకు లోనవుతాయి అయితే జానపద గీతాల పట్ల ఇంతటి శాస్త్రీయ విశ్లేషణ పనికి రాదు కేవలం కోయిల గొంతుల వంటి స్త్రీల గొంతులు మాత్రమే అక్కడ మన్ననకు పాత్రులు కావలసినవి

ఈ జానపద గీతాలను మూడు విబాగాలు చేయవచ్చు (1) స్త్రీలు, పిల్లలు, శ్రామికులు అందరూ మెచ్చి కొనసాగించే ముక్తకాలు (2) పౌరాణిక, చారిత్రక, మత, తాత్త్విక గేయాలు (3) శృంగారాద్భుత కరుణ హాస్య ప్రదాన గేయాలు

ప్రాచీన లాక్షణికులు, ఆదునిక విమర్శకులు, ఈ పాటల్ని విశ్లేపించ డానికి వ్యర్ధ ప్రయత్నాలు చేశారు

తెలుగు పాటలను పోలిన పాటలు తమిళం మొదలైన యితర బాషల్లో కూడా ఉన్నాయి

పువ్వు పేరే జాజి పువ్వు
పురం పేరే అయోద్యా పురం
దేవి పేరే సీతాదేవి

వంటి పాటలు తమిళంలోని కుఱైమొనై, ఒరుఉమొనైలతో సమానం

*గుడు గుడు గుంచం*
*గుండే రాగం*
*పాముల పట్టం*
*పడిగే రాగం*

కూడా కుఱైమొనై వంటిదే

*లాలి శంకర సదా లలిత కుమార* — ఇది తమిళంలోని తొడై చందంతో సరిపోతుంది

*సువ్వి సువ్వి రామచంద్ర*
*సువ్వి సువ్వి కీర్తి సాంద్ర*

సువ్వి సీతమ్మ మాకు శుభములిమ్మా
అనేది తురగ వల్గన రగడ ఛ్ఛందంతో పోలికలు కలది
గుమ్మ డేడీ గోపి దేవీ
గుమ్మ డేడీ కన్న తల్లీ
గుమ్మడిని చూపించవమ్మా
అమ్మ మా యమ్మా
అనేది కన్నడంలోని బామినీ షట్పదిని పోలి ఉంటుంది
హరి హరీ నారాయణాది నారాయణా
కరుణించి మమ్మేలు కమలలోచనుడా
అనేది ద్విరద గతి రగడ
నీకు నాకూ దూరమాయె
నీలి కొండాలడ్డమాయె
చంద్రగిరీ చీరలంపరా
ఓ రందకాడ బంగారు మామా
చంద్రగిరీ చీరలంపరా
అనే యేలపాట బోగషట్పదికి దగ్గరైన నడక గలది

మదురగతి రగడ, చతుష్పద, షట్పద, ద్విరదగతి రగడ హయ ప్రచార రగడ, వృషభగతి రగడ మొదలైనవి తెలుగులోనూ, కన్నడంలోనూ కనిపించే దేశిచ్ఛందో విశేషాలు వీటిని కన్నడంలో మందానిల, చంద్రావతంస, కుసుమ షట్పద, లలిత, బోగ షట్పద వంటి పేర్లతో పిలుస్తారు

జానపద గానంలో ఈ రకంగా ఛందాలనో, రాగాలనో, గుర్తు పట్టడం శాస్త్రకారులు చేస్తున్న పని నిజానికి ఈ గానం పుట్టు పూర్వోత్తరాలు కనుక్కోవాలంటె ఆదిమ మానవ చరిత్ర దగ్గరకు పోక తప్పదు

ఆదిమ మానవుడు బావావేశం కలిగినప్పుడు, దాన్ని దాచుకోలేక ఏదో రూపంగా, పాటగానో, ఆటగానో, దాన్ని వెలువరించి ఉంటాడు ఆ సమయంలో ఆ ఆటగానీ, పాటగానీ శాస్త్రీయతాన్ని కలిగి ఉండాలని అనుకు బావించి ఉండడు అతి సరళమైన కృత్రిమత లేని సహజ మార్గంలో బావా

వేశం పయనించి ఉంటుంది ఆ సహజ మార్గాలు రెండు మూడింటిలోనే జానపద కళల సమగ్రత యిమిడి ఉండవచ్చు

జానపద సంగీతమంతా 3 4 5, 6, 7, 8, 9, మాత్రల ఆవృత్తిలో సంక్షిప్తంగానూ కనిపిస్తుంది ఇవే వేలకొద్దీ పాటల నిండా పరుచుకుని ఉంటాయి త్రిస్ర, చతురస్ర, మిశ్ర, ఖండగతి వంటి లయ ప్రదానమైన గతి విశేషాలు జానపద సంగీతాని కంతటికీ బీజ ప్రాయాలు వీటి తరువాతనే, జానపదుడు చరణాల నిడివికీ, తాళానికీ, పదాల ఎంపికకూ, వ్యవదానానికీ, ఇతర కొలత బద్ధలన్నిటికీ ప్రాదాన్యమిస్తాడు

## ప్రాంతీయ నృత్య రూపాలు

జానపద నృత్యాలు ఆదిమ మానవ నృత్యాలతో సాదృశ్యాన్ని వహిస్తాయి బరతుని నాట్య శాస్త్రంలో ప్రాంతీయాలైన నృత్య రూప బేదాలు గుర్తించడం జరిగింది ప్రాంతీయ నాట్య సంపూలను హెచ్చరిస్తూ, ఆయా ప్రదేశాలలోని జనుల అబిరుచులకు అనుగుణంగా నాట్య రూపాలను చేపట్ట వలసినదిగా విజ్ఞప్తి చేశాడు ఆ విదంగా జానపద నృత్యాల ప్రాచీనతా, సంప్రదాయ బద్ధతా, వ్యక్త మవుతూ ఉన్నది

పాబేన్ బనర్జీ తన 'బారతీయ నృత్యాల'నే పుస్తకంలో "జానపద నృత్యాలు సమాంతరంగా రెండు రకాలుగా కనిపిస్తాయి (1) సాంఘిక నృత్యాలు, (2) ఆటవిక నృత్యాలు సాంఘిక నృత్యాలు పండుగ పబ్బాలలో ఆచరించేవి ఇవి వీదుల్లోనూ, ఇళ్ళ ముందూ, జనానందం కోసం జనులు ప్రవర్తిల్ల చేస్తారు (3) ఆటవిక నృత్యాలు మత పరమైన ఆచారాలకు ప్రాతినిద్యం వహించేవి గిరిజనులు, ఆటవికులు హిందూ దేశపు మారు మూల ప్రాంతాల్లో నివసించే వెనుకబడిన జనులు — వాళ్ళకు మాత్రమే యివి పరిమితమై ఉంటాయి' అని వివరించాడు

ఒక జానపద నృత్యాన్ని దర్శించి నప్పుడు మనకు వెంటనే స్పురించే అంశాలేమిటి? సహజత్వమూ, సద్యఃస్ఫూర్తి, స్వేచ్ఛగా సాగే అవయవ చాలనమూ ఈ నృత్యాలలో మనం గమనించగలిగిన ప్రదానాంశాలు ఏ రకమైన అవంకులూ లేకుండా ప్రవహించే బావ ప్రవంతి ఇక్కడ అంగ

చలనాన్ని నడువుతుంది ఆనందం నుంచి విచారం వరకూ ఉండే అన్ని రకాల బావచ్ఛాయలూ ఇక్కడ స్పష్టంగా బాసిస్తాయి చూసేవాడికి నృత్యాలు కళాఖండాలుగా కనిపించినా వాటిని ప్రవర్తించె వాడికి, అవి ఆచార కాండలో బాగాలు అందువలన జానపద నృత్య కళాకారులుగా మార్పు పొందడం సులబమైన పని కాదు ఇప్పటి జానపద నృత్య ప్రవర్తకులు, గాయకులు, బారత దేశమంతటా, సాంప్రదాయికమైన ఆచారానికి సంబందించిన కర్మ కాండకు అనుబందించిన తమ కళలను నడుపుకొస్తూ ఉన్న వాళ్ళే

ఆంధ్రదేశంలో, ఈ ప్రదర్శన యోగ్యాలయిన నృత్యాలలో వైవిద్యం ఎక్కువగా కనిపిస్తుంది చాలా లక్షణాలలో ఇవి మిగిలిన ప్రాంతాల నృత్యాల కంటే బిన్నంగా వుంటాయి నృత్య కళ పరిణామ సిద్ధమైనదీ, క్రమ వికాసాన్ని సంతరించుకునేదిగా కనిపిస్తుంది ప్రాఙ్మానవ దశనుంచి నేటి వరకూ వచ్చిన నృత్య పరిణామాలను గురించి ఇంకా అద్యయనం చేయవలసింది చాలా ఉంది

మొదటి అద్యాయంలో చెప్పినట్లుగా 33 రకాల గిరిజనులూ, ఆటవికులూ ఆంధ్రదేశంలో నివసిస్తున్నారు వాళ్ళందరికీ, ఎవరికి వారికీ ప్రత్యేకమైన నృత్య పద్ధతులున్నాయి అయితే నృత్యాలను స్థూలంగా మూడు రకాలుగా విబజించవచ్చు (1) మతపరమైన నృత్యాలు (2) సాంఘిక నృత్యాలు (3) వినోదాత్మక నృత్యాలు

## గోండుల గుసది నృత్యం

ఆదిలాబాద్ జిల్లాలోని రాజ గొండులకు దీపావళి చాలా పెద్ద పండుగ అప్పటికి పంట యింటికి వచ్చి వాతావరణం చల్లగా ఆహ్లాదకరంగా ఉంటుంది గొండులు రంగు రంగుల వస్త్రాలు దరించి ఆబరణాలు వెసుకుని, గుంపులు గుంపులుగా చుట్టు పక్కల పల్లెలకు పోయి ఆట పాటలు ప్రదర్శిస్తారు ఈ గుంపుల్ని 'దండారి గుంపులంటారు ఒక్కో గుంపుకు 20 నుంచి 40 వరకూ మనుష్యులుంటారు ఈ పెద్ద గుంపు నుంచి అంతర్భాగంగా ఇద్దరుగానీ, అయిదుగురు గానీ చేరి మరో గుంపు కడతారు ఈ గుంపును గుసడి పిలుస్తారు పౌర్ణమినాడు మొదలై తిరిగి బహుళ చతుర్దశి వరకూ ఈ నృత్యాలు

కొనసాగుతాయి ప్రతివాడూ నెమలి యీకలు పొదిగి, పెద్ద తలపాగా దరించి, ఇంకా జింక కొమ్ముల్నీ, కృత్రిమమైన మీసాలనూ, గడ్డాలనూ తగిలించుకుంటారు ఒంటికి మేక చర్మం చుట్టుకుంటారు వీళ్ళకు సహాయంగా, డప్పు, తుడుము, పిప్పి, కలికొమ్ము వంటి వాద్యాలు మోగుతుంటాయి గుమేలా ద్వనిస్తుండగా దండారీ గుంపు క్రమ విన్యాసంతో లయ బద్దంగా అడుగులు కదుపుతూ నృత్యం చేస్తుంది నృత్యం పరాకాష్ఠ నందుకున్న తరుణంలో గుసాది గుంపు హటాత్తుగా మద్యకు జొరబడుతుంది

దండారీ నృత్యం, మెల్లిగా ఎడమ వైపుకు అడుగులు కదపడంతో ఆరంబమవుతుంది కుడి నుంచి ఎడమకు ముందు ఎడమ పాదమూ, తరువాత ఆ స్థానంలో కుడి పాదమూ కదుపుతూ, ముందుకూ వెనకకూ ఉయ్యాల మాదిరిగా శరీర చాలనం చేస్తూ, ఈ నృత్యం ఆరంబమవుతుంది ప్రతి వాడి చేతుల్లోనూ రెండు చిన్న కర్రలుంటాయి ఆ కర్రలతో కోలాటం వేస్తూ మొత్తం గుంపంతా లయ బద్ధంగా ఎడమవైపుకు జరుగుతారు కోలాటాన్ని, ఇష్ట దేవతను ప్రార్థించే అంగంగా, ముగించిన వెనుక, కర్రలను విడిచి పెట్టి, అడుగుల కదలికతో, లయ విన్యాసంతో, గుంపులోని నాయకుడు మొదట గొంతెత్తి పాడగా, మొత్తం గుంపు దాన్ని అందుకుంటూ నృత్యాన్ని కొనసాగిస్తారు

దండారీ నృత్యం ఇట్లా కొనసాగుతుండగానే, గుసాది గుంపు ఆ వలయంలోనికి జొరబడుతుంది వీళ్ళు నెమలి యీకలతో కూర్చిన తలపాగా వంటిది దరిస్తారు మెళ్ళో గవ్వల దండలూ, పూసల దండలూ వేసుకుంటారు మీసాలూ, గడ్డాలూ కృత్రిమమైనవి తగిలించుకుంటారు మణికట్టుకు గజ్జెలో, చిఱు గంటలో కట్టుకుని, శరీరమంతా నాముతో తెల్లగా గీతల్నీ చుక్కల్ని చిత్రించుకుంటారు నడుముకు గోచీ, చేతుల్లో పొడువైన కర్రలతో, ఆహార్యకాన్ని సిద్ధం చేసుకుని గుసాదీలు గుంపులోకి జొరబడి పోతారు అప్పుడు దండారీ వలయం చెదిరిపోగా, చూసే వాళ్ళకు బెదురు కలిగేటంత బీకరంగా, పెద్ద పెద్ద అంగలు వేస్తూ, గంతులతో, పొలికేకలు పెడుతూ నృత్యాన్ని నిర్వహిస్తారు ఒక్క వలయానికే కట్టుబడి ఉండకుండా చుట్టూ మూగి ఉన్న ప్రేక్షకుల దగ్గరకి కూడా వచ్చి వాళ్లను తమ చేతుల్లో ఉన్న కర్రలతో తాకి

వాళ్ళకు గిలిగింతలు కలిగిస్తారు చిన్న పిల్లల్ని బయ భ్రాంతుల్ని చెయ్యడం, పెద్ద వాళ్ళను తమ కొంటె చేష్టలతో నవ్వించడం, ఇవన్నీ ఆ నృత్యంలో బాగాలే. నృత్యం అయిన తరువాత గ్రామస్థులు వారిని గ్రామంలోకి పిలిచి వాళ్ళ కాళ్ళు కడిగి గౌరవం చూపుతారు

## కొండ రెడ్ల మామిడి కొత్త

కొండ రెడ్లను బైసన్ రెడ్లంటారు వీళ్ళు ఖమ్మం, తూర్పు, పశ్చిమ గోదావరి అడవి ప్రాంతాలలో ఉండే గిరిజనులు ఈ ప్రదేశాలలో మామిడి చెట్లు విస్తారంగా కాస్తాయి పంట చేతికి వచ్చే ముందు చేసే పండుగ మామిడి కొత్త ఆ సందర్భంగా ఈ రెడ్లు నృత్యాన్ని నిర్వహిస్తారు వీళ్ళు గుసాదీలు చేసినట్లుగా శరీరాల మీద రంగులు వేసుకోవడం గానీ, అలంకరించుకోవడం గానీ చేయరు ముత్యాలమ్మను, కొండ దేవతను కొలుస్తూ చేసే నృత్యమిది ఇదీ సామూహిక నృత్యమే దీనికి సహాయక వాద్యం డప్పు

నలుగురైదుగురు స్త్రీలు మెటికలు విరుచుకుంటున్నప్పుడు పుట్టే చప్పుళ్ళ వంటి చప్పుళ్ళతో చేతులు పట్టుకుని నృత్యం ఆరంబిస్తారు స్త్రీలు, స్త్రీ పురుషులు ఈ నృత్యాన్ని కలిసి చేసినా వాళ్ళు వేరు వేరు గుంపులు గానే ఉంటారు కాళ్ళతో భూమిని తడుతూ స్త్రీలు ముందుకు నాలుగడుగులు వేస్తారు మళ్ళీ పక్కలకు అటూ ఇటూ వంగి, వెనక్కి వెళ్ళి పోతారు ఆడా మగా వలయం కట్టి లయ బద్ధంగా ఇలా ముందుకూ వెనక్కూ అడుగులు కదపడం, చూడడానికెంతో ఉత్తేజకరంగా కనిపిస్తుంది ఇందులో కదిపే అడుగుల కదలిక పురుషుల పద విన్యాసం కంటే విలక్షణంగా ఉంటుంది డప్పులు మోగించే వాళ్ళూ, ఇతర వాద్యగాళ్ళూ నృత్యారంబంలో వలయం మద్యలో ఉండి తర్వాత నృత్యకారులతో తామూ చేరి పోతారు డప్పుల వేగం అదికమైన కొద్దీ నృత్యకారుల అడుగుల కదలికలో వేగం పెరుగుతుంది

తర్వాత అర్థరాత్రి సమయానికి విందు బోజనం కానిచ్చి తిరిగీ నృత్యం మొదలు పెడతారు ఆ సమయంలో ముత్యాలమ్మనీ, తదితర గిరి

దేవతా సమూహాన్ని స్తుతిస్తూ పాటలు పాడుకుంటారు ఈ పాటలన్నీ ఆచారాత్మకాలు పాట పరకాష్ఠ నందుకోగానే నృత్యమూ పరాకాష్ఠనంది అక్కడితో పాటా, పాటతో పాటు ఆటా — రెండూ ముగింపు కొచ్చేస్తాయి ఈ రకంగా శరీరం అలసి పోయేంతవరకూ తెల్లవార్లూ పాటలూ, ఆటలూ సాగుతూనే ఉంటాయి.

## ఖోండుల నెమలి నృత్యం

ఖోండుల్ని సామంతులని కూడా పిలుస్తారు విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో మారుమూల కొండ ప్రాంతాలలో నివసించే ఆటవికులు వీళ్ళు. ఈ అటవీ ప్రాంతంలో ఉండే వృక్ష సంపదా, జంతు పక్షి సంపదా, ఎన్నదగ్గది. ఇక్కడ నెమళ్ళు విస్తారంగా ఉంటాయి ఖోండులు వివాహ సందర్భాలలోనూ, ఏప్రిల్ నెలలో జరిగే పండుగ సందర్భాలలోనూ, ఈ నెమలి నృత్యాన్ని చేస్తారు. మణికట్టుకున్న చిఱుగంటల చప్పుడూ, 'పిరొది'అనే ఒకరకపు పిల్లన గ్రోవి వాళ్ళ నృత్యానికి అమరే వాద్య సహాయాలు తెల్ల పంచెలు కట్టుకుని, ముయ్యంగమని పిలవబడే మణికట్టు ఆభరణాలు ధరించి, తోయాంగం అన బడే తలపాగా ధరించి, నృత్యానికి వేషం సిద్ధం చేసుకుంటారు ఈ తోయాంగం అక్కడ పెరిగే గడ్డి బొద్దులతో తయారవుతుంది దానిలో రంగురంగుల గుడ్డ పీలికలు చెక్కుతారు మొలకు వెనుక బాగాన రంగురంగుల నెమలి యీకల్ని అమర్చుకుంటారు వాళ్ళు నృత్యం చేసేటప్పుడు అడుగులు వేస్తూ ముందుకు వంగిన సందర్భాన నెమలి విప్పిన పురిలా, ఆ అలంకరణ బాసిస్తుంది

నృత్యం చేసేవారు రెండు గుంపులై వరుసగా ఎదురెదురుగా సర్దుకుంటారు నెమలి కేకల్ని అనుకరిస్తూ కేకల్ని సారించి, తర్వాత వలయాకారంగా చేరి మోకాళ్ళమీదికి వంగుతారు అలా చేయడం వలన మొత్తం నర్తకులంతా, ఆడే నెమళ్ళ వలె చూపరులకు కనిపిస్తుంటారు భూదేవినీ, సూర్యదేవరనూ పాటల రూపంలో కొలిచి నృత్యాన్ని ప్రారంబిస్తారు అరచేతుల్ని నోటికి అడ్డం పెట్టుకుని నెమలి కేకల్ని అనుకరిస్తూ, కుడి కాలిమీద నిలుచుని, ఎడమ కాలును లయాత్మకంగా ఆడిస్తూ నెమలి భంగిమను ప్రదర్శిస్తారు కూర్చుని, వలయాలు ఏర్పాటు చేసుకుంటూ, వంగుని, చేతి గుడ్డల్ని

గాలిలో ఎగర వేస్తూ వాళ్ళు గుంపుల కొద్దీ నెమళ్ళు ఆడుతున్నాయా అనే భ్రమను కలిగిస్తారు

## దింసా నృత్యం

విజయనగరం జిల్లాకు చెందిన అరకులోయ మనోహర ప్రదేశం వాల్మీకులు, బగతలు, కోటియా, బోండ్ తెగలకు సంబంధించిన, ఆటవిక జాతులు ఇక్కడ నివసిస్తుంటారు వీళ్ళు చేసే నృత్యం దింసా నృత్యం చైత్ర మాసంలో, పండుగలప్పుడూ, వివాహాది శుభ కార్యాలలోనూ, ఆడా, మగా, పిన్న, పెద్ద తేడాలు లేకుండా అందరూ ఈ నృత్యోత్సవంలో పాల్గొంటుంటారు ఆ సమయంలో ఒక పల్లె నుంచి మరో పల్లెకు పోతూ, వాళ్ళిచ్చే సామూహిక భోజనాలు స్వీకరిస్తూ, జనం ఆనందిస్తారు ఈ నృత్యం ఇలా పల్లెపల్లెలో నేర్పేవారిని "సంకిడి కేల్బరు" లంటారు అందువల్ల ఈ నృత్యం కేవలం వినోదం కోసం మాత్రమే కాక, మనుష్యుల మధ్య సౌభ్రాతృత్వాన్ని కలిగించడానికి ఉపయోగపడుతుంది మోరి, కిరిది, తుడుము, డుప్పు, జోడు కొమ్ములు అనేవి ఈ నృత్య సందర్భంలో ఉపయోగపడే వాద్యాలు ఈ దింసా నృత్యంలో ఎనిమిది రకాల బేధాలు కనిపిస్తాయి

**(1) బోడ దింసా** గ్రామ దేవతలను పూజిస్తూ చేసే నృత్యం బోడ దింసా కుడి వైపు మగవాళ్ళు ఎడమ వైపు ఆడవాళ్ళు, వరుసలో బారులు తీరి, వీపు వెనుక నుంచి చేతులు పోనిచ్చి ఒకరి నడుమొకరు పట్టుకుంటారు కుడి వరుసలోని మొదటి వ్యక్తి అడుగులు కదుపుతూ ముందుకు రాగా, ఎడమ వరుసలోని చివరి వ్యక్తి అతణ్ణి కలుసుకోవడం జరుగుతుంది అప్పుడు మిగిలిన నృత్య కారులంతా, పాముల వలె మెలికలు తిరుగుతూ, హరి, హుయి అని ఆనందాతిరేకం చేత అరుస్తూ తిరిగి, చివరకు మళ్ళీ తమ తమ వరుసల్లో చేరిపోతారు

**(2) గుండేరి దింసా** దీన్నే ఉసుకు దింసా అంటారు పురుషుల వరుసలోని వాడు తమతో నృత్యం చేయమనే అర్థాన్నిచ్చే పాట పాడుతూ స్త్రీ వరుసలోని వాళ్ళను ఆహ్వానిస్తాడు ఆడా మగా కలిసి లయబద్ధంగా వంయాలు చుదుతూ ఉద్రేక భరితంగా చేసే నృత్యమిది

(3) **గొడ్డి బేట దింసా** తలలు కిందికి దించి పైకి ఎత్తుతూ, రాళ్ళు ఏరుతున్న భ్రమను కలిగిస్తూ ఈ నృత్యం చేస్తారు ముందుకు 25 అడుగులు వేసి మళ్ళీ వెనక్కు వచ్చి, అట్లా నాలుగైదు సార్లు ఆవర్తించడం ఈ నృత్యంలో విశేషం

(4) **పోతర్ తోల దింసా** ఇది ఆకుల్ని కోయడం అనుకరించే నృత్యం ఈ నృత్యం రెండు వరుసల్లో ఒక దాని వెనుక ఒకటిగా సాగుతుంది ముందు వరుస మనుష్యుల భుజాల మీద వెనుక వరుస మనుష్యులు చేతులు వేసి, తలల్ని పక్కలకు కదుపుతూ, ముందుకూ వెనక్కూ అడుగులు కదపడం ఈ నృత్యంలోని విశేష

(5) **బాగ్ దింసా** పులి ఎదురైనప్పుడు వేటకాడు ఎట్లా తప్పించుకుని లొంగ దీసుకుంట ఈ నృత్యంలో ప్రదర్శింపబడుతుంది

(6) **నటికరి దింసా** వాల్మీకుల్లో దీపావళి ఓకాన ఒక్క వ్యక్తి చేసే నృత్యం ఇది ఇతర తెగల వాళ్ళు కూడా దీన్ని ఇతరాలయిన పండుగల సందర్భంలో చేయడం కద్దు

(7) **కుండ దింసా** ఈ నాట్యంలో నృత్యం చేసేవారు పక్కలకు ఊగుతూ, తమ భుజాలతో పక్కవాళ్ళను తోయడం ఒక ప్రత్యేక లక్షణం

(8) **బయ దింసా** ఆటవికులకు చెందిన గణాచారి నెరిపే నృత్యం ఇది మతపరమైన ఈ నృత్యంలో, గణాచారి మీదికి దేవత వాలడం వలన అతను పూనకాన్ని సూచిస్తూ లయాత్మకంగా ఊగుతాడు చుట్టూ ఉన్న జనం, ఈ నృత్యం జరుగుతున్నంత సేపూ తలలు వంచి వినమ్రులై ఉంటారు

పైన చెప్పిన ఈ నృత్య విశేషాలన్నీ ఆటవికులవీ, గిరిజనులవీ ఈ నృత్యాలు వెలిబుచ్చే పరమార్థం ఒకటి కనిపిస్తుంది అది ఏక సామాజిక లక్షణం జనమంతా ఒకే సమాజానికి చెందిన వాళ్ళు అనే ఉదాత్త బావనను వెలికి తెచ్చేవిగా, ఈ నృత్యాలు తీర్చబడ్డాయి కులం, వయస్సు, లింగం, అనే బేదాలు లేకుండా అందరూ ఈ నృత్యాల్లో పాల్గోవడం గమనించదగ్గ విషయం గిరిజనాబివృద్ధి పదకాలు వాళ్ళ జీవన విదానంలో కొద్దో గొప్పో మార్పులు తెచ్చినా, వాళ్ళ సంస్కృతికి సంబందించిన ఈ నృత్య

విదానంలో ఏమీ మార్పు రాలేదు ఈ నృత్యాలు, సంప్రదాయ నాగర నృత్యాలలో చేర్చబడ లేదు ఇవన్నీ ఆది, లేదా రూప తాళ గతుల్ని అనుసరించి మాత్రమే కుదురుకుని ఉండడం మనం గమనించవచ్చు

**లంబాడీ నృత్యం** · ఆంధ్ర ప్రదేశ మంతటా కనిపించే సంచార జాతి లంబాడీ జాతి వీళ్ళనే బంజారాలనీ, సుగాలీలనీ అంటారు లంబాడీ స్త్రీలందరూ నాట్యం చేయగలవారే ఈ నృత్యంలో క్లిష్టత లేకుండా, చాలా సరళంగా, మనోహరంగా ఉంటుంది నిత్య జీవితంలోని పనిపాటలను అనుకరిస్తూ ఈ నృత్య విశేపాలు తీర్చి దిద్దబడతాయి విత్తులు చల్లడం, నాట్లు, పంట కోతలు మొదలైన చర్యల నన్నిటినీ వాళ్ళ నృత్యాలలో అనుకరిస్తారు వాళ్ళ వస్త్రాలను, అద్దాలు, పూసలు మొదలైన వస్తువుల కుట్టుపనులతో కళ్ళు చెదిరేట్లుగా తయారు చేసుకుంటారు ఇత్తడి కడియాలు గవ్వల దండలు, కొమ్ము గాజులు, మొదలైనవన్నీ మణికట్టునుంచి మోచేతి వరకూ తగిలించు కుంటారు వాటి చప్పుళ్ళు గలగల లాడుతూ, వాళ్ళ నృత్యానికి లయాత్మక ధ్వని విశేషాన్ని అందిస్తుంటాయి దసరా, దీపావళి, హోలీ పండుగ సందర్భాలలో లంబాడీలు, గృహాల ముందు యాచనకై వచ్చి నృత్యం నెరుపుతూ పాటలు పాడుతారు ఇరవై ముప్పైమంది యువతులు, తళతళలాడే ఇత్తడి బిందెల్ని నడుముమీదో, తలమీదకో, ఎత్తుకుని లలితమైన అంగ విన్యాసంతో పాటు చేతులు తిప్పుతూ నడుములు కదిలిస్తూ, నృత్యం చేస్తుంటే చూడ ముచ్చటగా ఉంటుంది

**సిద్ది నృత్యం** · సిద్దీల పూర్వీకులు మొదట ఆఫ్రికా దేశస్థులు దేశాంతరాలు పయనించి హైదరాబాదులో తావరం ఏర్పరచుకున్నారు వీరు పండుగ సమయాలలోను, వివాహ సమయాలలోనూ నృత్యాలు చేస్తుంటారు వాళ్ళ స్వదేశంలోని ఆటవిక సముదాయాలమధ్య జరిగే యుద్ధాన్ని చిత్రించే నృత్యాలివి పురాతనమైన, దేశీయ వేపాన్ని దరించి తళతళ మెరిసే కత్తులు దరించి ఉద్రేకపూర్ణమైన అడుగుల కదలికతో సిద్దీలు నృత్యం చేస్తారు ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామీణ ప్రాంతాలలో జానపద నృత్యగానాలు కొన్ని ప్రాంతాలకు మాత్రమే పరిమితమై ఉన్నాయి కాని కొన్ని నృత్యగానాలు రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలవారు ఆడుతూ పాడుతూ ఉంటారు వానిలో కొన్నింటిని ఈ దిగువ వివరించడం జరిగింది

**బతుకమ్మ పండుగ** బ్రతుకమ్మ అనే పదానికి బతుకమ్మ వైకృత రూపం తెలంగాణా అంతా ఈ పండుగ చేస్తారు రాయలసీమలో కూడా అక్కడక్కడా దీన్ని చేస్తారు ఆశ్వయుజ శుక్ల పక్ష పాడ్యమి నుంచి ఇది ఆరంబమవుతుంది నవమి నాటికి పూర్తవుతుంది ఈ దినాలలో మహాలక్ష్మిని పూజ చేస్తారు మహాలక్ష్మి దర్మాంగదుడనే రాజుకు, దర్మపత్ని సత్యవతి వలన కుమార్తెగా జనిస్తుందనీ ఆమె పేరు బ్రతుకమ్మ అనీ కద ఉన్నది ఈ కదనే పాటగా పాడుతుంటారు ఇళ్ళలో, గృహిణులు స్నానం చేసి రకరకాల పువ్వుల్ని అందంగా ఒక పళ్ళెంలోనో, ఆకులోనో, వెదురు పల్లికలోనో గోపురాకారంలో ఎత్తుగా పేరుస్తారు పైన చిన్న పసుపుముద్దను పెట్టి లక్ష్మీదేవిగా బావించి పూజిస్తారు పూజ అయిన వెనుక పూజగదిలో ఒక మూల బతుకమ్మ నుంచుతారు సాయంత్రాలప్పుడు, స్త్రీలు చక్కటి దుస్తుల్ని అలంకరించుకుని బతుకమ్మలను, గుడికో, చెఱువుకో, తీసుకొనిపోతారు అక్కడ మొదట నేలపై ఈ పళ్ళాలను ఉంచి, చుట్టూ వలయాకారంగా చప్పట్లు కొట్టుకుంటూ, అందరూ బతుకమ్మ పాటలు పాడుకుంటారు ఈ పాటా, నాట్యమూ అయిన తరువాత, బతుకమ్మలను చెఱువు నీటిలో తేలిపోయేటట్లుగా విడిచి పెడతారు ఈ రకంగా ఈ పండుగ తొమ్మిది రోజుల పాటు సాగుతుంది చివరి రోజు పండగను చద్దుల బతుకమ్మ పండుగ అని పిలుస్తారు

**బొడ్డెమ్మ :** బ్రతుకమ్మ పండుగకు తొమ్మిది రోజుల ముందే బొడ్డెమ్మ పండుగ ఆరంబమవుతుంది మహాలయ అమావాస్యతో ముగుస్తుంది బతుకమ్మ లక్ష్మి కాగా, బొడ్డెమ్మ గౌరీదేవి ఈ పండుగను పెళ్ళికాని పిల్లలు చేసుకుంటారు చీమల పుట్టల నుంచి మన్ను తెచ్చి ఏడు అంతరాలుగా దాన్ని పేరుస్తారు ఆ గోపురానికి పువ్వులు కూరుస్తారు పసుపూ కుంకుమలు చల్లుతారు ఇంటి ముంగిట అలికి ముగ్గుపెట్టి, అక్కడ బొడ్డెమ్మను ఉంచుతారు ఆడపిల్లలందరూ బొడ్డెమ్మ చుట్టూ చేరి పాటలు పాడుతూ, నృత్యం చేస్తూ తమకు త్వరగా పెండ్లి కావాలనీ, మంచి బర్త లబించాలనీ, గౌరీదేవిని పూజిస్తారు తెలంగాణాలోని ఈ బొడ్డెమ్మకు మారుగా ఆంధ్ర ప్రాంతంలో గొబ్బిళ్ళు కనిపిస్తాయి

**తప్పెటగుళ్ళు** తప్పెటగుండ్లు అని మరో పేరున్న ఈ నృత్య ప్రక్రియ కోస్తా ప్రాంతాలయిన శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం జిల్లాలలో

మనకు కనిపిస్తుంది గంగ జాతరల సమయంలో ముఖ్యదేవత గంగకు ప్రీతి కలిగించడానికై తొలుత ఈ నృత్యాన్ని గొల్లలు ఆచారాత్మకంగా ప్రదర్శించే వారు రానురాను, వ్యవసాయ వృత్తిలో ఉన్న అన్ని కులాలవారూ దీన్ని ప్రదర్శిస్తుంటారు. వీరు శ్రీకృష్ణుని లీలలను కూడా భక్తి పారశ్యంతో కదవాత్మకంగా ప్రదర్శిస్తారు దశావతార కదలను, గంగమ్మ కదలను మనోహరంగా తప్పెటగుండ్లు ఉపయోగిస్తూ పాడడం వీరి ప్రత్యేకత తప్పెట్ల లేదా గుండు అనే పేర్లతో పిలవబడే చర్మవాద్యాన్ని వీళ్ళు కదాగానంలో ఉపయోగించడం వలన ఈ ప్రక్రియకీపేరు వచ్చింది దీన్ని మెడలో తగిలించుకుని పక్కన ఉండే తాళ్ళ సహాయంతో తప్పెటను ఎదురు రొమ్ముకు అతుక్కుని ఉండేటట్లుగా కట్టుకుంటారు. గుండెకు ఈ తప్పెటను చేర్చుకోవడం వలన, దీనికి గుండె తప్పెట్లు అనే పేరు కూడా ఉంది వీళ్ళు తమ కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు మట్టలాగూలు తొడుగు కుంటారు తొడల మీదికి మాత్రమే ఉండే ఆ లాగూల అంచులకు గజ్జెలు కూరుస్తారు నడుము చుట్టూ రంగురంగుల పడకాలను చుట్టు కుంటారు వెనకవైపు నుండి ముందువైపు నుండి పొడుగాటి రెండు గుడ్డలను మడమల వరకూ వేలాడేటట్లుగా విడిచిపెడతారు

ఈ నృత్యానికి చాతుర్యమే కాక కండబలం కూడా అవసరమే అందువల్ల ఈ నృత్యం చేసే వారు దేహపుష్టి కలవారై ఉండక తప్పదు వివిద గతులూ, శరీరాన్ని లాఘవంతో గంతులు వేయించడాలూ, ఈ నృత్యంలో ప్రదానంగా కనిపిస్తాయి ఇందులో నృత్యకారులు తమకు తామే పాటలు పాడుతారు వీరి పాటా, ఆటా, వీరి గజ్జెల చప్పుడూ, వీరు వాయించే తప్పెటల చప్పుడూ అన్నీ మదురమైన లయాత్మక నాదంగా మారి, ఈ నృత్యాన్ని మనోహరమైన దృశ్య ప్రక్రియగా రూపొందిస్తుంటాయి వీళ్ళ ఆట పాటల్లో 20 వరకూ గతి బేదాలుంటాయి వీళ్ళు ఒక జట్టుగా ఈ ప్రక్రియను నిర్వహిస్తారు ఆ జట్టుకు ఒక నాయకుడుంటాడు అతడు మొదట పాడిన పల్లవిని అందరూ అందుకుని గానాన్ని కొనసాగిస్తారు

ఈ తప్పెట గుండ్లలో ఒక ప్రదర్శనా బాగం చేర్చబడ్డది కొన్ని ప్రాంతాలలో అది వాడుకలో ఉంది ఎనిమిది మంది నృత్యం చేస్తూనే, ఒకరి బుజా

లమీద ఒకరు, వాళ్ళ భుజాల మీద మరొకరు చొప్పున ఎక్కి ఒక గోపురా కారం వచ్చేట్లుగా ప్రదర్శిస్తారు లేదా ఒక చెట్టులాగా, కొమ్మలు క్రిందికి వేలాడుతున్నట్లుగా ప్రదర్శిస్తారు ఒకరిమీద ఒకరు నిలబడుతూ చిట్టచివరి మనిషి నిండా నీరున్న కుండను తొణకకుండా తలమీద నిలుపుకుంటాడు గిరగిరా గుండ్రంగా తిరుగుతూ పెద్ద చప్పుడుతో క్రిందికి దుముకుతారు వర్తులాకారంగా ఉండే నృత్య వలయంలో నుండి కేంద్ర బిందువు దగ్గరకు ఒక్కొక్కరూ వచ్చి అంగ విన్యాసాలు పలురకాలుగా చేసి తిరిగి వలయం లోకి వెళ్ళిపోతారు బహుశా ఈ రకమైన విన్యాసాల మీద పంజాబీ బంగ్రా నృత్య ప్రభావం ఉండి ఉండవచ్చు కారణం ఇటువంటి చమకులన్నీ వ్యక్తులు తయారుచేసే జట్లలో మాత్రమే కనిపిస్తాయి షేర్ మహమ్మద్‌పురానికి చెందిన కోన చిన్నవాడి జట్టు, కోరాడకు చెందిన పోతప్పడి జట్టు ఇటు వంటి చమత్కారాలకు ప్రసిద్ధి ఉత్సవాలకూ, జాతరలకూ, మత సంబంధ మైన పండగలకూ, మత ప్రమేయంలేని సంబరాలకూ, ఈనాడు ఇటువంటి జట్లు ప్రదర్శనార్థం ఆహ్వానింపబడుతున్నాయి

**ఉరుములు** · అనంతపురం జిల్లాలో ఈ ఉరుము నృత్యం ప్రదర్శింప బడు తుంది ఈ నృత్య సమయంలో ఉపయోగించే చర్మవాద్యం పేరు ఉరుము దాని వలననే ఈ నృత్యానికి ఆ పేరు వచ్చింది కంచు చట్రానికి రెండువైపులా మేక చర్మం బిగించి ఈ వాద్యాన్ని తయారుచేస్తారు ఇది $1^1/_2$ అడుగుల వ్యాసమూ $2^1/_2$ అడుగుల పొడుగూ ఉండే బృహత్ వాయిద్యం ఈ ఉరుముపై బాగంలో ఇత్తడి వలయాలలో దూర్చిన తాళ్ళు, చర్మం యొక్క బిగుతును సరిచేయడానికి ఉపయోగపడుతుంటాయి దీన్ని ఎడమ భుజానికి కళాకారుడు తగిలించుకుంటాడు అది పొట్టమీదికి వచ్చి కుదురుకుంటుంది అటూ ఇటూ తొణకకుండా దాన్ని తాళ్ళతో కుడివైపుగా నడుముకు బందించుకుంటాడు వాద్యకారుడి చేతిలో రెండు పుల్లలుంటాయి ఒకటి సన్నదీ, మరొకటి కాస్త లావయినదీ ఎడమ చేతిలో సన్నని పుల్ల పట్టు కుని బిగించిన చర్మం మీద రుద్దుతుంటాడు కుడిచేతిలోని లావైన పుల్లతో కుడివైపు చర్మం మీద తాడిస్తుంటాడు

ఉరుము నృత్యకారులు పెద్యూల్లు కులాలకు చెందినవారు వీళ్ళు

మత సంబంధమైన పవిత్రతను పాటిస్తూ, అక్కమ్మ అనే దేవతను కొలు స్తుంటారు వీరు మద్యం, మాంసాలు ముట్టరు దేవత ప్రీతి కోసం మాత్రమే వీరు ఉరుము నృత్యాన్ని నిర్వహిస్తారు ఉరుమును వాయిస్తూ వీళ్ళు గుంపుగా వలయాకారంలో కూడి వివిద గతి బేదాలతో నర్తిస్తారు తలకు చుట్టపాగాలు దరించి, మెళ్ళో నాణెముల దండలూ, పూసల దండలూ వేసుకుంటారు ముఖం నిండా పసుపు పూసుకుని నామం దరిస్తారు మెడ నుండి మోకాళ్ళ దిగువదాకా కప్పే పెద్ద అంగరఖాలు వేసుకుంటారు రెండు బుజాల నుండి దిగువకు జారేటట్లు కండువా వేసుకుంటారు అక్కమ్మ దేవత మీద, కదిరి నరసింహస్వామి మీద, కైగట్టిన పాటలూ, దశావతార గీతాలూ వీళ్ళు పాడు తుంటారు గ్రామ దేవతల ఉత్సవ సమయాల్లో వీళ్ళ ఉరుము మోతలు మెండుగా వినిపిస్తాయి ఈ ఉరుము వాద్యాన్ని వీళ్ళు మోగించగానే ఆకాశం ఉరుములతో ప్రతిద్వనిస్తుందని వీళ్ళ నమ్మకం

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమీ, అనంతపురం జిల్లాకు మాత్రమే పరిమితమైన ఈ ఉరుము నృత్యాన్ని అన్ని జిల్లాల ముఖ్య కేంద్రాలలోనూ పరిచయం చేసే కార్యక్రమాన్ని చేపట్టింది

**గొరవయ్యలు** గొర్రెలు కాచే కులంలో అంతర్భాగానికి కురుబ లేదా కురుమ అని పేరు కురమలు గొర్రెలు కాయడమే కాక ఉన్ని కంబళ్ళు కూడా నేస్తా రు ఈ కురమలలో పూజారులుగా ఉండే వాళ్ళనే గొరవయ్యలు అంటారు ఇక్కడ గొరవ శబ్దం, గురు శబ్దాన్నుండి పుట్టిన శబ్దం ఈ కులంలో ఒక యింట్లో పుట్టిన మగ పిల్లలలో ఒకణ్ణి శ్రీశైల మల్లికార్జున స్వామికి అంకితంగా విడిచి పెడతారు ఆ పిల్లవాడు పెద్దవాడైనాక, మైలార స్వామికి సంబందిం చిన ఆచారకాండలో ప్రవీణుడై పెద్దవాళ్ళయిన గొరవలచేత, ఆచార పూర్వ కమైన ఆటపాటలలో ప్రవేశాన్ని పొందుతాడు మల్లన్నకు సంబందించిన జాతరలలోనూ, కల్యాణోత్సవాలలోనూ వీళ్ళ ఆటపాటలను బక్తితో తిలకించే జనులు ఎంతోమంది సమకూడుతారు

శ్రీశైల మల్లన్న, కర్నూలు జిల్లాకు చెందిన నేరనిలోన గట్టుమల్లన్న, వరంగల్ జిల్లా అయినవోలులోని ఐలోని మల్లన్న, కరీంనగర్ జిల్లాలోని కొమి రెల్లి మల్లన్న ఉత్సవాలు ప్రతియేటా జరుగుతుంటాయి ఆయాచోట్ల, ఉత్సవ

సమయాలలో గొరవయ్యల ఆటపాటల్ని చూడడానికి జనులు పెద్ద సంఖ్యలో సమావేశమౌతుంటారు ఉత్సవాలు లేని రోజులలో గొరవయ్యలు ఒక ఊరి నుండి మరొక ఊరికి సంచరిస్తూ, మల్లన్న కదలను పాడుతూ శివభక్త వరుల గాదల్ని చెప్తూ భక్తుల్ని ఆశీర్వదిస్తూ బిక్షం సంపాదించి పొట్టపోసు కుంటుంటారు

వాళ్ళ వేషదారణ ప్రత్యేకంగా ఉంటుంది కంబళితో చేసిన పెద్ద అంగరఖాను తొడుక్కుంటారు నల్లని ఆ అంగరఖా మీద తెల్లని చారలుంటాయి ఎలుగు చర్మంతో తయారుచేసిన త్రికోణాకారపు తోలు టోపీని పెట్టుకుంటా రు అంగరఖాపైన, మెడను చుట్టి, రెండు బుజాల మీదగా కిందికి జారిన పెద్ద కండువా వంటిదుంటుంది మరొక వస్త్రాన్ని పటకాగా తయారుచేసి నడుము చుట్టూ అమర్చుకుంటారు వారి బుజానికి జింక తోలుతో చేసిన సంచి వేలాడుతుంటుంది అందులో పవిత్రమైన శివ ప్రసాదంగా వాళ్ళు పరిగణించే 'బండారు' ఉంటుంది అది బక్తులకు ప్రసాదంగా పంచబడుతుం ది అంతేకాక, ఒక ఇత్తడి పాత్ర, పాలుతాగడానికి, నడుముకు వేలాడుతుం టుంది దీనితో పాలేకాక వాళ్ళు పంచామృతం కూడా తాగుతారు వాళ్ళు మెడచుట్టూ గవ్వల దండలు వేసుకుంటారు మడమలకు గజ్జెలు కట్టుకుంటా రు కుడిచేతిలో ఢమరుకాన్ని, ఎడమ చేతిలో వేణుదండాన్నీ దరిస్తారు

వాళ్ళు ఆటపాటలు ప్రదర్శించే సమయంలో పై వాద్యాలను వాయి స్తుంటారు వాళ్ళ నృత్యం ఎన్నో నృత్యాలకంటే విశిష్టంగా ఉంటుంది వాళ్ళు గుండ్రంగా వలయాలను సృష్టిస్తూ తిరుగుతుంటారు అప్పుడప్పుడూ పోట్లా డుకుంటున్న పొట్టేళ్ళకుమల్లే ఎగిరి ముందుకూ వెనక్కూ దూకుతుంటారు మద్య మధ్య ఒకరి మీద ఒకరు కుక్కలు మొరిగినట్లు మొరుగుతుంటారు వాళ్ళు తమనితాము 'మల్లయ్య కుక్కలు' అని పిలుచుకుంటుంటారు పాలు కాని, పంచామృతంగానీ, ఇత్తడి గిన్నెలలో పోసుకుని తాగేటప్పుడు, గిన్నెను నేలమీద ఉంచి, దానిముందు రెండు కాళ్ళతోనూ చేతులతోనూ మోకరించి, కుక్కలు గతికినట్లుగా గతుకుతూ తాగుతారు వాళ్ళు తాగగా మిగిలిన పాలను, బక్తులకు ప్రసాదమని పంచిపెడతారు ఉత్సవసమయాల్లో దేవుడి ముందు ఈ నృత్యం చేసేటప్పుడు, బుగ్గలకు, మణికట్టుల దగ్గర, దండలకు, ఒక

పక్క నుండి మరొక పక్కకు దూసుకు పోయేటట్లుగా గుచ్చుకుంటారు వీరు తాళ్ళతో తమని తాము కొట్టుకుంటూ ఉంటారు గొరవయ్యల నృత్యం పూర్తిగా ఆచారపరమైనది ఇందుకు బిన్నంగా వారు, శివభక్తవరుల కదాగానాన్ని కేవలం తాము యాచించేటప్పుడు మాత్రమే చేస్తారు

గరగ నృత్యం . గరగ అంటే మట్టికుండ ఈ కుండను నెత్తిమీద ఉంచుకుని చేసే నృత్యాన్ని గరగ నృత్యమంటారు ఇది కర్నాటక, తమిళనాడు రాష్ట్రాలలో మిక్కిలి ప్రసిద్ధి వహించిన నృత్యం తమిళనాడులో దీన్ని కరగం అంటారు గ్రామదేవతలను కొలిచేటప్పుడు, ఆ దేవతల వేల్పుటోడైన ఆసాదివాడు, కుండనెత్తిన పెట్టుకుని, ఈ నృత్యం చేస్తాడు తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలతో మనకుగల సరిహద్దు ప్రాంతాలలో ఈ నృత్యం ఎక్కువగా కనిపిస్తుంటుంది దీని చిన్నెలు కొన్ని మాత్రమే సంతరించుకున్న 'బోనాలు' తెలంగాణా ప్రాంతంలో విరివిగా కనిపిస్తుంది

పాతకాలంలో ఈ నృత్యం కేవలం ఆచారాత్మకమైన నృత్యం మాత్రమే గ్రామదేవతలకు పూజారి అయిన గణాచారి పూనకం వచ్చినప్పుడు, ఉత్సవ సమయాలలో బాగా రంగులద్ది అలంకరింపబడిన పెద్దకుండను నెత్తిపైకెత్తుకుని గుడి ముందు చిందులు తొక్కేవాడు లేదా ఆవిడ విగ్రహంతో పాటు డప్పులు మోగుతుండగా ఊరేగేవాడు రాను రాను గరగ నృత్యానికి ఎన్నో చిలవలూ పలవలూ చేర్చబడ్డాయి గరగను నెత్తికెత్తుకుని ఆడేవాడికి ప్రసాదనం, ఆతని అడుగుల కదలికకు ఎన్నో గతిభేదాలూ చేరాయి మట్టి కుండలకు బదులుగా ఇత్తడి కుండలు, వాటిపై రంగురంగుల వస్త్రాచ్ఛాదనలూ ఏర్పడ్డాయి పక్క వాద్యాల సహకారం కలిగింది ఇత్తడి బిందె మూతిని మూయడానికి అయిదు పడగలు కల సర్పాకారపు మూత ఏర్పడింది నృత్యం చేసేవాడు రంగురంగుల వస్త్రాలు దరించి చేతిలో వేపమండల్ని పట్టుకుని ఉంటాడు శక్తిపూజకు వేప ప్రముఖమైన వస్తువు డప్పును మోగించేవారు త్రిస్రగతిలో, చతురస్ర గతిలో మోతన కొనసాగిస్తుండగా దానికనుగుణంగా నృత్యకారుడు గతిబేదాల్ని పాటిస్తూ నాట్యం చేస్తాడు డప్పుమోతకు అనుగుణంగా అతడు కాలికి కట్టుకున్న గజ్జెలు కూడా మోగుతుంటాయి నృత్యం చేసేవాడు తలమీద పాత్రపడిపోకుండా జాగ్రత్తపడుతూ నాట్యం కొనసాగిస్తాడు

అతని శరీరమూ, సర్వావయవాలూ వేగంగా కదిలినా తల మాత్రం ఏ మాత్రమూ కదలదు చూడడానికి అదంతా ఒక చమత్కారపూరితమైన విషయంగా కని పిస్తుంటుంది ప్రేక్షకులను ఆకట్టుకోవడానికి ఈ గరగ నృత్యంలో రకరకాల భంగిమలూ విన్యాసాలు జొన్పబడ్డాయి నెత్తిమీద కుండ తొణకకుండా నృత్య కారుడు పొట్టమీద బోర్లాపడుకుని ముందున్న నాణేలనుగానీ, కర్రముక్కలను గానీ, పెదాలతో అందుకుంటాడు ఎదురెదురుగా ఇద్దరు నృత్యకారులు ఒంటి కాలిపై నిలబడి, రెండవకాలిని, మరొకరి కాలితో ముడివేసి కుండలు పడ కుండా విన్యాసాలు చేస్తారు కోలాటాలాడుతారు తూర్పు గోదావరి జిల్లాకు చెందిన గిట్టా వెంకటేశ్వర్ల బృందం ఈ నృత్య కళలో ఆరితేరిన బృందం

**బుట్టబొమ్మలాట** · భారతదేశంలో అతి ప్రాచీనమైన జానపద క్రీడ బుట్టబొ మ్మలాట చింతగింజల గుజ్జు, కాగితపు గుజ్జు, ఆవుపేడ, వరిపొట్టు, గడ్డి. వెదురు పుల్లలు, వీటిని ఉపయోగించి బుట్టబొమ్మల్ని తయారు చేసుకుంటా రు ఆ బొమ్మల్ని సంప్రదాయానుసారం రంగులు పులిమి అలంకరిస్తారు అన్ని బొమ్మలూ నడుమువరకే చేయబడి ఉంటాయి నిజానికి వీటిని బొమ్మ లనడం కంటే లోపలంతా డొల్లగా ఉండే తొడుగులు అనడం సత్యానికి దగ్గ రైన విషయం బుట్టబొమ్మల్ని ఆడించే వ్యక్తి ఆ బొమ్మలో దూరాక నడుం చుట్టూ, గుడ్డనొకదాన్ని ఆ తొడుగు అంచును కలుపుతూ కట్టుకుంటాడు అప్పుడు బొమ్మకూ మనిషికీ తేడా తెలీకుండా మొత్తం ఆ మనిషికూడా బొమ్మలో బాగంగానే కనిపిస్తాడు బొమ్మకు బొడ్డుబాగంలో రంధ్రా లుంటాయి మనిషి కళ్ళు ఆ రంధ్రాల దగ్గర అమరేటట్లుగా చూచుకుని, వాటి ద్వారా అతడు చుట్టూ ఉన్న వారిని చూడగలుగుతాడు శివుడు, పార్వతి, విష్ణువు లక్ష్మి, గరుడుడు, హనుమంతుడు, రాదాకృష్ణులు - ఈ రూపాలతో సాధార ణంగా బుట్టబొమ్మల్ని తయారు చేస్తుంటారు జాతరలు, రద యాత్రలు, వివాహాది శుభకార్యాలు, గణేశ నిమజ్జనోత్సవం, చివరకు రాజకీయాలయిన పార్టీల ప్రచార సందర్భాలు, ఈ అన్ని వేళలా ఈ రోజుల్లో బుట్టబొమ్మలాట లుంటున్నాయి బాగా పెద్దవిగా తయారు చేయబడిన ఈ తొడుగులు తొడు క్కుని, డప్పులు మోగుతుండగా, ఆ శబ్దానికి అనుగుణంగా బొమ్మల్ని ఆడిం చడం ఒక హృదయరంజకమైన జానపద దృశ్యకళ ఇప్పుడిప్పుడు డప్పు

మోతలకు తోడు ఇంగ్లీషు బాండుమేళం, డోలు, సన్నాయి, మద్దెల వంటి వాయిద్యాలు కూడా వాడబడుతున్నాయి ఈ బుట్టబొమ్మల జట్టులో కనీసం పదిమందైనా ఉంటారు అందులో సగంమంది బొమ్మల్లో దూరి విన్యాసాలు నెరపగా మిగిలిన సగం వాద్యసహకారం నెరిపే వాళ్ళుగా ఉంటారు అందులో ఒకరు జట్టు నాయకుడూ, మరొకరు జట్టుకు గురుప్రాయుడు అయి ఉంటారు ఈ ఆటల్లో సాహిత్యం ఉండదు కేవలం వాద్యజనిత శబ్దాలు మాత్రమే ఈ ఆటకు ఆదారాలుగా ఉంటాయి పశ్చిమ గోదావరిజిల్లాకు చెందిన తణుకులో కట్టా ఎల్లయ్య అతని కొడుకు సూర్యనారాయణ బుట్ట బొమ్మల నాడించ డంలో సిద్ధహస్తులు ఈ బుట్టబొమ్మలాట కర్ణాటక రాష్ట్రంలో కూడా వినుతి కెక్కిన ప్రదర్శన కళ

**వీరనాట్యం** . దీనికి వీరబద్ర నాట్యమని మరోపేరు ఉంది వీరశైవ మతం ఆంద్రదేశంలో మిక్కిలి ప్రచారంలో ఉన్నప్పుడు శివాలయాలలోనూ, వీరబ ద్రాలయాలలోనూ ఈ నాట్యం ఆడడం మొదలయింది అదే యీనాడు వీర నాట్యంగా ప్రదర్శింపబడుతూ ఉంది దక్షాద్వర ద్వంసం చేసిన వీర బద్రుడే ఈ నాట్యాన్ని ప్రారంబించిన ఆద్యుడని చెప్తారు ఒక చేతిలో కత్తినీ మరో చేతిలో డాలునూ దరించి, వీరణమనే పెద్ద డప్పువంటి చర్మవాద్యం మ్రోగుతుండగా బక్తులు ఈ నాట్యాన్ని చేస్తారు ఆ వీరణపు మోత గుండెల్ని అదరగొట్టేంత బయంకరంగా కర్ణబేదిగా ఉంటుంది ఇది యుద్ధబేరీ నాదాన్నీ, తప్పెట మోతల్నీ పోలి ఉంటుంది వీరనాట్యం పరమశివుని విలయ నృత్యాన్ని పోలి ఉంటుంది ఈ వీరణానికి సహాయకాలుగా డోలు, తాషామరపా, సన్నాయిలు కూడా మ్రోగింపబడతాయి శివరాత్రి పుణ్యదినాన, లింగోద్బవ సమయాన బక్తులు ఈ వీరనాట్యం చేస్తారు పైకి ఎగురుతూ వీరు చేసే ఊర్ద్వతాండవం అందరినీ ఆకర్షించే నృత్యకళ

వీరముష్టులు, జంగాలు, బలిజలు, దేవాంగులు, ఈ నాట్యాన్ని చేస్తారు వీరంతా వీరశైవ మతానుయాయులు తెలంగాణాలోని కొరవి, కొత్తకొండ లలో నెలకొన్న వీరబద్రాలయాలలో ఈ నాట్యం నెరపబడుతుంది వీరు వీర బద్రదేవరకు పళ్ళేరాన్ని కొనసాగిస్తారు

నూనెతో వెలిగించిన జ్యోతులనుగానీ, వెలిగించిన కర్పూరాన్నిగాని

పళ్ళెరాల్లో ఉంచి, వాటిని అరచేతుల్లో నిలుపుకుని దేవుడికి హారతెత్తుతు న్నట్లు తిప్పుతూ అర్పిస్తారు ఆ సమయంలో నాట్యకారులు ఖడ్గాలు అనే పేరు గలిగిన పద్యాలను వల్లిస్తుంటారు ఇలా వల్లించడాన్ని ఖడ్గాలు విసర డమని పిలుస్తారు వీటిలోని కదాంశం దక్షాద్వర ధ్వంసానికి సంబందించినది నాట్యకారులు కత్తులనేకాక, ఇటీవల మొనలకు దూది చుట్టి వెలిగించిన త్రిశూలాలను కూడా దరిస్తున్నారు

చేతుల్ని మార్చి – మార్చి, కాళ్ళనూ ఊర్ధ్వముఖంగా సాగిస్తూ ఊహిం చలేని వేగంతో బయం కొలిపే విదంగా చేసే నాట్యమిది బక్తులు, ఆత్మ హింసా పద్ధతికిలోనై, నాలుకలను, బుగ్గలను, కంటి రెప్పలను, కంఠాన్ని, పెదిమెలను, వాడియైన సూదులతో, ఈ చివర నుండి ఆ చివరకు దూసు కుపోయే విదంగా గుచ్చుకుంటారు ఈ సూదులను ఏకనారసము, కంటినా రసము, శిరోనారసము అని పిలుస్తారు నాట్యశాస్త్ర ప్రవీణులైన వారు ఈ వీరనాట్యంలో 108 కరణాలు, చరబేదాలూ ఉన్నాయని చెప్తారు ఇవన్నీ శివ తాండవంలో ఉన్న అంశాలు ఆంధ్రుల వీరనాట్యాన్ని తిరువాన్కూరులోని 'పటయం' నాట్యానికి కొన్ని పోలికలున్నట్లుగా తోస్తుంది

తూర్పుగోదావరి జిల్లాకు చెందిన చింతా వెంకటేశ్వర్లు జట్టు దీన్ని జనరంజకమైన జానపద దృశ్యకళగా తీర్చిదిద్ది ప్రదర్శనలిస్తూంటుంది

**కోలాటం**· కోలు అంటే సన్నకర్ర - కర్రలు తాటిస్తూ ఆడే ఆట కనుక దీన్ని కోలాట, కోలాటం అని పిలుస్తారు మొత్తం బారతదేశమంతా ఈ కోలాటం కనిపిస్తుంది దీన్నే సంస్కృతంలో దండలాసికం అని పిలుస్తారు మహబలి పురం, ద్రాక్షారామం, మాచర్ల, రామప్ప, శ్రీశైలం, హంపీ, తాడిపత్రి వంటి అనేక స్థలాలలోని దేవాలయ కుడ్యచిత్రాలలో ఈ కోలాటం కనిపిస్తుంది ఆడా మగా ఈ కోలాటం ఆడుతూ కనిపించే శిల్పాలు మనకు కోకొల్లలుగా ఉన్నాయి ఆడ గుంపు వేరుగా మగ గుంపు వేరుగా ఆడే చిత్రాలూ మనకు ఉన్నాయి ప్రాచీనకాలంలో స్త్రీలు బగవత్ప్రీత్యర్థం దేవుని ముందు, ఆల యాలలో దీన్ని ఆడేవారు కేవలం మగవాళ్ళు ఆడే ఈ ఆట జానపదకళా రూపమని చెప్పవచ్చు

ఒక్కొక్క కోలాటపు జట్టులో 20 నుండి 40 మంది వరకూ ఆటగా

ళ్ళుంటారు అతి చిన్నజట్టులో ఎనిమిది మంది ఉండవచ్చు అంతకు తక్కువ మందితో ఆడడం రక్తికట్టదు ప్రతిజట్టుకూ ఒక నాయకుడుంటాడు జట్టులోని వారు సరిసంఖ్యలోనే ఉండాలి జట్టు నాయకుణ్ణి పెన్నుద్ది అనీ, కోలన్న పంతులనీ, గురువనీ పిలుస్తారు అతడే జట్టును క్రమపద్ధతిలో నడిపేవాడు ఇద్దరు ఆటగాళ్ళ జతను 'ఉద్ది' అని పిలుస్తారు అందులో ఒకరు రాముడైతే రెండవ వాడు లక్ష్మణుడు అందరు ఆటగాళ్ళూ మొదట పెద్ద వలయంగా ఏర్పడతారు తర్వాత గతిక్రమంలో వాళ్ళే ఒకదానిలో మరొకటి ఇమిడేటట్లు రెండు వలయాలుగా తయారవుతారు నాయకుడు వేణువు, మృదంగం, హార్మ ణీ, తాళాలు వాయించే వారితో కూడి, చిన్న వలయం మధ్యలో కుదురు కుంటాడు ప్రతివ్యక్తి చేతుల్లోనూ రెండు కోలలుంటాయి ఆ కోలలు రంగు దారాలతో గానీ, గంటలతో గానీ అలంకరింపబడి ఉంటాయి ఆటగాళ్ళం దరూ కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు సైకిలు పంచకట్టుతో, నడుముకు చుట్టిన పటకాలతో వాళ్ళ వేషదారణ చక్కగా ఉంటుంది నాయకుడి నుండి అనుజ్ఞ రాగానే వలయాలలో ఉన్న ఆటగాళ్ళు కదలడం ఆరంబిస్తారు వాళ్ళ ఆట గణేశ్వర ప్రార్ధనతో ప్రారంబమౌతుంది జట్టు నాయకుడు 'కిటతయ్యకు' అనిగానీ, 'కిటకిట తయ్యకు' అనిగానీ ఊపందుకుని పాటపాడడం మొదలు పెడ్తాడు దీన్ని ఎత్తుగడ అని పిలుస్తారు ఇందులో పాడేపాటలు వివిద గతి బేదాలతో, లయవిన్యాసంతో కూడి ఉంటాయి ఈ పాటల్లో శృంగారం, బక్తి, కరుణ, వీర రసాలకు ప్రాదాన్యం ఉంటుంది ప్రార్ధనలు, యుగళ గీతాలు, వర్ణనాత్మక గేయాలు, కదాగీతాలు ఇందులో చోటు చేసుకుంటాయి ఆట గాళ్ళు వేసే అడుగులకు అనుగుణంగా పాటలోని లయ, చందం సాగుతుం టాయి అడుగులకు సంబందించిన గతి బేదాలను కోపులు అని పిలుస్తారు ఈ కోపుల్లో 50 వరకూ బేదాలున్నాయి కాని ప్రతి జట్టూ 6 నుండి 12 వరకు కోపుల్ని చేర్చుకుని ఉండాలి జట్టు నాయకుడు ఒక పాదాన్ని అందుకోగానే, ఆటగాళ్ళు రెండవ పాదాన్ని, చేతుల్లోని కర్రలను తాడిస్తూ పాడడం మొదలు పెడతారు అట్లా పాడేటప్పుడు వలయంలో నుండి ముందుకూ వెనక్కూ కదులుతూ యదాస్థానానికి వస్తూ ఉంటారు నాయకుడు ఈలవేసి, పాట పాడే దోరణిలో వేగం పెంచుతాడు ఆ వేగం వలన ఆటగాళ్ళ అడుగులు

పడడంలోనూ వేగం పెరుగుతుంది దీన్ని 'ఉసి' అంటారు నాయకుడు అట్లా వాళ్ళను ఆడనిచ్చి 'కిట తయ్యకు తద్దిమి' అనగానే అందరూ అడుగులు కదపడం ఆపి స్థిరంగా నిలుచుండిపోతారు దీన్నే ముక్తాయింపు అంటారు తర్వాత నాయకుడు మరో కోపందుకోగానే గతి బేధంతో తిరిగే ఆట కొనసాగుతుంటుంది

కోలాటంలో 'జడకోలాటమని' మరో బేదం ఉంది దీన్నె వేణి కోలాటమని కూడా పిలుస్తారు ఈ ఆట ఆడే జట్టులో ఆటగాళ్ళు 12, 16, 18 మంది ఉండవచ్చు వాళ్ళ చేతుల్లోని కోలలకు రంగు రంగుల దారాలు ముడివేసి ఉంటాయి ఈ దారాలన్నీ ఎత్తుగా ఒక చెట్టుకొమ్మకు గానీ, దూలానికి గానీ కూర్చబడి ఉంటాయి ఆటగాళ్ళు వలయాకారంలో ఉండి గతి బేదాలతో అడుగులు కదుపుతూ గుండ్రంగా తిరిగినప్పుడు వాళ్ళ కోలలకు కట్టిన తాళ్ళు జడలాగా అల్లుకుంటుంటాయి వాళ్ళు తిరిగే వ్యతిరేక గతిలో అడుగులు కదిపినప్పుడే అల్లుకున్న జడ, ఒక క్రమపద్ధతిలో విప్పుకుంటూ చివరకు ఏ దారానికాదారం ప్రత్యేకంగా మిగులుతుంది ఆటగాళ్ళలో ఎవరు తప్పటడుగు వేసినా జడకోలాటం రక్తి కట్టదు దీనికి చాలా చాతుర్యం అవసరం

అక్కర సమయాల్లో ఈ ప్రదర్శన ప్రేక్షకుల్ని ఎంతగానో అలరిస్తుంది ఆడపిల్లలీఆట ఆడుతున్నప్పుడు చూడముచ్చటగా ఉంటుంది జాతరల్లోనూ, సంబరాల్లోనూ, వెన్నెలరాత్రుళ్ళలో ఈ ఆట మొత్తం దేశమంతటా ఆడబడే జానపద క్రీడ

**చిరతల భజన** గతిబేదాలలో, లయ విన్యాసంలో కోలాటానికీ చిరతల బజనకూ దగ్గరి పోలికలున్నాయి ఆటగాళ్ళ చేతుల్లో కోలలకు బదులు చిరతలుండడం ఈ ఆటలో ప్రత్యేకత జట్టు, గరిడి, ఉద్ది, కోపు, ఎత్తుగడ, ముక్తాయింపు ఉసి వంటి వన్నీ రెండింటికీ సమానమే చిరతల్ని చెక్కతో చేస్తారు అందుకే ఈ ప్రక్రియను చెక్కబజన అని కూడా పిలుస్తారు చిరతలు $1^1/_2$ అడుగుల పొడవు ఉంటాయి వీటికి పక్కలన చెక్కదొలిచి రేకు ముక్కల్ని పొదవడంవల్ల, విచిత్రమైన శబ్దం ఉత్పన్నమౌతుంది ఒక్కో చిరతకూ, పై బాగాన ఒక గుండ్రని లోహపు ఉంగరం తాపడమై ఉంటుంది చిరతల్ని

ఆడించే వ్యక్తి కింది చెక్కకు సంబందించి ఉంగరంలో బొటనవేలునూ, పై చెక్క మీది ఉంగరంలో చూపుడువేలునూ దూర్చి రెండింటినీ బెసికి పోకుండా పట్టుకుని ఒకదానికొకటి తాటిస్తుంటాడు అప్పుడు పుట్టిన శబ్దానికి అనుగుణంగా అడుగుల కదలిక, పాటలోని లయ, గతిబేదమూ ఏర్పడుతుంటాయి కోలాటంలో రెండు చేతులకూ పని కల్పింపబడగా, చిరతల్లో కేవలం ఒక్క చెయ్యి మాత్రమే ఉపయోగపడుతుంది రెండవ చేతిలో రంగు రంగుల చేతి గుడ్డను ఆటగాళ్ళు దరిస్తారు కోలాటం కోపులు చిన్నదైతే, చిరతల బజన కోపులు పెద్దవిగా ఉంటాయి చిరతల బజనలో రామజననం నుండి పట్టాబిషేక పర్యంతం రామాయణ కద చెప్ప బడుతుంది పురాణాల నుండీ, కావ్యాల నుండీ పెద్ద పెద్ద కదలు ప్రవర్తితాలవుతుంటాయి కాని ఇటీవల, పెద్ద పెద్ద కదలు చెప్పడం తగ్గి, చిన్న కదలకూ, అల్పకాలిక విన్యాసానికీ ప్రాముఖ్యం హెచ్చింది ఇందులో రాగ తాళాలకే కాక, అడుగుల కదలికలకూ గమన సరళికీ ఎంతో ప్రాముఖ్యం ఉంది పాత రోజుల్లో దీపపు సెమ్మెను మద్యలో ఉంచేవారు ఇప్పుడు జట్టునాయకుడుంటున్నాడు

ఇందులో ప్రారంబగతిని ఆది అడుగు అని పిలుస్తారు తరువాత వచ్చే అడుగుల గమన బేదాలను, పోతు అడుగు, జోకు అడుగు, నెమిలి అడుగు, గుర్రపు అడుగు, ఉయ్యాల అడుగు అని పలురకాల పేర్లతో వ్యవహరిస్తుంటారు ఆటగాళ్ళు మెడలలో పూలదండలతో, కళ్ళకు గజ్జెలతో, నడుముకు పటకాలతో, దోవతి కట్టుతో కనిపిస్తారు కరీంనగర్, కడప, దర్మవరం, తెనాలి, బాపట్ల వంటి చోట్లగల భజన బృందాలు మిక్కిలి పేరు మోసిన బృందాలు

**డప్పు నృత్యం.** అనాదిగా డప్పు, చాటింపుకు ఉపయోగపడే సాదనం దీన్నే తప్పెట అని కూడా పిలుస్తారు వేపచెక్కతో చేసిన ఆకారయష్టికి దూడచర్మాన్ని బిగించి దీన్ని తయారుచేస్తారు ఇది వలయాకారంలో 2 అడుగుల వ్యాసం, 3 అంగుళాల వెడల్పా కలిగి ఉంటుంది దీన్ని మోగించడానికి ఒక మాదిరి లావు పుల్ల ఉపయోగపడతాయి ఈ నృత్యాన్ని పెద్యాల్లు కులాల్లోని వారు ఆడతారు 10 నుండి 20 వరకూ గల జట్టు దీనిలో పాల్గొం

టుంది సాధారణంగా రథోత్సవాలలోనూ, జాతరలలోనూ, పెండ్లిండ్లప్పుడూ ఈ ఆటని మనం చూడవచ్చు పులి అడుగు, గుర్రపు అడుగు వంటి అడుగుల విన్యాసం ఈ ఆటల్లో కనిపిస్తాయి పెండ్లిండ్ల సమయాల్లో వీళ్ళు ప్రదర్శించే 'డేగాట' కళ్ళకు పండువుగా కనిపిస్తుంది

శత్రువుల్ని అవమానించ వలసినప్పుడూ, ఎవరి మీదైనా కోపం వచ్చినప్పుడూ డప్పు చేతబూని భయంకరంగా, గుండెలదిరేటట్లు వాయిస్తూ, ఆటగాళ్ళు లెల్లీ పాటలు పాడతారు ఈ పాటలనిండా అశ్లీల పదాలు గుప్పించబడతాయి చేయిదిరిగిన డప్పు వాద్యగాడు, మృదంగ స్వరాన్నీ డోలు శబ్దాన్నీ కూడా తన డప్పుమీద వినిపించగలడు అతి తక్కువ మంద్ర స్వరంతో మొదలై భయాన్ని కలిగించే తారస్థాయికి చేరగలగడం ఈ ఆటగాళ్ళ ప్రత్యేకత ఆ సమయాల్లో డప్పు మోతతోపాటు కదిలే వాళ్ళ అడుగుల కదలిక, లయను పూర్తిగా పాటిస్తూ చూచేవాళ్ళను ఆకర్షిస్తుంటుంది త్రిస్ర, చతురస్ర, మిశ్ర, ఖండగతులే కాక సంకీర్ణ జతుల్ని కూడా ఈ ఆటగాళ్ళు ప్రదర్శించగలరు వీళ్ళు కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు శరీరాన్ని ఎంతో లఘువుగా మార్చి, సునాయాసంగా గాలిలోకి లేపి గంతులు వేస్తుంటారు ఒక డప్పును నేల మీద ఉంచగా ప్రేక్షకులు దాని మీద నాణేలను ఉంచుతారు ఆటగాళ్ళు ఆ డప్పుచుట్టూ తిరుగుతూ తమ డప్పుల్ని మోగిస్తూ అడుగులు వేయగా, ఆ ప్రకంపనాలకు డప్పుమీది నాణేలు కదిలి కిందికి జారి పడతాయి ఈ చాకచక్యంతో కూడిన చర్య చూడడానికి ఎంతో బాగుంటుంది

కృష్ణాజిల్లాకు చెందిన కనుమూరు అమృతయ్య, ఉంగుటూరు ఏసుదాసు ఈ ఆటను ప్రదర్శించడంలో సిద్ధహస్తులు డప్పు మోతవల్ల వీర, కరుణ, శృంగార, అద్భుత రసాలను వీళ్ళు శ్రోతలలో కలిగించగల సమర్థులు ఆంధ్రప్రదేశ్‌కు చెందిన అన్ని జిల్లాలలోనూ ఈ ఆటగాళ్ళున్నారు

**పులివేషం** పులి వేషాలను దసరా, మొహరం పండుగల సందర్భంగా వేస్తారు మొలకు చిన్న లంగోటా మాత్రం కట్టుకుని మొత్తం శరీరాన్ని అనాచ్ఛాదితంగా ఉంచుకుంటారు శరీరం మీద పసుపు, నలుపు వార్నీసు రంగులతో పులి చారలను పోలే చారల్ని చిత్రించు కుంటారు వెనుక తోక ఉంటుంది పులి కుండే బలాన్నీ, లాఘవాన్నీ తెలియజేసే విధంగా పెద్ద పెద్ద గంతు

లతో నృత్యం చేస్తారు దీనికి పక్క వాద్యంగా డప్పు వినపడుతుంయుంది డప్పు మోతతో సరిపోయే లయ, వీరి అడుగుల కదలికలో కనిపిస్తుంది కొన్ని చోట్ల, పులివేషగాడి పొడవైన తోకను మరొకడు ఎత్తి పట్టుకుని అతని వెనక తానూ కదం తొక్కుతుంటాడు పులి వేషగాడు, ఎన్నో విన్యాసాలు చేస్తాడు తన పళ్ళతో పెద్ద పెద్ద నీటి బిందెల్ని ఎత్తుతాడు జంతువుల్ని చీల్చి చెండాడంలో పులికుండే అమేయ బలాన్ని ఈ విన్యాసాలన్నీ చూపిస్తాయి

**గొబ్బి నృత్యం** . కోస్తా ప్రాంతంలో ఈ నృత్యం, సంక్రాంతి పండుగ సందర్భంలో ఆచారాత్మక నృత్యంగా చేస్తారు ఇంటి ముందు కళ్ళాపి చల్లి పెద్ద పెద్ద ముగ్గులు వేస్తారు ఈ ముగ్గులన్నీ సాదారణంగా గీతలముగ్గులుగా ఉంటాయి ఆవుపేడతో గొబ్బిళ్ళుచేసి, పసుపు కుంకుమ పువ్వులతో అలంకరించి, పూజించి, తరువాత గొబ్బెమ్మలను ఇంటి ముంగిట ముగ్గుల్లో అందంగా పేర్చుతారు సాయంత్రం సమయాల్లో చక్కగా అలంకరించుకుని గొబ్బెమ్మను పీటమీద నిలిపి చుట్టూ చప్పట్లు చరుస్తూ, పాటలు పాడుతూ తిరుగుతారు ఆ గొబ్బెమ్మను సందె గొబ్బెమ్మ అనీ, అలా ఆడడాన్ని గొబ్బి తట్టడం అనీ అంటారు ఈ నృత్య విశేషంలో, ఆలంకారికులు వివరించిన గర్భనృత్య లక్షణాలు కనిపిస్తుంటాయి

**గుఱ్ఱాల ఆట** . ఈ ఆటకు గుంటూరు జిల్లా ప్రసిద్ధి వహించింది నిజానికిది గుఱ్ఱపు తొడుగు బొమ్మలాట పేడ, ఊక, తవుడు, రంగులు కలిపి నిజమైన గుఱ్ఱాల వలె కనపడేటట్లు అదే ఎత్తు, లావు, పొడవు కలిగిన గుఱ్ఱపు బొమ్మల్ని తయారు చేస్తారు ఇవి మధ్యలో డొలుగా ఉండి మనిషి ఆ బొమ్మలో దూరి ఆడడానికి వీలుగా ఉండే తొడుగుల్లా ఉంటాయి ఆటగాడు అందులో దూరి, నడుము బాగం వరకూ కిందివైపు బయటికి కనపడేటట్లు దాన్ని అమర్చుకుంటాడు అప్పుడు ఒక వ్యక్తి గుర్రాన్ని ఎక్కి సవారి చేస్తున్నట్లుంటుంది రకరకాల విన్యాసాలతో, ఆటగాళ్ళు గుంపులు గుంపులుగా నాట్యం చేస్తారు శృంగారం, వీరం వంటి రసాలు ప్రదానంగా కొన్ని ఇతి వృత్తాలతో ఆటగాళ్ళ విన్యాసాలు చూపడం ఈ ఆటలో కనిపిస్తుంది ఇటువంటి గుఱ్ఱపు బొమ్మలాటలే కాక, గుఱ్ఱాలను తరిపీదుచేసి, వాటి చేత డప్పు వాద్యానికి

అనుగుణంగా కదను తొక్కిస్తూ రకరకాల విన్యాసాలను ప్రదర్శించే కళ కూడా ఈ జిల్లాలో ఎక్కువగా కనిపిస్తుంది పెళ్ళిళ్ళలో, ఉత్సవ సమయాల్లో ఈ గుఱ్ఱాల ఆట ప్రదర్శింపబడుతూ ఉంటుంది

**కరువు నృత్యం** ఇది ఉత్తరదేశంలో నాట్యశాస్త్రకారులు వివరించిన రాసలీల నృత్యంతో పోలికలు కలిగి ఉంటుంది అక్కడ దాన్ని కర్షణి అనే పేరుతో పిలుస్తారు ఎనిమిది మంది కృష్ణ వేషాలతోనూ, మరో ఎనిమిది మంది గోపికా వేషాలతోనూ వలయాకారంగా చేరి ఈ నృత్యం చేస్తారు మద్యలో మరో యిద్దరు రాదాకృష్ణ వేషాలతో నిలిచి ఉంటారు 'చతురస్ర', 'త్రిస్ర' మరియు 'మిశ్ర' గతులతో, నృత్యం చేసేవారి పాద చాలనం, లయకనుగుణంగా సాగుతుంది తూర్పు గోదావరి జిల్లాలో ఈ నృత్య విశేషంగా కనిపిస్తుంది

ఆంధ్రప్రదేశ్‌లో కూచిపూడి, బామాకలాపాలు, శాస్త్రీయ కళలుగా రూపు చెందాయి ఆలయ నృత్యాలు, ఆస్థాన నృత్యాలు ఎన్నో వైవిద్యాలతో ఇవి రాష్ట్రంలో కనిపిస్తాయి

# 8
# జానపద కళలు-వినోదాత్మకత

ఆంధ్రప్రదేశ్‌లోని కళలను గురించి చెప్పాలంటే మనం గత కాలంలోనికి సుదూరంగా పయనించ వలసి ఉంటుంది ప్రాక్చారిత్రక కాలానికి సంబం దించిన కళాస్వరూపం, ఆంధ్రప్రదేశ్‌లో వివిద ప్రాంతాలలోని గుహలలో, రేఖాచిత్రాలుగా దర్శన మిస్తుంటుంది ప్రాచీన కాలానికి చెందిన శిల్పాలు, మతానికీ సాహిత్యానికి సంబందించిన లిఖితపూర్వక విషయాలూ, వివిద వర్ణ సమ్మిళితాలయిన చిత్రాలూ, రేఖాకృతులూ,గ్రామీణ సంస్కృతిని నింపు కున్న కళా రూపాలుగా ఈనాటికీ మనకు దర్శన మిస్తుంటాయి గ్రామాల లోని జానపద స్త్రీలు, వ్రత సందర్భాలలోనూ, పండుగలూ వేడుకలూ జరు పుకునేటప్పుడూ, తమ యిండ్ల లోపలా, బయటా, రకరకాల రంగుల బొమ్మ లనూ ముగ్గులనూ, ఎంతో నైపుణ్యంతో తీర్చడం కనిపిస్తుంది ఐరేణి కుండల్ని పూజించడానికి వదూవరులు కూర్చున్న గది గోడలూ, దేవుడి పటమో, బొమ్మో ఉంచి పూజించే 'అర' లోని గోడలూ, స్వస్తిక గుర్తులతో రమ్యంగా, కళాత్మకంగా అలంకరింప బడతాయి అంతేకాక, పద్మాలు, నెమళ్ళు, హంసలు, చిలుకల వంటి రమణీయాకృతులూ, ఏనుగులు మొసళ్ళు వంటి జంతువుల ఆకారాలూ, చిత్రింపబడతాయి

మహాకాళి, శక్తి వంటి మాతృ దేవతాలయాల గోడలు, మహిషాసుర మర్దన పట్టాలతో తీర్చబడతాయి అంతేకాక పౌరాణిక గాదలూ, పురా కదలూ ఈ గోడల మీద అందంగా చిత్రింపబడి ఉండడం మనం చూడ వచ్చును ఈ రంగులతో బొమ్మలు వేసే పనిని ప్రత్యేకంగా కొన్ని కులాల వారు నిర్వ హించడం కూడా కనిపిస్తుంది ప్రాచీన కాలంలో, కుండలపైన చెదరని రంగులతో 'పూజు'లు గీయడం, వేయడం, మట్టితో బొమ్మలు చేసి కాల్చి గట్టిదనాన్ని కల్పించి రంగులు వేయడం, ఉండేవనడానికి, అమరావతి, నాగా

ర్జున కొండ మొదలైన చోట్ల జరిగిన త్రవ్వకాలలో, అటువంటి వస్తువులు కని పించడాన్ని కారణంగా చూపించవచ్చు ఈ కళాఖండాలన్నీ రకరకాల వస్తు ప్రదర్శనశాలల్లో నేడు బద్రం చేయబడి ఉన్నాయి ఈ వస్తువులు ఆంధ్ర దేశంలోని గ్రామీణుల సాంఘిక జీవితాన్ని వెల్లడించడమే కాక దానికి సరి యైన వ్యాఖ్యానాన్ని కూడా చేస్తాయి

సంస్కృతంలో రంగవల్లి, బెంగాలీ బాషల్లో అల్పన, గుజరాతీలో రంగోలీ, తెలుగులో ముగ్గు అనబడే కళాత్మక మూర్తిని ప్రతి గ్రామీణ బాలికా చక్కగా అబ్యసించి ఉంటుంది వాకిళ్ళకి ముందు కలయంపి చల్లి తీరు తీరులుగా ముగ్గులతో అలంకరించడం, గ్రామీణ స్త్రీలు ప్రతి రోజూ విదిగా నిర్వహించే పని ఈ ముగ్గులు వెయ్యడానికి, ఘున్నపు పొడినీ, సుద్దనూ, బియ్యపు పిండినీ వాడతారు వాటిలో రకరకాల రంగుల పొడిని కూడా కలిపి చిత్ర విచిత్ర వర్ణాలతో ముగ్గులను అందంగా తీర్చి దిద్దుతారు ముగ్గు వెయ్యని వాకిలి అశుబానికి చిహ్నం ఈ ముగ్గులు వెయ్యడం వేదకాలం నాటినుంచీ ఉన్నట్లుగా పండితుల అబిప్రాయం ఈ విద్యలో పాండిత్యాన్ని సంపాదిం చడం పెండ్లి కుమార్తె విదిగా కలిగి ఉండ వలసిన లక్షణాలలో ఒకటి సంక్రాంతి దినాలలో, వివాహ సమయాలలో ఇతరాలైన పండుగలు జరుపుకునేటప్పుడు, రకరకాలుగా తీర్చిన ముగ్గులు నేత్ర పర్వంగా దర్శన మిస్తాయి కోణాలు, వలయాలు, చతురస్రాకారాలు మాత్రమే కాక, పువ్వులు, లతలు, గుడులు, రదాలు, నెమళ్ళు, చిలుకలు, సూర్యుడు, చంద్రుడు వంటి ఎన్నో ప్రకృతి వస్తువులు ఈ ముగ్గుల్లో రూపు కట్టడం చూడవచ్చు ఇవేకాక, లక్ష్మి, పార్వతి, నందికేశ్వరుడు, నాగ మూర్తులు, ఇంకా ఎన్నో తాంత్రికతను సూచించే సంకేతాలు, వర్ణాల కలయికలోనూ, ఆకారంలోని నిర్దుష్ట రేఖా సంకలనంలోనూ, అగ్రగణ్యాలై, మనోహర కళాఖండా లుగా కంటి కింపును కలిగిస్తాయి పక్కన కనిపించే యీ జానపద చిత్రం చూడండి ఇది ముండకోపనిషత్తులోని ఒక సూక్తానికి చిత్రానువాదమని చెప్పవచ్చు

ద్వాసుపర్ణా సయుజా సఖాయ
సమానమే వృక్షమ్ పరిషస్వజతే

తయో రన్యాః పిప్పలకు స్వాద్వత్త్యానశ్నన్
అన్యో అబిచకాసితి

(ముండకోపనిషత్, 111-1-1)

(రెండు పిట్టలు, వేరు చేయడానికి వీలు లేని విదంగా ఒకే వృక్షాన్ని ఆశ్రయించుకుని ఉన్నాయి అందులో ఒకటి తియ్యని పండ్లను తింటూ ఉంటే మరొకటి, తినకుండా ఊరికే కూర్చుంది)



ఆంధ్రదేశంలో శరీరం మీద పచ్చ పొడిపించు కోవడం కనిపిస్తుంది పచ్చ పొడవడ మనేది ఒక జాన పద కళ ఆటవిక జాతులు, పార్వతేయులు, స్త్రీలు తమ శరీరాల మీద పచ్చ పొడిపించు కుంటారు ఇది సౌందర్య ప్రకటన చేసే అలంకారంగా గ్రామీణుల చేత గుర్తింపబడుతున్నది బుగ్గమీద కాని, గడ్డం కొసన కానీ చిన్న చుక్కనో, పువ్వునో పొడిపించుకుంటారు చేతి మీద ప్రియుడి పేరును, తమ పేరును వ్రాయించుకుంటారు ఒక జానపద గేయంలో ఒక పడుచు పిల్ల, తనకు రాముని బాణాలను, సీతమ్మ అడుగులను పచ్చ పొడిపించమని ప్రియుడ్ని కోరుకుంటుంది శరీరం కండలు తిరిగిన వస్తాదులు, ముంజేతుల మీద, తొడల మీద, గుండె మీదా రకరకాల

బొమ్మల్ని పచ్చ పొడిపించుకుంటారు సింహాలు, డేగలు, పాములు, హను మంతుడు, కత్తులు, పద్మాలు, మొదలైనవెన్నో పచ్చ బొట్ల వారు పొడిచే సుందరమైన ఆకారాలు పచ్చ పొడిచే వృత్తి చేసేవారిని పచ్చ బొట్ల వారని పిలిచేవారు నాగర సంస్కృతి వ్యాపిస్తున్న కొద్దీ ఈ కళ మెల్లిగా నశించి పోతున్నది ప్రస్తుతం గ్రామీణుల్లో చేతుల మీద పేర్లు పొడిపించుకోవడ మొక్కటే కనిపిస్తుంది

ముఖానికి రకరకాల తొడుగులు చేసి జానపద దృశ్య కళలో వినియో గించడం మరొక జానపద కళ పెద్దమ్మల వాడు ముఖానికి వేసుకునే ముసుగు రంగు రంగులుగా ఉండి భయాన్ని కొలుపుతుంటుంది రకరకాల దేవుళ్ళ ముఖాలు, పక్షులు, జంతువులు ముఖాలు, తీర్చిదిద్దబడి మనోహర మైన రంగులతో అలంకరించబడి తయారవుతాయి సాగరాంధ్రంలో ఈ తొడు గులు తయారు చేసే పనిని వృత్తిగా గ్రహించి ఎన్నో కుటుంబాలు బ్రతుకు తుంటాయి

అదే విధంగా అద్దకపు పని కూడా ఎన్నదగిన జానపద కళ దీన్నే కలంకారీ పని అని కూడా అంటారు మచిలీపట్నం ఈ కళలకు ప్రసిద్ధి వహించిన స్థానం అక్కడ అద్దకం చేయబడిన వస్త్రాలకు, ప్రాచీన కాలంలో కూడా దేశ విదేశాలలో మంచి గిరాకీ ఉండేది ఈ రంగులద్దే వారు 'రంగ రీజు' వారు అని పిలువబడేవారు కాగితం మీద రకరకాల నమూనాలు గీచి, వాటిని చెక్క దిమ్మల మీద చెక్కుతారు దేశ్యంగా, లభించే రంగులతో ఆ నమూనాలను వస్త్రాల మీద అద్దుతారు ఈ నాటికీ ఈ కళ బాగా వ్యాప్తిలో ఉన్నది

ఆంధ్రదేశం పాలిట కల్పవృక్షం తాటి చెట్టు ఈ చెట్టుకు సంబంధిం చిన అన్ని బాగాలూ జన జీవితంలో ఉపయోగ పడేవే కాగితం వాడుక లేని కాలంలో, ప్రాచీనులు తాటి ఆకుల మీద వ్రాసేవారు ఈ చెట్టు ఉత్తర హిందూ స్థానంలో లేని కారణాన, అక్కడ వీటికి ప్రతిగా భూర్జ పత్రాలు వాడుకలో ఉండేవి తాటి ఆకుల్ని ఇళ్ళు కప్పుకోవడానికి ఉపయోగిస్తారు ఒకప్పుడు ఈ ఆకును అందంగా చిన్న చుట్టగా చుట్టి చెవి కమ్మలుగా ఆడవాళ్ళు ధరిం చేవారు ఈనాడు, గొడుగులు, బుట్టలు, బొమ్మలు, బొమ్మపెట్టెలు, విసన

క్రలు, చాపలు, మొదలైన ఎన్నో వస్తువులు ఈ ఆకులతో తయారు చేస్తు న్నారు తాటి నారతో బుట్టలు, నగల పెట్టెలు బొట్టు పెట్టెలు, మొదలైనవి తయారు చేస్తారు ఈనాడు కొంత వరకూ నైలాన్ ప్లాస్టిక్ తయారీలు, పరిశ్ర మలు వెనుకబడడానికి కారణమవుతున్నాయి

పెళ్లి కెదిగిన ఆడపడుచులు, ఆంధ్రదేశంలో, అల్లిక, కుట్టు పనులు తప్పక నేర్చుకుని ఉండాలి పువ్వులు, రకరకాల పక్షులు, జంతువులు, కుట్లలో అందంగా తీర్చి దిద్దడం, అమ్మాయిలు తమ నాజూకైన వేళ్ళతో చేసే పని దిండు గలేబులు, దుప్పట్లు, గుమ్మాలకు కట్టే తెరలు, రవికలు, మొదలైన వస్త్రాలను నాజూకు కుట్టు పనితో, వాళ్ళు అందంగా తయారు చేస్తారు కుట్టుపనితో పాటు అద్దాలు తాపడం కూడా ఒక కళే ఈ అద్దపు పనిని, చక్కని లతలుగా, మంచి నమూనాలుగా, రంగు రంగుల దారాలతో తీర్చి దిద్దుతారు వీటికి చిన్న చిన్న పూసల్ని జోడించడం కూడా కద్దు

రాజవంశం వారు, పూసల బదులు ముత్యాలనూ విలువైన రాళ్ళనూ కూర్చుకుని, మామూలు దారం బదులు, బంగారు (జరీ) దారాన్ని వాడి, ఈ కళకు, గొప్పతనాన్ని, అమూల్యతనూ, ఆపాదించారు ఇటువంటి కుట్టుపని అటు గ్రామాలలోనూ, ఇటు నగరాలలోనూ ఈనాటికీ సమానంగా ఆదరింప బడుతున్న కళ

బొమ్మలు చేయడం కూడా పేర్కొనదగిన జానపద కళ వెనుకటి కాలంలో ఇంచుమించు ప్రతి యింటికి ఒక బొమ్మరిల్లు ఉండేది అందులో చిన్న పిల్లలు బొమ్మలు చేర్చి ఆడుకుంటుండేవారు బొమ్మలకు పెళ్ళిళ్ళు చేసి, తోటివారికి విందులు పెట్టి వినోదించడం వాళ్ళ ఆటల్లో ఒక బాగం వంటలు చెయ్యడం, వడ్డించడం వంటివన్నీ బవిష్యత్తులో వాళ్ళకు ఒక రక మైన తరిఫీదు ఇవ్వడం వంటిది దసరా, దీపావళి, సంక్రాంతి పర్వ సమ యాలో తెలుగువారి ఇండ్లలో బొమ్మల కొలువు పెట్టే ఆచారం ఉంది ఒక ప్పుడు పురాణ కదల్ని, బొమ్మలు పేర్చడంలో, రూపు కట్టించేవారు ఇప్పుడు ఆదునిక కాలానికి అనుగుణంగా, దేశ నాయకులకూ, జాతీయ జీవనానికీ సంబందించిన కదల్ని బొమ్మల ద్వారా ప్రకటిస్తున్నారు

ఈ బొమ్మలు రకరకాల వస్తువులతో తయారు చేస్తారు సాగర తీరాలూ,

నదీ పరివాహక ప్రదేశాలూ, గవ్వల్నీ, నత్త గుల్లల్నీ, ఆలి చిప్పల్నీ ఇతర జల సంపదను కలిగి ఉంటాయి ఇవన్నీ బొమ్మల తయారీలో పనికి వచ్చేవే అట్లాగే విస్తారంగా కొబ్బరిచెట్లు పెరిగే తీరాంధ్రంలో, కొబ్బరి పెంకులు విరివిగా లభిస్తాయి ఇవి కూడా బొమ్మలు చేయడానికి ఉపయోగ పడేవే ఊరి వడ్రంగి ఎటువంటి చెక్కతోనైనా బొమ్మలు చేయగలడు చిత్తూరు జిల్లాలో రక్త చందనపు కట్టెతో ఎక్కువగా బొమ్మలు చేస్తారు ఈ బొమ్మల్నీ, వివిధాలైన కర్ర పాత్రల్నీ మనం తిరుపతి బజారుల్లో అనేకం చూడవచ్చు అందులో ఎక్కువగా మనసును ఆకట్టుకునేవి, శ్రీ వెంకటేశ్వర పద్మావతీ విగ్రహాలు తిరుపతి, కాళహస్తి యాత్రకు వెళ్ళిన సందర్భంలో పిల్లలు ఈ బొమ్మల్ని కొనకుండా తిరిగిరారు పప్పు, అన్నం వండుకునే గృహ సామగ్రి గల లక్క పిడతల పెట్టెలను అందరూ కొనుక్కుంటారు శ్రీకాకుళం, విశాఖ జిల్లాలు అడవులతో నిండినవి అక్కడ దున్నపోతు కొమ్ముతో తయారు చేసే బొమ్మలు, మంచి పనితనంతో దొరుకుతాయి దీపస్తంబాలూ, పూల కుండీలు, సిగరెట్టు నుసి రాల్చుకునే పాత్రలు, పొడం కాయలు, కొంగలు, తేళ్ళు, ఏనుగులు, దువ్వెనలు మొదలైన వెన్నిటినో ఈ కొమ్ముతో తయారు చేస్తారు

ఆంధ్రదేశంలో కొండపల్లి బొమ్మలకు ప్రసిద్ధి వహించిన స్థలం కొండపల్లి కృష్ణాజిల్లాలోని ఒక ఊరు నక్కాసి, ముచ్చి, జనిగర, చిత్తారి అనే పేర్లు గల తెగల వారు ఈ బొమ్మలు చేస్తారు కొండపల్లి పరిసరపు కొండల్లో దొరికే పొణిక కర్రను, బొమ్మలకు వాడుకుంటారు ఈ పొణిక కర్ర చాలా తేలికగా ఉండి మృదువై, మన యిష్టం వచ్చినట్టు చీల్చి చెక్కుకోవడానికి అనువుగా ఉంటుంది చింతపండు, రంపపు పొట్టు కలిపి ఉడకబెట్టి 'లై' వంటి పదార్థాన్ని తయారు చేస్తారు దీని చేత, కర్రనూ కర్రనూ జోడించినప్పుడు కనపడే సందులను మెత్తి చదరం చేస్తారు బొమ్మల ఆకారం చెక్కడం పూర్తి అయిన తరువాత, వాటికి నిమ్మ రసం పూసి, ఆరబెట్టి, ఆపైన వార్నిష్ వేసి రంగులద్దుతారు దేశీయమైన వస్తువుల సహాయంతోనే, ఈ బొమ్మలు చేసేవారు రకరకాల రంగులు తయారు చేసుకుంటారు ఈ రంగులూ, మెరిసే బంగారు రంగు రజనూ, అన్నీ ఉపయోగించి అందమైన వివిదాకృతులుగా ఆ కర్ర బొమ్మల్ని తీర్చి దిద్దుతారు ఏనుగులు, ఏనుగుల

పైన హోదాలు, పల్లకీలు, తాటిచెట్లు, కల్లు గీచేవాళ్ళు, ఉయ్యాల, పద్మం, లక్ష్మి, పార్వతి, సరస్వతి, కర్షకుడు, కార్మికుడు, పోలీసు, బడి పిల్లవాడు, ఆవు, బండి, దశావతార మూర్తులు, రాదా మాదవులు ఒకటేమిటి కొండ పల్లిలో తయారయ్యే ఈ బొమ్మలన్నీ కళాత్మకంగా ఉండి, మనోహరంగా తీర్చిదిద్దబడినవే

## జానపద నాటకాలు

పండితారాద్య చరిత్రలో పాల్కురికి సోమన, జానపద దృశ్య కళలను పేర్కొనడం జరిగింది ఇందులో కొన్ని లుప్తమై పోయినా, కొన్ని యీనాటికీబ్రతికి ఉండడం, విశేషమే ఈ క్రిందివి, తరతరాలుగా, సాంప్రదాయికంగా వస్తున్న జానపద నాటక విశేషాలు

**యక్షగానం** · యక్షగానం రంగస్థల దృశ్యకళ సంగీతం, నృత్యం, నేపద్య రచన, సాహిత్యం వంటి అన్ని అంశాలూ ఇందులో మిళితమై ఉన్నాయి ఈ యక్షగాన ప్రక్రియ కర్నాటక రాష్ట్రంలోనూ ప్రసిద్ధంగా ఉంది పాల్కురికి సోమనాదకవి తన పండితారాద్య చరిత్రలో దీనిని ఉటంకించారు 15, 16 శతాబ్దులలో, తెలుగులో లిఖితరూపంగా తొలి యక్షగానం మనకు లబిస్తున్నది యక్షగానమంటే యక్షులుపాడే పాట అని అర్థం యక్షులు, గందర్వులు, కిన్నెరులు, కింపురుషులు మొదలైన వారంతా మన పురాణ కదనాల ననుసరించి దేవజాతులకు చెందినవారు ఆంధ్రదేశంలో జక్కులు అనబడే ఆటవిక జాతి ఉంది ఈ జక్కుల శబ్దమే సంస్కృతీకరించబడి యక్షశబ్దంగా మారింది జక్కులవారు తొలుత పాడేపాటల్నీ యక్షగానమని వ్యవహరించి ఉంటారు ఈ పాటలు కాలక్రమాన, సంబాషణలతోటీ, పాత్రలతోటీ, రకరకాల గాన వైవిద్యాలతోటీ రూపకాలుగా రూపాంతరం చెందాయి అవే యక్షగానం పేరిట జానపద రూపకాలుగా స్థిరపడ్డాయి జక్కుల జాతివారు ఆంధ్రప్రదేశ్‌లో అనంతపురం, గుంటూరు, కర్నూలు, కృష్ణ, గోదావరి జిల్లాలలో కనిపిస్తారు ఈ జాతి అనాదినుండీ నృత్యానికీ, సంగీతానికీ అంకితమైన జాతి 15వ శతాబ్దికి చెందిన క్రీడాబిరామంలో చర్మవాద్యాన్ని వాయిస్తూ 'కామవల్లి' కదను పాడుతూ, ఆడుతూ వచ్చే జక్కుల పడతి వర్ణింపబడ్డది యక్షగానాలకు

దరువు, రగడ, జంపె, ఏల, శోబనము, దవళము, మంగళారతి వంటి దేశీయాలయిన నడకల నిర్మాణం ఉంటుంది ఒక నడకకూ మరో నడకకూ మద్య వచనం అనుసంధాన క్రియను నిర్వహిస్తుంటుంది ఈ వచనమే తరువాత రూపకాలుగా తయారైన యక్షగానాలలో సంబాషణలుగా మారాయి సంస్కృత నాటిక నిర్మాణపద్ధతి ననుసరించి యీ యక్షగానాలు తరువాత రూపాంతరం చెందాయి దక్షిణాదిన తెలుగు నాయకరాజులు, మరాఠా భోన్స్లేలూ, మధురను పాలించిన తెలుగు రాజులూ, ఈ యక్షగానాలను మిక్కిలి ఉచ్ఛస్థితికి తెచ్చారనవచ్చు నిర్మాణంలోనూ, ప్రదర్శన పద్ధతిలోనూ వీరి ఆస్థానాలలోనే యక్షగానాలకు ఒక కొత్త రూపు సిద్ధించింది కేవలం జానపద స్థితి నుండి యీ దృశ్యకళ నాగరిక రూపాన్నందుకుని జానపద ఆబాసంగా ఇక్కడే పరిణమించింది

రకరకాల గతిబేదాలతో కూడిన పాటలూ, లయ విన్యాసమూ ఈ దృశ్య కళలో అంతర్గతంగా ప్రసారితమయ్యే కదను అనుసరించే ఉంటాయి సంబాషణలు, ఆహ్లాదకరంగా ఉంటాయి కొన్ని ఉపన్యాస రూపంలోనూ ఉంటాయి సాదారణంగా ఈ ప్రక్రియలో ఎన్నుకోబడే కద పౌరాణిక కదగా ఉంటుంది కాని జనసామాన్యం ఆ కదను ఆస్వాదించ గలిగే రీతిలోనే అది మలచబడుతుంది సమకాలిక సంఘటనలను జనానికి చెప్పడంకోసం కొన్ని పాత్రలు, పురాణ కదతో ఏమీ సంబందం లేని విదంగా మలచబడతాయి అవి హాస్య స్ఫోరకతను కలిగి ఉంటాయి ఈ పాత్రలంటే సామాన్య జనానికి ఎంతో యిష్టం వాళ్ళా పాత్రల కోసమే పడిగాపులు కాస్తుంటారు యక్షగానాలలో కద చాలా చిన్నదీ, సరళమైనదిగా ఉంటుంది ప్రారంబం విస్తరణ, పరాకాష్ఠ నందుకోవడం, సంఘర్షణ, చివరకు సుఖాంతస్థితీ యీ కదలలో కనిపిస్తాయి మద్య మద్యలో సమకాలిక సంఘటనల వివరణలు ఈ దృశ్య ప్రక్రియలో చొప్పించబడతాయి అలా అటువంటి సంఘటనలు, ప్రాచీన కాలానికి చెందిన పురాణగాదలు చోటు చేసుకోవడం, ప్రక్రియ బంగంగా ఎవరూ బావించరు నిజానికి అటువంటి సమకాలిక సంఘటనల దృశ్యీకరణ కోసమే వాళ్ళు ఎదురు చూస్తున్నట్లుంటారు

తొలుత రామాయణం, మహాబారతం, మిగిలిన పురాణాలు, యక్షగాన

ప్రక్రియకు కదాంశాలను సరపరాచేసే బాండాగారాలు రాను రాను చారిత్రక, సాంఘిక, రాజకీయేతి వృత్తాలు కూడా ఈ దృశ్య ప్రక్రియలో చోటు చేసుకుంటున్నాయి 1638-73 మద్య తంజావూరు నెలిన విజయరాఘవ నాయకుని విజయ పరంపరను, శృంగారాన్ని ఆదారంగా చేసుకుని యక్షగాన రచన చేసిన విదుషి రంగాజమ్మ ఆస్థానాల కెక్కిన యక్షగానమైన దీని పేరు 'మన్నారుదాస విలాస నాటకం' ఆదునిక యుగంలో చెర్విరాల బాగయ్య, అతని శిష్యుడు మహమ్మద్ అబ్దుల్లా లెక్కకు మిక్కిలి యక్షగానాలను ఆదునికమైన ఇతివృత్తాలతో కూర్చారు అంతేకాక, దొమ్మరిసాని, చాకలి, కోమటి, జాలరి, దొంగ వంటి పాత్రలను హాస్యం ఉత్పన్నం చేయడానికి సృష్టించారు ఇవి సాంప్రదాయిక జానపద యక్షగాన పాత్రలైన సింగి-సింగడు, సుంకర కొండడు వంటి పాత్రల సరసన నిలువదగినవి బాగయ్య కూర్చిన బొబ్బిలి కద చారిత్రకం కాగా కాంబోజరాజుకద జానపదం అబ్దుల్లా కూర్చిన హనుమద్రామ సంగ్రామం, జానపద కల్పనలతో రూపుదిద్దుకున్న పౌరాణిక కద పట్లోరి వీరప్ప కూర్చిన క్రోదపురి రైతు విజయం సాంఘికేతి వృత్తం కలది రైతులకూ, భూస్వాములకూ మద్యజరిగే పోరాటాన్నిది చిత్రిస్తుంది తెలుగులోని ప్రబంధ ప్రక్రియ సరసన నిలువదగిన ప్రక్రియ యక్షగానమే కదా వైవిద్యమూ, బావుకత, వాసి, రాసి అన్నిటా, ఇది ప్రబందాలతో సరితూగదగ్గదే

యక్షగానాలను ఆడడానికి నాలుగు రాటలపై నిర్మింపబడి మూడు వైపుల మూయబడ్డ ఒక ఆకుల పందిరి చాలు వెనకటి కాలంలో కాగడాల వెలుగు, ఆముదపు దీపాలు, రంగస్థలాన్ని కాంతిమంతం చేస్తుండేవి రాను రాను పెట్రొమాక్సు దీపాలు, ఆ పైన విద్యుద్దీపాలు ఆ స్థానాన్నాక్రమించాయి దీనికి వేషరచన పాత్రోచితంగా ఉండేది మృదంగం, తాళపు చిప్పలు, హార్మోనియం వాద్యాలుగా విరివిగా వాడబడుతున్నాయి

యక్షగానం సాదారణంగా రాత్రి పదిగంటలకు ఆరంబమై యెప్పుడో తెల్లవారు ఝామున ముగుస్తుంది సాదారణంగా పాత్రలను ప్రదర్శన ఆరంబంలో సూత్రదారుడు పరిచయం చేస్తాడు ఒక్కొక్కసారి అవే తమంతట తాము రంగప్రవేశం చేస్తాయి దరువులు పల్లవులు అనుపల్లవులు ప్రత్యేక

పాత్రలు పాడేవయినా, రంగస్థలం మీద నుండే యితర పాత్రలుకూడా వాటిని ఆవర్తిస్తుంటాయి వెనక రోజుల్లో యక్షగాన నాటకంలోని స్త్రీ పాత్రలను కూడా పురుషులే నటించేవారు ఇటీవల స్త్రీలే వేస్తున్నారు యక్షగానమే ఈ రోజుల్లో నాగరకమైన హంగులు లేక పూర్తి జానపదంగా మౌలికంగా కనిపిస్తే దాన్ని వీది నాటకమని పిలుస్తారు ఈ యక్షగాన ప్రక్రియను నాగరక స్థాయికి పెంచి పోషించిన వారు కూచిపూడి బాగవతులు అందుకే కూచిపూడి బాగవతమని కూడా దీనికి మరో పేరు కొన్ని సందర్భాలలో కనిపిస్తున్నది కాని వీటికి చెందిన ఆకారయష్టి ఇంచుమించు ఒకటే వీటిల్లో కనిపించే భేదాలు అప్రదానమైనవి ఆదునిక కాలంలో కూడా యక్షగాన ప్రక్రియ బ్రతికి ఉండి జానపదులకు నాగరకులకు, విద్యా విషయక ప్రచారాలలో తోడ్పడుతుండడం సంతోషింపదగిన విషయం

ఒకప్పుడు కోస్తా రాయలసీమ ప్రాంతాలలో యక్షగానాలాడే దళాలు ఎక్కువగా కనిపించేవి ఇప్పుడు తెలంగాణాలో మాత్రమే కనిపిస్తున్నాయి అందునా కరీంనగర్, వరంగల్, రంగారెడ్డి, హైదరాబాదు జిల్లాల్లో ఎక్కువగా ఉన్నాయి తీగల గట్టుపల్లి, ఈదుల గట్టుపల్లి ఆటగాళ్ళ దళాలు మిక్కిలి ప్రసిద్ధి వహించాయి హైదరాబాద్ సికింద్రాబాదు, మురికిపేటల జనంలో ఈ ప్రదర్శనకళ బాగా ప్రచారంలో, ఇప్పటికీ నిలిచి ఉంది

**చిందుభాగవతం** హరిజనులుగా పిలవబడే చిందుమాదిగలు ఈ దృశ్య ప్రక్రియకు ప్రవర్తకులు చిందు అంటే గంతు చిందువేయు, చిందుతొక్కు అంటే అర్థం అడుగులు ఒక క్రమపద్ధతిలో వేయడం చిందుమాదిగలు చాలా పురాతనత్వాన్ని సంతరించుకున్న కులంవారు వారికి పుట్టుకతో లభించిన కళ ఈ చిందు బాగవత ప్రదర్శన కళ కూచిపూడిలో పుట్టిన ప్రతి బ్రాహ్మణ బాలకుడూ, కాలికి గజ్జెలు కట్టుకుని ఒక్కసారైనా నృత్యం చెయ్యడం ఎటువంటి సంప్రదాయమో, ఈ చిందు భాగవతులు కూడా అట్లాగే ఒక్క సారైనా యక్షగానాన్ని ఆడడం వాళ్ళ సంప్రదాయం ఇక్కడ స్త్రీ పాత్రల్ని స్త్రీలే వేస్తారు పురాణకదల్ని గ్రహించి నాటక వస్తువులుగా మలిచి వీళ్ళు యక్షగానాలు ఆడతారు గరుడాచల నాటకం, హరిశ్చంద్ర, సారంగదర, మైరావణ నాటకాలు వీళ్ళు ఎక్కువగా ప్రదర్శిస్తుంటారు వీళ్ళ వేషరచన, ప్రసాదన

కళ, వీది నాటకం, యక్షగానంలోని వాటికంటే బిన్నమైన వేమీకావు వాళ్ళ అబినయం ఆంగికచాలనం పైవాటి కంటే కొంత బేదాన్ని చూపిస్తుంటాయి రంగస్థలం మీద, నాటకంలోని అన్ని పాత్రలూ కనిపిస్తూ ఉండడం, ఒక పాత్రపాడే పాటనుగానీ, ఆటనుగానీ అందరూ అనుకరిస్తూ ఆవర్తించడం ఈచిందు బాగవతంలోని ప్రత్యేకతగా కనిపిస్తుంది ఒక్కొక్కసారి వాద్యగాళ్ళు కూడా వాళ్ళతో గొంతుకలిపి పాడుతుండడం కద్దు రాజుకానీ, నరసింహస్వామి కానీ రంగం మీదికి ప్రవేశించినప్పుడు, ఇరుపక్కలా వెలుగుతున్న కాగడాల పైన 'దశాంగం' కానీ చల్లి పెద్ద మంటను సృష్టిస్తారు ఆ కాంతి మెరుపులో పాత్రలు ఉదాత్తంగా కనిపిస్తాయి బుజకీర్తులు, కిరీటం, తారహారాలు, మెరిసే పెద్ద పెద్ద పూసలదండలు, రాజులకు, దేవతలకు బూషణాలుగా అమర్చి చూపరులకు ఆశ్చర్యాన్నీ బక్తినీ ఆనందాన్ని కలిగిస్తుంటాయి రంగస్థలం మీద ఏ పాత్రా నిశ్చలంగా ఉండడం ఈ దృశ్య ప్రక్రియలో ఉండదు అందరూ పాడుతూనో, ఆడుతూనో ఎప్పుడూ చలనశీలత కలిగి ఉంటారు

కోతల సమయంలో ఒక్కొక్క ఊరిలో నాలుగైదు రోజులపాటు ఉండి, చిందుమాదిగ బృందాలు బాగవతాలాడుతారు తెలంగాణాలోని అన్ని జిల్లాలలోనూ ఈ బృందాలున్నాయి నిజామాబాద్ జిల్లాకు చెందిన చిందు ఎల్లమ్మ బృందం మిక్కిలి ప్రఖ్యాతికన్న బృందం అరవైయేళ్ళు పై బడ్డ దృఢ కాయురాలైన ఎల్లమ్మ బాగవతంలో నాయక, నాయికా పాత్రలను నిర్వహిస్తుంది పడుచు పాత్రకానీ, ముసలి పాత్రలను కానీ, చాలా సులువుగా, ఎంతో చాతుర్యంతో ఈ విధ నిర్వహించడం కనులకు పండువుచేసే కళా నైపుణ్యమని చెప్పవలసిందే

**పగటి వేషాలు :** యక్షగానాలలోని పాత్రలు కొన్ని పగటి వేషాలుగానూ కనిపించడం కద్దు ఈ పాత్రలు నైపద్య రచనం చేసుకుని పగటి వేళ, ఒక రంగస్థలమంటూ లేకుండా, గ్రామంలో ఇంటింటి ముందూ నటించడం వలన, వీటికీపేరు వచ్చింది పగటి వేషం కట్టేవారు, వర్షాకాలంలో రంగ స్థలం ఏర్పాటు చేసుకుని పూర్తి యక్షగానాన్ని ప్రదర్శించడం సాద్యం కాదు గనుక, గ్రామాలలో పదేసి రోజుల పాటు ఉండి రోజుకో వేషం వంతున కట్టి, యిల్లిల్లూ తిరుగుతారు చివరి రోజున యాచించి, డబ్బూ, బియ్యం వంటివి

గ్రహించి తమ తమ ఊళ్ళకు వెళ్ళిపోతారు వీళ్ళు కట్టే వేషాలలో ముఖ్యమైనవి, దాదినమ్మ, సోమయాజి, సోమిదేవి, కొరవంజి మొదలైనవి

**కలాపం** దీనికీ యక్షగానానికీ పోలికలున్నాయి అయితే ఇతివృత్త వరణంలో ఇది చాలా అక్లిష్టంగా కనిపిస్తుంది ఇందులో పాత్రలు కొద్ది ఒక ప్రదాన పాత్ర మరొక సహాయ పాత్ర, రెండే కలాపంలో మనకు కనిపిస్తాయి ఈ పాత్రలు తమను తాము పరిచయం చేసుకుంటూ రంగప్రవేశం చేస్తాయి మొదట సూత్రదారుడు కదను నడుపుతున్న వాడుగా కనిపించి, తరువాత అతనే ఒక సహాయక పాత్రగా మారిపోతాడు కలాపంలో సాత్త్వికాబినయానికి ప్రాదాన్యం ఎక్కువ ఇందులో శృంగారం కానీ బక్తి గానీ అబినయించ బడుతుంది ఇందులో ప్రధాన పాత్ర తను అనుభవించిన ఒక సంఘటనను, సహాయ పాత్ర ప్రశ్నలు కురిపించి, వివరాలను కోరుతుండగా వివరిస్తుంటుంది

ఈ కలాపం, రాను రాను శాస్త్రీయ నృత్యంగా రూపొందించబడ్డది ఇందులో రెండు రకాలు కనిపిస్తాయి (1) భామా కలాపం, (2) గొల్ల కలాపం ఈ రెండూ, సిద్ధేంద్ర యోగి అనే కూచిపూడి సంప్రదాయానికి ప్రారంబకుడైన నాట్యాచార్యుడు రూపొందించినవి ఈయన ఏడవ శతాబ్దికి చెందిన వాడు అంతకు ముందు నట్టువ విద్య బోగం వారి చేతులలో ఉండగా, దాన్ని నిరసించి ఈయన బ్రాహ్మణ యువకుల్ని చేరదీసి వారికి తరిఫీదిచ్చి, నాట్య విద్యను నేర్పించాడట

బామా కలాపం శ్రీకృష్ణ పత్ని సత్యభామ కద ఆమె శ్రీకృష్ణుని విరహం వల్ల పొందే వేదనను, కలయిక వల్ల కలిగే ఆనందాన్ని ఈ కలాపంలో చక్కగా ప్రదర్శిస్తుంది కూచిపూడి సంప్రదాయానికి చెందిన ఈ కలాపం బావప్రకటనలో ఆంగికాబినయంలో, సర్వోత్కృష్ట దశను ప్రదర్శిస్తుంది సత్యబామ, తానే కృష్ణునికి మిక్కిలి ప్రియం కూర్చే ప్రియురాలనని మిడిసిపడే స్వబావం కలది సపత్నుల్ని ఆ కారణంగా చులకన చేస్తూ ఉండేది తాను గీచిన గీటు తన బర్త దాటడనే నమ్మకం ఆమెకు ఎక్కువ ఒకనాడు, ఏకాంతంలో కృష్ణుడు, సత్యబామ విహరిస్తుండగా, వారి మద్య నడచిన సంబాషణ వలన, సత్య గరువతనం ప్రకటింప బడడమే కాక, కృష్ణుడి

మనస్సు చివుక్కు మంటుంది మరుక్షణం అతను కోపం తెచ్చుకుని సత్యను వదిలి వెళ్ళిపోతాడు అతనెంతకీ తిరిగి రాక పోగా, విరహ దుఃఖాన్ని భరించలేక తన వేదన నంతటినీ ఆమె చెలికత్తె దగ్గర ఈ రకంగా వెళ్ళబోసు కుంటుంటుంది

"ఓయమ్మో నే నొక రోజు మంచం మీద పడుకుని ఉన్నాను నా శృంగార మందిరంలో ఉన్న ఆ పడక, హంస తూలికలతో చేసిన పడక ఆ మందిరపు గోడలన్నీ వజ్రాలూ, మరకత మణులూ తాపినవే ఓయమ్మో నేను మైమరచి నిద్రస్తూ ఉండగా, నా ప్రాణనాదుడు వేణుగానం చేశాడు ఆ గానం వింటూ నేను మెల్లిగా కన్నులు తెరిచాను నా పక్కనే కూర్చుని ఉన్న స్వామిని చూసి సంభ్రమంతో లేచి, శ్రీగందం స్వామి మేనంతా పూశానోయమ్మో ఆయన శ్రీ చరణాలను సంవాహనం చేయబూనాను స్వామి నా పట్ల ఎంతో తృప్తి చెంది, దయగల వాడై, చిరునవ్వు నవ్వుతూ నన్ను సర్వాభరణాల చేత అలంకరించాడోయమ్మ నన్ను తన తొడలపై చేర్చుకుని నిలువెత్తు అద్దం పట్టాడు నేను అద్దంలో అందాలు చూస్తుండగా ఓ సత్యా! నీవు అందగత్తెవా లేక నేను అందగాడినా అని అడిగాడు పాపిష్ఠి దాన్ని నేను, నోరు కాచుకోలేక, నేనే అందగత్తెనన్నాను ఆయన నల్లని వాడని ఎగతాళి చేశాను అందుకు తటాలున కోపం తెచ్చుకుని, చివుక్కున లేచి స్వామి వెళ్ళిపోయాడు ఎక్కడికి వెళ్ళినట్లు? ఆయన్ను వెతికి నా దగ్గరకు తెచ్చి, నా ప్రాణాలు నిలిపి కాస్త పుణ్యం కట్టుకోవమ్మో "

ఈ రకంగా సాగుతుంది కలాపం సత్యబామ తన అహంకారాన్ని అణచుకుని, విలపించడం పట్ల ప్రేక్షకులు సానుభూతి ప్రదర్శిస్తారు గొల్ల కలాపం తాత్త్విక చింతన కలిగిన ప్రదర్శన కళ గొల్ల పడతి ఒక బ్రాహ్మణునికి తత్త్వం యొక్క స్వరూపాన్ని చెప్పి దర్మానికి గ్లాని కలిగినప్పుడల్లా బగవంతుడు అవతారం దరించి భూమి మీదికి వస్తాడని వివరిస్తుంది ఈ కలాపాలను ప్రదర్శించే వారిలో కూచిపూడి నట్టువ మేళమే సర్వోత్కృష్టంగా ప్రదర్శిస్తుందనే పేరు లోకంలో ఉంది

**కురవంజి** ఇది ఒక విదంగా ఆద్యాత్మిక పరమైన దృశ్య రూపంగా చెప్పవచ్చు ఇందులో ఉండే పాత్రలు ప్రతీకలు జీవసతి, జీవాత్మనూ-క్రియాకాంత,

జీవుల చర్యలనూ—సింగడు ప్రాదమిక ప్రకృతినీ—సింగి ప్రపంచానికి సంబం దించిన సర్వ శక్తినీ—కురవంజి అవ్యయానందాన్నీ ప్రతి బింబించే పాత్రలు

ఈ రకమైన ప్రదర్శన కళల చేత జానపదులు తత్త్వ పరమైన విచి కిత్సను కలిగి ఆలోచనాదనులు కాగలరు మత సంబందమైన మౌలిక సూత్రా లను సులువుగా ఒంట పట్టించుకోగలరు

కురవంజి సోదె చెప్పే మనిషి సోదె చెప్పడం ప్రాచీన కాలం నుంచీ సాంప్రదాయికంగా వస్తున్న ఆచారం కొద్దిపాటి బియ్యానికో, దాన్యానికో, చిల్లర డబ్బులకో, వీళ్ళు బవిష్యత్తును చెప్పడానికి పూనుకుంటారు గ్రామా లలో అందరికీ సోదె చెప్పించు కోవడంలో కుతూహలమే ఆమె రాకకోసం అందరూ ఎదురు చూస్తుంటారు ఆమె చెప్పే 'ఎఱుక' అన్న పదానికి తెలు సుకోవడం అని అర్థం ఎఱుకత, తొలుదొల్తగా, తనకు తెలిసిన దేవతల నందరినీ రమ్మని, రాగయుక్తంగా పిలుస్తుంది. తరువాత బగవంతుడికి నమస్కారం చేస్తుంది ఆపైన ఎఱుక చెప్పడం ఆరంబిస్తుంది వస్తువులు పోగొట్టుకున్న వాళ్ళు, పశువులు తప్పి పోయిన వాళ్ళూ, జ్వర పీడితులూ, ఎన్నో సమస్యలతో సతమతమయ్యే వాళ్ళు, తమకు శుబం జరగాలని కోరుకునే వాళ్ళు అందరూ ఎఱుకల సానివి ఆశ్రయిస్తారు ఇటువంటి వాళ్ళందరికీ ఎఱుక సమాశ్వాసాన్ని కలిగించి మనస్సును ప్రశాంతంగా తయారు చేస్తుంది

కురవంజి, అటువంటి ఎఱుకల సాని, శృంగార ప్రదానమైన పాత్రలలో ప్రవేశించి, నాయికా నాయకులు విరహాన్ని అనుబవిస్తుండగా, వారికి వివాహం కాగలదనీ, సంయోగం లబిస్తుందనీ ఎఱుక చెప్పి వారి విప్రలంబ దుఃఖాన్ని తగ్గిస్తుంది ఒక్కొక్కసారి తన వియోగం చేత విచారిస్తున్న నాయికను, నాయకుడే సోదెత వేషం వేసుకుని, సమాశ్వసించి, ఎఱుక చెప్పి వస్తాడు

**వీధి నాటకం** ఇది గ్రామాలలో ఆరుబయట ఏ చెట్టుకిందనో, దారుల కూడలి దగ్గరో ప్రదర్శించే దృశ్య కళ సంస్కృత దశ విద రూపకాలలో 'వీది' అనే ప్రక్రియ ఉన్నది గానీ, ఈ వీది నాటకానికీ దానికీ సంబందం లేదు ఇందులో ఉండే యితివృత్తం సాదారణంగా పౌరాణికం ఈ నాటకాలాడే వాళ్ళు జట్లుజట్లుగా గ్రామాలకు వస్తూ ఉంటారు ఊరి మోతుబరి లేదా జమీందారు ఈ ప్రదర్శ

నకు కావలసిన దన సహాయాన్నందిస్తాడు ప్రదర్శకులు, ప్రదర్శన ముగిసిన తరువాత వేషం తీయకుండానే ఊరిలో ఇంటింటికీ వెళ్ళి డబ్బు దండుకుంటారు ఈ బాగవతులకు రాజాదరం ఉండేది 15వ శతాబ్ది నుంచీ ఈ కళ ప్రాబవంలో ఉన్నట్లు చరిత్ర చెపుతుంది విజయసగర రాజులు దీన్ని ఆదరించినట్లు దాఖలాలు ఉన్నాయి గోల్కొండ నేలిన కుతుబ్ షాహీలు ఈ నటకులకు మాన్యాలిచ్చారు

**తోలు బొమ్మలాట** ఆంధ్రదేశంలో క్రీ పూ 3వ శతాబ్దం నుండి ఈ తోలు బొమ్మలాట ఉండేదని తెలుస్తోంది ఇక్కడ నుండే మలేషియా, జావా, ఇండొనేషియాలకు ఈ కళ వ్యాప్తి చెంది ఉంటుందని చారిత్రకులు, విమర్శకులు భావిస్తున్నారు శాతవాహనులు, పల్లవులు, కాకతీయులు, విజయనగర రాజులు ఈ కళను ప్రోత్సహించినవారే కాని తంజావూరు, మధుర నాయకరాజుల కాలంలో ఇది మిక్కిలి ఉచ్చస్థితి నందుకుంది పాల్కురికి సోమన తన పండితారాధ్య చరిత్రలో దీన్ని పేర్కొన్నాడు ఆటగొల్లలు, జంగములు, బలిజలు దీన్ని ప్రవర్తింప జేస్తుండేవారు ఇప్పుడు ఎక్కువగా బొందిలీలు దీన్ని చేపట్టడం జరిగింది రాజస్థానంలో బుందేల్ఖండ్లో నివసించే రాజపుత్రుల్ని బొందిలీలంటారు వీళ్ళల్లో కొందరు ఆంధ్రదేశంలోకి వలస వచ్చి స్థిరవాసం ఏర్పరచుకుని బొందిలీలని పిలిపించుకుంటున్నారు అట్లాగే మహారాష్ట్రం నుండి వలస వచ్చి ఆంధ్రదేశంలో కుదురుకున్న వాళ్ళు ఆరె మరాఠీలు వీళ్ళు కూడా తోలుబొమ్మలాట లాడిస్తారు వీళ్ళంతా ఆంధ్రదేశానికి వచ్చి అక్కడి జన జీవన స్రవంతిలో బాగంగా మారిపోయి వాళ్ళతో విడదీయరాని విదంగా అభేదాన్ని సాదించినవారే విశాఖపట్నం జిల్లాలోని సర్వసిద్ధి, శృంగవరపు కోటల్లోను, తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురం, సామర్లకోట, రాజమహేంద్రవరం, తాళ్ళరేవు, మాదవ పట్నాలలోనూ, అనంతపురం జిల్లా బొమ్మలాటపల్లి, నిమ్మలకుంట, రాయదుర్గాలలోనూ, కడపజిల్లా కమలాపురంలోనూ నెల్లూరుజిల్లా డి సి పల్లెలోనూ నల్లగొండ జిల్లా రాజపురంలోనూ ఈ బృందాలు కనిపిస్తాయి సినిమాలూ, టెలివిజన్లూ ప్రాచుర్యానికి వచ్చిన కారణంగా ఈ కళనబిమానించే వారు నానాటికీ తగ్గిపోతున్నారు ఈ కళాకారులు తమ చేతిలోని విద్యను వదులుకుని పొట్టకూ

టికోసం ఇతర వృత్తుల్ని ఆశ్రయిస్తున్నారు

ఒక తోలుబొమ్మలాట బృందంలో ఎనిమిది నుండి పన్నెండుమంది దాకా కళాకారులుంటారు అందులో పాట పాడడానికి ఇద్దరు స్త్రీలుంటారు స్త్రీ పాత్రలకు సంబాషణలు వీరే చెబుతారు అట్లాగే మగపాత్రలకు పాడడానికి సంబాషణలు చెప్పడానికి ఇద్దరు పురుషులుంటారు ముగ్గురు వాద్యగాళ్ళుంటారు అందులో ఒకరు శ్రుతి నిర్వహిస్తుంటారు ఒక మనిషి అంతటా తానే అయి తిరుగుతూ ఎవరికి సహాయం కావలసినా అందించడానికి సిద్ధంగా ఉంటాడు కావలసిన బొమ్మల్ని చకచకా అందించడం, దీపాల్ని సరిచూడడం ఇతని ముఖ్యమైన పని తోలుబొమ్మల్ని ఏ బృందానికా బృందమే తయారు చేసుకుంటుంది మేక, జింక చర్మాలతో ఈ బొమ్మలు తయారవుతాయి ఇవి బాగా సానపెట్టబడి ఉలిపిరి కాగితాల్లాగా నాజూకు తనం తేలేట్లు తయారవుతాయి వీటి మీద పాత్రకు తగిన ఆకారాల్ని గీచుకుని, వాటిని కత్తిరించి బొమ్మల్ని తయారు చేసుకుంటారు పాత్రకు తగిన వేషదారణ అలంకారాలు, రంగులు పూయడం ద్వారా సాదిస్తారు ఒంటి మీద నగల్ని, బొమ్మ శరీరం మీద పొడిచిన చిన్న చిన్న చిల్లుల ద్వారా సూచిస్తారు ఈ బొమ్మల యెత్తు ఒక అడుగు నుండి ఆరడుగుల వరకు, ఆయా పాత్రల్ని బట్టి ఉంటాయి దేవుళ్ళు, రాక్షసులు, వృద్ధులు, బాలకులు, వంటి బేదాలన్నీ బొమ్మల ఆకారంలోనూ, వేషరచనలోనూ అలంకరణలోనూ కనిపించేటట్లు తీర్చిదిద్దుతారు పశువులు, పక్షులు, సరీసృపాలు కూడా కదకుండే అవసరాన్ని బట్టి తయారవుతాయి ఒకే ఒక పాత్రకు, ఆ పాత్ర వయోబేదాల ననుసరించి వేషాన్ని బట్టి నాలుగైదు బొమ్మలు కూడా చేయవలసి వస్తుంది బాల్యంలో ఉన్న రాముడు, అరణ్య వాసం చేసే రాముడు, యుద్ధరంగంలో రాముడు, పట్టాబిషిక్తుడైన రాముడు - తమ వేషం వల్ల వేరు వేరుగా కనిపించక తప్పదు అందువల్ల అటువంటి వేష రచన కలిగిన వేరు వేరు బొమ్మలకు, మెడ, బుజాలు, కాళ్ళు, చేతులు, నడుము వంటి భాగాలన్నీ ఏకఖండంగా ఉండవు విడివిడిగా ముక్కలుగా ఉండి అవన్నీ దేనికది కదలడానికి వీలుగా అతుకు వేయబడి ఉంటాయి ఒక్కో బృందం దగ్గర 100 నుండి 150 వరకు బొమ్మల్ని బద్రపరిచే పెట్టెను వీళ్ళు గణియం అంటారు దాన్ని వీళ్ళు

ప్రాణపదంగా చూచుకుంటారు బొమ్మ వెనక బాగంలో సన్నని వెదురు బద్ద ఉంటుంది దానిని కదపడం ద్వారా బొమ్మ కదులుతుంది ఆటగాడు బొమ్మను చేతిలో ఉంచుకుని ఈ బద్దను చాకచక్యంగా ముందుకూ వెనక్కూ లేదా పైకీ కిందికీ కదపడం ద్వారా, ఆ బొమ్మల నీడలు తెరమీద ఆటాడడం మొదలు పెడ్తాయి ప్రేక్షకుడు తెరమీద బొమ్మకు సంబందించిన నీడను చూస్తాడు కాని బొమ్మనుకాదు బొమ్మకుండే పారదర్శకత్వం వల్ల, వాటి రంగులు, వేషం, అలంకారాలూ అన్నీ తెరమీద స్పష్టంగా, నిజం బొమ్మను చూస్తున్నట్లుగా కనిపిస్తాయి

వీళ్ళ రంగస్థలం గ్రామానికి సంబందించిన ఆరు బయలు అందులో కర్రలతో, గడ్డితో నిర్మించిన ఒక కప్పు అందులో ఏటవాలుగా తెల్లని గుడ్డతో నిర్మంపబడిన తెర ఉంటుంది ఈ తెర గాలికి కదలని విదంగా అటూ ఇటూ కర్రలను బిర్రుగా ఉండేట్లు బిగించి ఉంటుంది తెర అడుగు బాగంలో, రెండ డుగుల ఎత్తున నల్లని గుడ్డ, వెనుక వైపు అతికించబడి ఉంటుంది అందు వల్ల తెరవెనక ఏం జరుగుతుందో ప్రేక్షకులు తెలుసుకోలేరు వెనకరోజుల్లో బొమ్మల నీడలు తెరమీద పడడానికి తెరవెనక, మద్య బాగంలో ఆము దంతో దీపాలు వెలిగించి ఉంచేవారు ఈనాడు వాటికి బదులు పెట్రొమాక్సు దీపాలనూ ఎలక్ట్రిక్ దీపాలనూ వాడుతున్నారు

రామాయణం నుండి సుందరకాండ, లక్ష్మణ మూర్చ, రావణవద, కుశలవ కద వంటి కదలూ, బారతం నుండి శిశుపాలవధ, ద్రౌపదీ వస్త్రాప హరణం, కీచకవద వంటి కదలూ, బాగవతం నుండి ప్రహ్లాదకద, బాణాసుర వద వంటివీ ఈ బృందాలు ఆడుతుంటాయి ఇవేకాక చారిత్రక కదల్ని కూడా వీళ్ళు ప్రదర్శిస్తుంటారు తామాడే కదలకు సంబంధించిన పాటలు, సంబాషణలు, పద్యాలు, కదానుక్రమం - అంతా ప్రవర్తకులకు కంఠస్థమై ఉంటాయి నాటకం మద్యలో జనానికి హాస్యాన్నీ శృంగారాన్నీ అందించడా నికి కొన్ని విదూషక పాత్రల వంటి పాత్రలు రంగ ప్రవేశం చేస్తుంటాయి జుట్టు పోలిగాడు, బంగారక్క, కేతిగాడు అనే పేర్లుగల ఈ పాత్రలు జనాన్ని అమితంగా ఆకర్షిస్తాయి

ఆట ప్రారంబంలో వినాయకుణ్ణి, సరస్వతీ దేవిని, ఇతర దేవత

లను, నాటరాగంతో ప్రార్థిస్తారు ఆట ముగించేటప్పుడు సురటిరాగంతో ముగిస్తారు

ఆటాడించే వాళ్ళు అన్ని శబ్దాలనూ అనుకరించ గలిగి ఉంటారు గొంతెత్తి ఊరి చివర వరకూ వినిపించేటట్లు పాడ గలిగి ఉంటారు పాత్రల కదలికలకు అనుగుణమైన శబ్దాలూ, రాగాలలో మార్పులూ, గొంతులో స్వరానికి సంబందించిన గాంబీర్యమూ, లాలిత్యమూ వంటి బేదాలూ వీళ్ళు చక్కగా చూపించగలరు అందువల్ల ప్రేక్షకులకు ఒక నాటకం చూస్తున్న అనుబూతి కలుగుతుంది అందువల్లనే ప్రాణంలేని తోలుబొమ్మలను సజీవ పాత్రలుగానూ, ప్రాణం ఉన్న ప్రేక్షకులను చిత్రాలుగానూ వాళ్ళు మార్చగలరు ఈ బృందాలలోని వారికి వ్యవసాయం ప్రదానవృత్తి వ్యవసాయపు పనులు లేని కాలంలో, ఊరూర తిరుగుతూ తమ చేతిలో ఉన్న ఈ తోలుబొమ్మలాటల్ని ఆడుతూ జీవన బృతిని సంపాదించుకుంటుంటారు ముఖ్యంగా వ్యావసాయిక పరమైన పండుగలలోనూ, జాతరలలోనూ వీరి కళా ప్రదర్శనను మనం చూడవచ్చు

**వాలకం :** ఇది విశాఖజిల్లాలోనూ, తూర్పు ప్రాంతాలలోనూ ఎక్కువగా కనిపించే దృశ్య ప్రక్రియ దీనికి ప్రతేక రంగస్థలం కానీ ప్రత్యేక పారక్రమం కానీ ఉండదు పండుగలు, జాతరలు మొదలైన ఉత్సవ సమయాలలో నలుగురు చేరడానికి అనువైన మైదానమే ఈ ప్రదర్శనకు అనువైన స్థలం ఇందులో సాదారణంగా ఒకటే పాత్ర ఉంటుంది అంగ విన్యాసంతోనూ, సంభాషణలతోనూ, రంగస్థలమంతా అలగం తిరుగుతూ ఆ పాత్ర ప్రేక్షకులకు వినోదం పంచిపెడుతుంది సంఘంలో జరిగే అవకతవకలు, దినదిన పరిణామాలు, ఊరి పెద్దల దాష్టీకం, పన్నులు వసూలు చేసే అదికారుల ఆగడం, ఒకటేమిటి అన్నిటినీ, కించిత్ హాస్యంతో మిళాయించి ఆ పాత్రదారి ప్రేక్షకులకు తెలియచెబుతాడు ఆ రోజు పాత్ర ఎవరిని ఏమన్నా, తిట్టినా, ఎగతాళి చేసినా, ఎవరూ ఏమీ అనుకోరాదు అంతా హాస్యం మాటున మరుగు పడిపోయే వ్యంగ్య ప్రదాన దృశ్య ప్రక్రియ యిది ఈ పాత్ర తాటాకులతో ఒక తోకను తగిలించుకుని ఉంటాడు ఆ తోకవల్లనే దీనికి వాలకమనే పేరు కలిగింది ప్రదర్శన ముగింపుకు వచ్చే సమయాన తోకకు నిప్పు తగి

లిస్తారు ఆ తాటాకు మంటతో వాలకం వేషదారి రంగస్థలం చుట్టూ తిరిగి నిష్క్రమిస్తాడు ఇది రామాయణాంతర్గతమై, లంకాదహనానికి పూనుకున్న హనుమత్ పాత్రకు నకలు కావచ్చును

**కొమ్ములవారు** కొమ్ము అంటే అసలైన అర్థం జంతువుకు సంబందిచిన కొమ్ము అని తొలుత జంతువుల కొమ్ములనుండే గాలివాయిద్యాన్ని తయారు చేసుకుని ఉపయోగించేవారు రానురాను కొమ్ము ఆకారంలో ఇత్తడితో వాయిద్యాన్ని తయారు చేసుకోవడం అలవాటయింది కొమ్మును ఉపయోగించి, ఆ వాద్యపు నేపథ్యంలో కదాగానం చేసే వారిని కొమ్ముల వారు అని పిలుస్తారు వీరు సాదారణంగా కాటమరాజు కదల్ని గానం చేస్తారు కాటమరాజు యాదవుడు యాదవులకూ నెల్లూరు సీమను పరిపాలించిన తెలుగు చోళరాజులకూ, 13వ శతాబ్దం చివరి బాగంలో యుద్దం జరిగింది యాదవవీరుడు కాటమరాజు యుద్ధానికి నాయకత్వం వహించాడు బీర్నీడు, చెన్నప్ప అనే పేర్లు కలిగిన షెడ్యూలు కులానికి చెందిన గోసంగి వీరులు కాటమరాజుకు బాసటగా నిలిచారు యుద్ధంలో చివరకు మిగిలిన పోలరాజు కుమారుడైన బక్తిరన్న, బీర్నీని సంతానాన్ని, యాదవ వీరగాదల్ని, చరిత్రలో చెరిగి పోకుండా, గానం చేయమని కాటమరాజు ఆదేశించాడు ఆ బీర్నీని సంతానమే కొమ్ములవారు యాదవ వీరగాదను గానం చేయడం వీరికి వంశపారం పర్యంగా అలవడిన పవిత్ర చర్య వీరు రాష్ట్ర మంతటా తిరిగి ఈ కదల్ని గానం చేస్తారు

కదాగానం చేసేటప్పుడు వీళ్ళకు ముఖ్యంగా కొన్ని వస్తువులు దగ్గర ఉండడం తప్పని సరి అవి (1) కొమ్ము వాద్యం (2) వీరణం అని పిలవబడే పెద్ద డప్పు (3) బొల్లావు- చెక్కతో కాని ఇత్తడితో గాని చేసిన ఆవు బొమ్మ ఇది కామధేనువుతో సమావమైంది యాదవుల పక్షాన ఇది సహచరులతో వచ్చి యుద్దం చేస్తుంది (4) వీరతాడు - లావుగా పేనిన మోకు ఇది చర్నకోలలాగ ఉపయోగ పడుతుంది 'తొనకాలు' చదివేటప్పుడు పూనకం వచ్చిన వాళ్ళను ఈ మోకుతో కొడుతుంటారు (5) బసవదేవుని విగ్రహం- ఈ బసవదేవుడు యర్రగడ్డపాడు పోట్లాటలో యాదవ యుద్ధ వార్తలను, పలితాలను దొనకొండకు మోసుకుపోయిన వార్తాహరుడు (6) గుడారు - ఈ గుడారంలో గుడ్డల మీద గంగ, మొదలైన కులదేవతల బొమ్మలు అద్దకాలు

వేసి వేలాడ దీస్తారు అవి దాదాపు కాటమరాజు కదల్లోని యాదవుల ముఖ్య దేవతల చిత్రాలు ఇందునల్లనే కొమ్ములవారిని 'తెరచీరల' భక్తులు అని కూడా అంటారు కదాగానాన్ని చేసే కదానాయకుడు పొడవైన ఎర్రటి లాల్చీని, పెద్ద తలపాగాని దరిస్తాడు నడుముకు రంగుగుడ్డని పట్టాగా దరించి, గజ్జెలు కట్టుకొని, చేతివేలికి రుమాలును కట్టి ఆ చేత్తో కొమ్మువాయిద్యాన్ని పట్టుకొని ముందుకు వెనుకకు కదులుతూ కదాగానం చేస్తాడు అతనికి 'వంతలు' అనే యిద్దరు సహాయకులు శ్రుతిలయలతో తిత్తి, వీరణము మరియు జముకు అనే వాయిద్యాలని వాయిస్తారు ఆ వంతలు తగిన వేషదారణలో ఉండి కద కుడు చెప్పిన మొదటి పంక్తిని పల్లవిగాను లేక 'ఆహః' అనే పదాన్ని పలు కుతుంటారు కదకుడు కొమ్మువాయిద్యాన్ని వాయిస్తుంటాడు దాని శబ్దం యుద్ధంలో మ్రోగే కఠినమైన కొమ్ముశబ్దంలాగా ఉంటుంది నెల్లూరు, ప్రకాశం జిల్లాలలో అలవాటుగా చేసే గంగతిరునాళ్ళ ఉత్సవసమయాల్లో ఆచార ప్రకారంగా పాడే పాటలను పాడుతూ కనిపిస్తారు అయితే ఈ కదకులు యాదవులనుండి బహుమానాలను పొందేందుకు ఎప్పుడైనా తమ వాయి ద్యాలతో పాటలు పాడుతుంటారు

**బుఱ్ఱ కద** ఇది జానపద కదాగానంలో ఒక అంశం పాటలు పాడేవాళ్ళు బుఱ్ఱ అనే వాద్యం మోగిస్తూ కద చెప్పడం వలన దీనికి బుఱ్ఱ కద అనే పేరు కలిగింది దీనికే తందాన కద అనే మరో పేరుకూడా ఉంది బుఱ్ఱనే బుడుగె, గుమ్మెట అనే పేర్లతో పిలుస్తారు ఈ కదాగాన ప్రక్రియ మొత్తం బారతదేశ మంతా అల్లుకుని ఉంది ప్రాచీనకాలంలో, వాల్మీకి రామకదను, కుశలవుల చేత గానం చేయించాడన్నది విదితమే జానపదులకు, వినో దాన్ని అందించడమేకాక, విజ్ఞాన విషయాలను, ప్రాచీన కదలను, చెప్ప డమే ఈ ప్రక్రియ యొక్క ద్యేయం వీరశైవమత ప్రచారానికి ఈ ప్రక్రియను వాళ్ళు చక్కగా ఉపయోగించుకున్నారు శివభక్త కదలను జనమద్యంలో ప్రచారం చేయడం ఆనాటి వారి ద్యేయం

ఆంధ్రదేశంలో ఈనాడు పన్నెండుకు మించి కదాగాన ప్రవర్తక బృందాలు కనిపిస్తాయి అందులో కొన్ని ఆచారాత్మక కదల్ని చెప్పేవి కొన్ని మతపర మైనవి మరికొన్ని అద్భుత కదల్ని కేవలం వినోదార్థం చెప్పేవి పల్నాటి

వీర కదల్ని వీర విద్యావంతులు చెబుతారు కాటమరాజు కదల్ని కొమ్ముల వారు చెప్తారు మాతృదేవత కదల్ని బవనీలు చెబుతారు మల్లన్న కదల్ని బీరన్నల వారు చెపుతారు ఇవన్నీ ప్రత్యేకమైన ఉత్సవ సందర్భాలలో చెప్పే గేయ కదలు వీళ్ళందరికి ఎవరికి సంబందించిన వేషదారణ, వాద్యాలు, ఆచారకాండ వారికి ప్రత్యేకంగా అమరి ఉంటాయి ఆచారాత్మక ప్రాదాన్యం కలిగిన పై కదాగానం కంటే బిన్నంగా, పిచ్చుకుంట్లు అని పిలువబడే శారద కాండ్లు, బుడిగె జంగాలు మొదలైన వారు కేవలం వినోదార్ధం అద్భుత కదల్ని చెబుతారు చారిత్రక కదలు, పురాణకదలు, జానపద వీరుల కదలు, సాంఘికేతర వృత్తం కలిగినవి, అన్నీ – వీరి కదాగానానికి వస్తువులై ఉంటాయి

కదాగానం చేసేవానికి పూర్వకాలంలో ప్రత్యేకమైన వేషరచన ఉండేదికాదు అతని బార్యలే వాద్య ప్రవర్తకలై ఉండేవారు వంతపాడేవారు కదంతా, మంజరీ ద్విపదలోనో, రగడలోనో నడిపించేవారు కదంతా మౌఖికమై ఉండేది ఆధునికమైన కదాగాన ప్రక్రియ చాలా మార్పులు చెందింది ఇట్లా మార్పులు చెందిన దానిని, బుఱ్ఱ యొక్క ఉపయోగం అక్కడ ఉన్నా లేకపోయినా దాన్ని బుఱ్ఱ కద అని కొన్ని చోట్ల అనుకుంటున్నారు అట్లా అనుకోవడం వల్ల మొత్తం బుఱ్ఱకద అనే ప్రక్రియే ఆదునిక ప్రక్రియ అనుకుంటున్నారు అది సరికాదు ఈనాటి బుఱ్ఱకద బృందాలు రంగు రంగుల నక్కీ గుడ్డతో కుట్టబడిన వస్త్రాలు దరిస్తారు ప్రసాదనాన్ని కలిగి ఉంటారు కద చెప్పే వారు స్త్రీలైతే సహాయకులు స్త్రీలుగానూ పురుషులైతే పురుషులుగానూ ఉంటారు కద నిడివి కేవలం కొన్ని గంటలలో ముగిసేదిగా ఉంటుంది కూర్పు రకరకాల నడకలలో కనిపిస్తుంది దేనువకొండ వెంకయ్య అనే రచయిత చాలా కదలను, ప్రదర్శనార్ధం తయారు చేశాడు అందులో ఆయన ద్విపద, దరువు, కందార్థాలు, కీర్తనలు వంటి రకరకాల చందో వైవిద్యాలను ప్రవేశ పెట్టాడు ఆతని ఉత్తర గోగ్రహణం ఇందుకు మంచి ఉదాహరణ సుంకర సత్యనారాయణ, ఈ ప్రక్రియను రాజకీయ ప్రచార ప్రయోజనం కోసం వాడుకున్నాడు నాజర్ బృందం, కదాగానం చేసేటప్పుడు, వేప రచననూ, ప్రసాదన పద్దతినీ, కదా ప్రవర్తన రీతుల్నీ సంస్కరించి కొత్త పద్దతుల్ని ప్రవేశ పెట్టింది

ప్రతి కదాగానంలోనూ ముగ్గురు పాల్గొంటారు అందులో ఒకరు ప్రదాన కదకుడు, మిగిలిన యిద్దరూ వంత పలికేవారు కదకుడు పొడవైన అంగరఖా దరిస్తాడు తలకు తురాయి పొదివిన కుచ్చుపాగా పెట్టుకుంటాడు అది పొడ వైన తోక కలిగిన పాగా, కాళ్ళకు పట్టినట్లుగా ఉండే పైజామా వేసుకుంటాడు లేదా పంచె కట్టుకుంటాడు నడుముకు రంగురంగుల పటకా ఉంటుంది కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటాడు కుడిచేతిలో తంబురా ఎడమ చేతిలో అందెలు ఉంటాయి ఒక చేతి రుమాలు కూడా వేలికి చుట్టుకుని ఉంటాడు వాద్యం మోగిస్తూ ముందుకు వెనక్కూ అడుగులు కదుపుతూ కద చెప్తాడు వంత పాట గాళ్ళకు కూడా కొంత వేషరచన ఉంటుంది వీళ్ళ చేతుల్లో చర్మ వాయిద్యాలయిన డిక్కీ మద్దెల వంటివి ఉంటాయి బుర్రలు, బుడిగెలు అనే వాయిద్యాలను వాయిస్తుంటారు ప్రదాన కదకుడు కదలోని చరణాల్ని పాడు తుంటే వీళ్ళు 'తందాన తాన' అంటూ వంతలు పలుకుతారు కొంత హాస్యాన్ని చిలకరిస్తూ సమకాలిక సంఘటనల్ని విశదం చేస్తుంటారు ఈనాటి బుర్రక దల్లో రాజకీయ సాంఘిక విషయాల మీద సున్నితమైన హాస్యాన్ని వెలువరి స్తున్నారు ఈనాడు కదాగేయ రూపంలో దృశ్య ప్రక్రియగా రూపు చెందిన బుర్రకద ప్రభుత్వ కార్యకలాపాలను గ్రామీణ జనంలో ప్రచారం చేయడానికి ఒక శక్తిమంతమైన సాదానంగా ఉపయోగపడుతూంది ఆంధ్రదేశంలో అన్ని చోట్లా యిటువంటి బృందాలెన్నో ఉన్నాయి

**జముకుల కథ** · జముకు ఒక వాద్యం పేరు దీన్నే జమిడిక అని కూడా అంటారు దీన్ని వాయిస్తూ చెప్పే కద కనుక ఈ కదల్ని జముకుల కదలం టారు జమిడిక రెండు రకాలయిన వాద్యాల సమ్మేళనంగల విచిత్ర వాయి ద్యం ఖాళీ, వలయాకారమైన చక్రానికి ఒక చర్మం బిగుతుగా అమర్చి ఒక వైపు మూసి వేసి ఉంటుంది రెండవవైపు తెరచి ఉంటుంది చర్మం మద్య నుండి లోపలి వైపున నరం ఒకటి అమర్చ బడి, దాని రెండవ చివర ఒక కర్ర పుల్లకు అమర్చబడి, అది తెరచి ఉంచిన వైపునుండి బయటికి వచ్చే ట్లుగా ఉంటుంది ఆ నరాన్ని బిగుతుగా లాగి పట్టుకుని వాద్యకాడు దాన్ని తంత్రీ వాద్యంగా వాయిస్తాడు లేదా మూసి ఉంచిన చర్మాన్ని తాటిస్తూ చర్మ వాద్యంగా వాయిస్తాడు ఈ రెండు రకాల వాదనల్ని వినిపిస్తూ లాలి

త్యాన్నీ, భయంకర శబ్దాలనూ, రెండిటినీ సృష్టించగలగడం ఈ వాద్యంలో ఉన్న విశేషం ఆంధ్రదేశంలోని షెడ్యూల్డు కులాలకు చెందిన కళాకారులు ఈ వాయిద్యాన్ని వాడడంలో సిద్ధహస్తులు పరశురాముని కదలు, ఎల్లమ్మ రేణుక కదలు చెప్పేటప్పుడు బైండ్లవారు లేదా బవనీలు ఈ వాద్యాన్ని వాడుతారు గ్రామాల్లోని షెడ్యూల్డు కులాలవారు అంకమ్మ దేవర కదా చక్రాన్ని గానం చేస్తూ పంబ అనే వాయిద్యాన్ని వాడుతుంటారు వీటితోపాటు శ్రుతికోసం 'తిత్తి' అనే పూరక వాద్యాన్ని వాడుతుంటారు తెలంగాణాలో మాదిగలకే పంబల వారనీ, బైండ్ల వారనీ పేరుంది వీళ్ళు మాతృ దేవతా రాదనాక్రమంలో పూజారులుగా కూడా పని చేస్తుంటారు గౌతు పురాణం, ఎల్లమ్మ కదాచక్రం వంటి కదాగేయాలకు వీరు ప్రవర్తకులు ఊరికి గాయి, గత్తర సోకినపుడు, వ్యాదులు ప్రబలినప్పుడు చేసే జాతరల సమయంలో వీరీ కదల్ని గానం చేస్తారు ఇది ఆచారాత్మకమైన కదాగానం

జముకుల కదల్లో పూర్వకాలంలో శక్తి సంబందమైన కదలే ఉండేవి ఆదునిక కాలాన సాంఘిక రాజకీయేతర వృత్తాలు కూడా జముకుల కదలుగా కనిపిస్తుండడం విశేషం బుర్రకద అటు గ్రామీణ జనుల్ని ఇటు నాగరకుల్ని ఆకర్షించగా, జముకుల కద మాత్రం కేవలం గ్రామీణులకే పరిమితమైనదిగా కనిపిస్తుంది

**ఒగ్గుకద .** 'ఒగ్గు' అనేది కూడా చర్మ వాద్యమే ఇది శివుని చేతిలోని డమరుకాన్ని పోలి ఉంటుంది దీని సహకారంతో చెప్పే కదల్ని ఒగ్గు కదలని పిలుస్తారు దీన్నే 'జగ్గు' అని కూడా పిలుస్తారు పశుపాలన వృత్తిగా కలిగిన గొల్లలలో అంతర్భాగంగా పరిగణింపబడేవారు ఒగ్గు గొల్లలు వీళ్ళనే కురమలని కూడా వ్యవహరిస్తారు కర్నాటక రాష్ట్రంలో వీరినే కురుబలనీ, గొరవలనీ పిలుస్తారు పశువుల్ని మేపుకోవడం, వాటి ఉన్నితో కంబళ్ళు తయారు చేసుకోవడం వీరి వృత్తి వీళ్ళల్లో కదాగానం చేసేవారు జాతరల సమయాల్లో ఆచారాత్మకమైన పండుగలలో పూజారి వృత్తిని నిర్వహిస్తుంటారు వీళ్ళ కులదైవాలు బీరన్న, మల్లన్నలు వీళ్ళనే మహారాష్ట్ర ప్రాంతంలో 'ఖండోలా' అనీ 'మలహర్' అని వరుసగా పిలుస్తారు ఒగ్గు కద చెప్పేవాళ్ళు వారాల తరబడి చెప్పడానికి వీలుపడేంత పెద్ద కదలు చెబుతారు అవి బీరన్న

మల్లన్నల చుట్టూ అల్లబడిన కదలు ఇవికాక శక్తి కదలైన ఎల్లమ్మ కదలు కూడా చెబుతారు ఇవి సాదారణంగా మంజరీ ద్విపదలో సాగుతుంటాయి మద్యమద్యలో సంబాషణాత్మకంగా వచనం అనుసందానింపబడి ఉంటుంది కదకుడి చాతుర్యాన్ని బట్టి ఆశువుగా పద్య గద్యాత్మకంగా ఎంతో బాగం అప్పటికప్పుడు చేరుతూ, కద మనోరంజకంగా నడుస్తుంది

ఈ కదాగాయక బృందంలో నలుగురు మనుషులుంటారు అందులో ఒకరు ప్రదాన గాయకుడు ఇద్దరు వాయిద్యగాళ్ళు మరొకడు వీళ్ళకు సహాయకుడుగా ఉండే మనిషి వాయిద్యగాళ్ళలో ఒకడు డోలు వాయిస్తాడు, మరొకడు తాళాలు మోగిస్తాడు సహాయకుడు, కొన్ని సమయాల్లో ఒగ్గును పలికిస్తుంటాడు కొన్ని కొన్ని బృందాలలో ఇద్దరు డోలు వాయిద్యగాళ్ళు, ఇద్దరు తాళాలు మోగించేవాళ్ళు, మరొకడు 'నపిరి' అనే కొమ్మువాద్యాన్ని మోగించేవాడు ఉండవచ్చు ప్రదాన కదకుడు కాళ్ళకు గజ్జెలు కట్టుకుని చేతుల్లో ఒగ్గును పలికిస్తూ కదాగానం చేస్తాడు అతడే తన కదలో వచ్చే వివిద పాత్రల్ని కొద్ది కొద్దిగా అనుకరిస్తూ కదను ముందుకు నడుపుకుని పోతాడు ఒక్కొక్క పాత్రను అబినయించవలసి వచ్చినప్పుడు ఆ పాత్రకు తగిన హావబావాలను తనకు ఆపాదించుకుని త్వరత్వరగా ఆ పాత్రలలో లీనమై పోతుంటాడు నడుముకో పటకా కట్టుకుని, చేతిలో ఒక కర్ర పట్టుకుని ముందుకు వెనక్కు అడుగులు కదుపుతూ ప్రేక్షకుల వైపుకు చేతిగుడ్డను ఊపుతూ కదాగానం చేస్తాడు సన్నివేశాన్ని బట్టి అవసరం కలిగితే అతడు కొంచెం నర్తాశం కూడా చేయగలడు స్త్రీ పాత్రల్ని, కదావశాన అబినయించవలసి వచ్చినప్పుడు నడుముకు కట్టుకున్న కండువా వంటి గుడ్డను తలమీద ముసుగుగానూ పైట కొంగుగానూ మార్చుకుంటాడు ప్రదాన కదకుడు సాదారణంగా పొడుగ్గా జుట్టు పెంచుకుని ఉంటాడు అతని కాలి వేళ్ళకు మెట్టెలు కూడా ఉంటాయి ఇవి అతని స్త్రీ పాత్రాబినయానికి బాగా ఉపకరిస్తాయి అతని మాటల్ని పాటలోని పాదాల్ని సహాయకుడు ఆవర్తిస్తుంటాడు మద్య మద్యలో హాస్యాన్ని అందిస్తుంటాడు కదకుని మాటల్ని వక్రీకరిస్తూ వ్యంగ్యాన్ని పోషిస్తుంటాడు ఈ ఒగ్గు కదా ప్రక్రియ కురమలకు చెందిన ప్రక్రియ

ఆదునిక కాలాన, ఇది ఆచరణాత్మక ప్రక్రియారూపాన్ని విడిచి పెట్టి, వినోదాత్మక ప్రక్రియగా స్థిరపడ్డది ఒగ్గు కదాకారులు ఈనాడు వేరువేరు కదలు కూడా చెబుతున్నారు బల్లారి కొండయ్య కద, శివకుమారుని కద, మౌనదారి కద వంటివి ఒగ్గు కదలుగా కూడా ఈనాడు ప్రచారంలో కనిపిస్తున్నాయి

ఈ కాలానికి అనుగుణమైన మార్పులు ఈ ఒగ్గు కదను రూపొందించడంలో చాలా జరిగాయి నిడివి బాగా తగ్గింది కేవలం రెండు మూడు గంటలలో కదాగానం ముగిసే విదంగా రూపు చెందింది రేడియో టెలివిజన్లలో కేవలం అరగంటలో ముగిసే విదంగా దీన్ని రూపు చెందించడం మనకు తెలుసు జనగాంకు చెందిన చుక్క సత్తెయ్య అనే ఒగ్గు కదాకారుడు ఈ రంగంలో ఎక్కువగా శ్రమించాడు కదాగానం చేసేటప్పుడు కరుణ, వీరం, శృంగారం వంటి రసాలను ఇతడు బాగా ఒప్పించగలడు మరొక జట్టు నాయకుడు కరీంనగర్ జిల్లా హనుమాజీ పేటకు చెందిన మిద్దె రాములు ఒకప్పుడు కేవలం తెలంగాణాకు మాత్రమే పరిమితమైన ఈ ప్రక్రియ ఈనాడు ఆంద్రదేశమంతటా వ్యాపించడమేకాక జాతీయ, అంతర్జాతీయ వేదికలను కూడా ఆక్రమించి పేరు తెచ్చుకుంది ఈ ఒగ్గు కదా బృందాలు తెలంగాణాలోని అన్ని జిల్లాలలోనూ కనిపిస్తాయి

**హరికద** · గ్రామీణ ప్రాంతాలలో బుర్రకద వలెనే హరికద కూడా చాలా ప్రాచుర్యం పొందిన ప్రక్రియ తమిళదేశంలో దీన్ని కాలక్షేపమనీ, కర్ణాటకదేశంలో కదా ప్రసారాంగమనీ, కేరళ దేశంలో కదా కాలక్షేపమనీ పిలుస్తారు వెనుకటి కాలానికి చెందిన పురాణ ప్రవచన ప్రక్రియకిది ఒక విదంగా నాటక రూపం అని చెప్పవచ్చు దీని పేరును బట్టి ఇది బగవంతుడైన విష్ణువు కద అని అర్దం రూపాన్నిబట్టి యిది యక్షగాన ప్రక్రియకు చాలా దగ్గర కాని యక్షగానంలో వివిద పాత్రలు రంగప్రవేశం చేస్తే హరికదలో ఒక్కడే వివిద పాత్రల అబినయాన్ని చేస్తాడు ఈ రెండు ప్రక్రియలకూ సమానాంశం నాటకీయ లక్షణం

పేరును బట్టి ఈ ప్రక్రియ కేవలం విష్ణు కదల్ని గానం చేసేదే అయినా వీరశైవ, జైన, బౌద్ధ, క్రిస్టియన్, మహమ్మదీయ కదలనే బెదాలు లేకుండా

అన్ని కదల్నీ ఈ ప్రక్రియ ఈనాడు గ్రహిస్తున్నది అంతేకాక రామకృష్ణ పరమహంస, కుసుమ హరనాద, సాయిబాబా వంటి ప్రవక్తలు, గాంధీ, అల్లూరి సీతారామరాజు వంటి రాజకీయ మహాపురుషుల కదలు కూడా హరికదలుగా ఈనాడు గానం చేస్తున్నారు హరికదాగాయకుణ్ణి బాగవతార్ అని కూడా పిలుస్తారు స్త్రీ అయితే బాగవతారిణి అంటారు బాగవతార్ పట్టు దోవతి కట్టుకుంటాడు నడుముకు అంగవస్త్రం బిగిస్తాడు కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటాడు చేతిలో చిరతలు ధరించి ముందుకూ వెనక్కూ అడుగులు వేస్తూ, కద చెప్పడానికి ఉపక్రమిస్తాడు మెడలో పూల దండతో అది నారద వేషాన్ని తలపింప చేస్తుంది పక్క వాయిద్యాలుగా హార్మోనియం, తబలాలు పని చేస్తాయి కొందరు కేవల సంస్కృత బాషలో హరికదలు ప్రచారం చేస్తున్నారు ఆంధ్రదేశంలో హరికద చెప్పే శిక్షణ నిచ్చే కేంద్రాలు చాలా ఉన్నాయి బాగవతారు, (1) రకరకాల పాటల వరసల్ని చతురంగా ఆకళింపు చేసుకుని వాటిని వినిపించడం వల్ల, (2) కదనం నాటకీయంగా నడపడం వల్ల, (3) సహజ సంఘటనలను పౌరాణిక ప్రవచ నంతో కలపడం వల్ల, (4) తానే వివిద పాత్రలుగా కదా గమనంలో లీనం అవడంవల్ల శ్రోతల్ని ఆకట్టుకోగలుగుతాడు కదా గమనంలో, బాగవతారు హాస్య ప్రసంగాలు చేస్తాడు, పిట్ట కదలు చెబుతాడు, పొడుపు కదలు పొడుస్తాడు ఇవన్నీ ఎవరికి వారికే ప్రత్యేకంగా ఉంటాయి ఈనాడు దేవాలయాలు, మతసంస్థలు ఈ కళారూపాన్ని అబిమానించి ఎంతో ప్రోత్సాహాన్నిస్తున్నాయి

సరిగా చెప్పగలిగే కదకుడు ఈ కళారూపంతో ఒక నాటకాన్నే రంగం మీద సృష్టించగలడు గతంలో విజయనగరానికి చెందిన ఆదిబట్ల నారాయణ దాసు అనే హరికదకుడు ఈ హరికదా ప్రక్రియకు ఒక పారమ్యాన్ని కలిగించాడు సంగీతం, నృత్యం, నాట్యం అన్నీ కలగలిపిన ఈ ప్రక్రియ ఈయన చేతిలో ఎంతో ఔన్నత్యాన్ని సాదించింది

**రుంజలవారు** రుంజలవారు కూడా కదాగానం చేసేవారే వీరు వాయించే చర్మ వాద్యం పేరు రుంజ ఆ పేరు మీదనే వీరు పిలువబడుతున్నారు విశ్వ కర్మ వల్ల ఉద్బవించిన అయిదు కళాకార కులాల్లో వీరిది ఒకటి వీరు శైవులు

శివ ప్రాధాన్యమైన కదల్ని వీరు గానం చేస్తారు అందులో పార్వతీ కళ్యాణం, మూలస్తంభం, పంచముఖ బ్రహ్మావిర్భావం అనే కదలు ముఖ్యమైనవి చివరి కదలో ప్రపంచం పుట్టుక, సృష్టి, కమ్మరి, వడ్రంగి, కంచరి, శిల్పి, కంసాలి వంటి కులాల పుట్టుక వర్ణింపబడతాయి మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వబ్రాహ్మలు పై అయిదు కులాలకు మూల పురుషులని వారు చెబుతారు రుంజల వారు పై అయిదు కులాల వారి దగ్గర యాచించి జీవన బృతిని సంపాదించుకుంటారు అది ఒక రకంగా వారికి వంశపారంపర్యంగా వచ్చే ఆచారం ఆయా సందర్భాలలో అయిదు కులాల పుట్టుకను, అబివృద్ధిని గూర్చి కదాగానం చేయడం వీరికి విధాయక కృత్యం కద చెప్పేటప్పుడు రుంజను వాయిస్తారు ఈ వాద్యం సర్వసాదారణంగా శివాలయాలలో కనిపిస్తుంది దీన్ని ఎంతో చాతుర్యంతో, ప్రతిబావంతంగా వాయించగలిగినవారు ఈనాటికీ రుంజల వారే।

మూడున్నర అడుగుల పొడవూ ఒకటిన్నర అడుగుల వెడల్పూ కలిగిన పెద్ద వాయిద్యం రుంజ ఇది ఒకవైపు మేక చర్మంతో కప్పబడి ఉంటుంది ఈ రుంజ ముఖం ఇనుము, కంచు, ఇత్తడి వంటి లోహాలతో ఒక చట్రంగా అమర్చబడి ఉంటుంది దీన్ని వాయించేవాడు రెండవ వైపును, తన చరణాల మీద మోపుకుని ముఖాన్ని శ్రోతల వైపుకు ఏటవాలుగా వంచి ఏర్పాటు చేసుకుంటాడు తన చేతి వేళ్ళతోగాని, రకరకాల పుల్లలతోగాని, ముఖాన్ని తాటిస్తూ వివిధ శబ్దాలను ఉత్పన్నం చేస్తాడు

ఈ వాయిద్యం రుంజల వాళ్ళకు పవిత్రమైనది దీని పుట్టుకను గురించి కద ఉంది పార్వతీ పరమేశ్వరుల వివాహవేళ, సరియైన వాద్యం లేదని అందరూ గ్రహించారంటారు అప్పుడు దేవతల శిల్పి అయిన విశ్వకర్మ ఒక పదకం ప్రకారం వాయిద్యాన్నొకదాన్ని సృష్టించడానికి పూనుకున్నాడు రుంజకుడు అనే ఒక రాక్షసుణ్ణి ఆ శిల్పి చంపి అతని చర్మం, నరాలు, కోరలు మొదలైన వస్తువులతో ఈ వాద్యాన్ని తయారు చేశాడు అంతవరకూ వాడుకలో ఉన్న 32 రకాల వాయిద్యాల ధ్వనుల్ని ఈ వాద్యంలో పలికించగలగడం దీని ప్రత్యేకతగా అతను ఉద్ఘోషించాడు అంతేకాక ఏడు రకాల తాళాలు కూడా ఇందులో వినిపిస్తాడు

దీన్ని నైపుణ్యంతో వాయించే కళాకారులు ఉభయగోదావరి, శ్రీకాకుళం, కడప, నల్గొండ, గుంటూరు జిల్లాలలో ఎక్కువ ద్రాక్షారామానికి చెందిన పాలలోచనుడు, ఏలూరు వాసి సత్యనారాయణ, నల్గొండ జిల్లా గోనెబోయిన పల్లికి చెందిన బ్రహ్మానందం, ఇంద్రసేన, వైకుంఠం ప్రభృతులు ఈ వాద్య కళలో ప్రసిద్ధి వహించినవారు

**బజన పార్టీలు** · బక్తి పారవశ్యంలో మైమరచి జనులు గుంపులు కట్టి భగవంతుని స్తుతిస్తూ చేసే నామ సంకీర్తనమే బజన పురాణాలలో నారదుడూ, ప్రహ్లాదుడూ ఈ స్తుతి గానం చేసేవారు వైష్ణవ సంప్రదాయంలో బక్తిని మదుర మార్గంగా మలచిన ప్రవక్త చైతన్యప్రబువు ఆయన వీదుల వెంట, బక్తి పరవశుడై పాటలు పాడుకుంటూ తిరిగేవాడు ఒక మనిషి పాడుతూ ఉంటే, చుట్టూచేరిన అనుయాయులు, ఆ పాటను ఆవర్తించడం ఈ బజన ప్రక్రియలో ముఖ్యం కంచు, ఇత్తడి, మొదలైన లోహాలతో తయారు చేసిన తాళాలు కానీ, చెక్కతో చేసిన చిడతలు కానీ ఒక చేతిలో దరించి, తమ పాట కనుగుణంగా లయబద్ధంగా చప్పుడు చేస్తూ ఈ భజనను కొనసాగిస్తారు రాత్రిపూట, తెల్లవారే వరకూ ఈ కార్యక్రమం సాగుతుంది ఒక్కొక్కసారి బజన సమూహం దారి వెంట ఊరేగింపు వలె సాగుతూ, ఒక్కోచోట ఆగి, వలయాలుగా ఏర్పడి కొంతసేపు సంకీర్తనం చేస్తారు ఆ పైన తిరిగి ముందుకు సాగిపోతుంటారు సాదారణంగా పండుగలప్పుడు ఈ బజన సమూహాలను పిలిపించి వారిచేత ఈ ప్రక్రియను ప్రవర్తింప చేయడం కద్దు ఒక్కొక్కసారి తీర్థయాత్రలు చేస్తూ పుణ్య క్షేత్రాలను దర్శించే బక్తులు కాలినడకన బజన చేసుకుంటూ ముందుకు సాగిపోవడం జరుగుతుంది త్యాగరాజు, రామదాసు, నరసింహదాసు, నిట్టల ప్రకాశదాసు, తాటంకం వెంకటదాసు వంటి బక్తులు రచించిన కీర్తనల్ని బజన కూటాలలో ఇప్పటికీ పాడుతుంటారు

**గంగిరెద్దులవారు** గంగిరెద్దులవారు ఎడ్లను తర్ఫీదు చేసి వాటిచేత పలురకాల విన్యాసాలు చేయిస్తారు కర్నాటక రాష్ట్రంలో వీరిని 'గంగెట్టిన వారు' అనిగానీ, 'బసవణ్ణ' లని గానీ పిలుస్తారు ఆవుల్ని కాచే గొల్లలలో ఇది ఉపకులం వీళ్ళు తమ యెడ్లను బాగా అలంకరిస్తారు దొరలు, జమీందార్లు దనవంతులు మెచ్చి యిచ్చిన పలురకాల, రంగురంగుల చీరెల్ని పంచెల్ని ఎడ్ల

మూపుల మీద నుండి అటూ ఇటూ పక్కలకు వేలాడదీస్తారు మెడల్లో రకర కాల పూలదండల్ని పూసల దండల్ని నింపుతారు కొమ్ములకు రంగురంగు గుడ్డ పటకాలను కడతారు ముఖాన బొట్లు పెడతారు తాము కూడా, తలపా గా, ముందుకు రెండు భుజాల మీద నుండి జారే కండువా, పంచె, అంగర ఖాలు ధరిస్తారు

ఎద్దుల్ని చిన్న చిన్న దూడలుగా ఉన్నప్పటి నుండీ వీళ్ళు తరిఫీదు ఇస్తారు తాము చెప్పిన విన్యాసాలు చేసే దాకా వాటికి వాళ్ళు ఇచ్చే శిక్షణ చాలా కఠినంగా ఉంటుంది కొట్టడం, తిండి పెట్టక మాడ్చడం వంటివి ఆ శిక్షణలో బాగాలు ఆరునెలల నుండి ఒక సంవత్సరం వరకూ యీ రకమైన శిక్షణ కొనసాగుతుంది జోడు ఎడ్లను ప్రదర్శనకు కొనిపోయినప్పుడు వాటిని రామలక్ష్మణులని పిలుస్తారు వీళ్ళకు వాయిద్య సహకారం ఉంటుంది ప్రద ర్శన నిర్వహించేటప్పుడు డోలు మోతలు, సన్నాయి నొక్కులు, తప్పెక ఉంటాయి తన యజమాని మాటలతో సూచన లిస్తుండగా, మోగుతున్న వాయిద్యాల సంగీతానికి అనుగుణంగా గంగిరెద్దు అడుగులు కదుపుతూ ప్రద ర్శనను నిర్వహిస్తాయి తల ఊపడం, తలను వంచి వినయాన్ని ప్రదర్శిం చడం, నాలుగు కాళ్ళు ఒక్కచోట, ఒక్కొక్కసారి ఒక పళ్ళెంలో చేర్చడం వంటి విన్యాసాలని ఇవి చేస్తాయి దాతల గుణవర్ణన చేస్తూ, యజమాని, "అయ్యగారికి దండం పెట్టు" అని ఆదేశించినప్పుడు అవి తల నేలకు వంచి నమస్కారం చేస్తాయి సంక్రాంతి పండుగ దినాలలో గంగిరెద్ల ప్రదర్శ కులు, ఒక గ్రామాన్నుండి మరొక గ్రామానికి పయనిస్తూ దొరలను యాచించి పొట్టపోసుకుంటారు గుడ్డలు, నాణెములు, బియ్యం వేటినైనా స్వీకరిస్తారు ఒక్కొక్కప్పుడు ఎడ్లను పవిత్రమైన వాటినిగా చేసేందుకు వాటి ముఖాన ఒక పెద్ద కన్నులాగా అలంకరిస్తారు యజమాని మాటలకు తల ఊపుతూ, వానికనుగుణంగా ఉండే ఎద్దును గూర్చి తెలుగులో ఒక సామెత ఉంది గంగి రెద్దులాగా తన యజమాని మాటలకు తలవూపి అదే విధంగా చేసే వ్యక్తిని 'డూడూ బసవన్న' లేక 'గంగిరెద్దులాగ తలవూపేవాడు' అని అంటారు ఇంకా అనేక రకాలైన బట్టలు ధరించి అలంకరించుకునే వానిని 'గంగెద్దులాగా వేషం' వేసుకున్నావని గేలి చేస్తారు

**బుడుబుడుకులవారు** వీళ్ళు సంచార జీవితానికి అలవాటు పడ్డ యాచకులు వీళ్ళను రామజోగులని కూడా పిలుస్తారు చేతిలో చిన్న డక్కను ధరించి ఇంటింటి ముందూ ఆగి, కించిత్ గాన యుక్తంగా వీళ్ళు బూత బవిష్యత్ వర్తమానాలను చెబుతారు వీరి చేతిలోని డక్క చాలా చిన్న చర్మ వాయిద్యం దానికి అటూ ఇటూ పూసల కుచ్చు కలిగిన తాళ్ళను అమర్చడం వలన, వాళ్ళు చేతిని చాతుర్యంతో కదిపినప్పుడు, ఆ డక్క మదుర గంబీరమైన నాదాన్ని వెలువరిస్తుంది 'బుడుబుడుక్' అనే ఆ శబ్దం వల్ల వాళ్ళు బుడుబుక్కల వారుగా పిలవ బడ్డారు వాళ్ళు సాదారణంగా రాత్రి 3 గంటల నుండి ప్రొద్దుట 6 గంటలలోపు తమ సంచారాన్ని ముగించుకుని వెళ్ళిపోతారు ఇంటింటికీ శుభాశుబ పలాలను చెప్పి, అశుబాలను ఎట్లా తొలగించుకోవాలో, ఆ ఉపాయాలు కూడా చెప్పడం వీరి దిన చర్య వీళ్ళ భవిష్యద్వాణి మీద గ్రామీణులు ఎంతో నమ్మకాన్ని కలిగి ఉంటారు అందువల్ల వీళ్ళకు 'దర్మం' బాగానే లబిస్తుంది భవిష్యత్తును చెప్పే యీ విద్యను, వీళ్ళు చీకటి రాత్రులలో శ్మశానాలలో ఉండి, దీక్షతో నేర్చుకుంటారని వాడుక శకున పక్షి అనే పేరుపడ్డ పక్షి వీళ్ళకీ విద్యను నేర్పుతుందట వీళ్ళకు పక్షిబాష క్షుణ్ణంగా తెలుస్తుందని జనుల నమ్మకం

తలమీద పాగా, నల్లని కోటు, బుజాలమీద నుండి కిందికి వేలాడే రంగురంగుల గుడ్డలు, వీళ్ళను కొంత వింత రూపంలో ప్రదర్శిస్తాయి అందుకే ఎవరైనా రంగు రంగుల గుడ్డల్ని వేసుకున్నప్పుడు, 'ఏమిటీ బుడబుడక్కుల వేషం' అని ఎగతాళి చేయడం వినిపిస్తుంది కర్నాటక రాష్ట్రంలో వీరిని "బుడబుడకాయవారు" అని పిలుస్తారు ఆదునిక కళా రంగంలో బుడబుడకుల వేషం కళాకారులకు చాలా ప్రీతిపాత్రమైన వేషం శనిదేవతను అర్చించే నూనె గుడ్డల వారివలె, వీరుకూడా మహారాష్ట్రం నుండి ఆంధ్రదేశానికి వలస వచ్చినవారని కొందరు బావిస్తారు

**కాటిపాపలు** శ్మశానాల్లో, చితులకు కాపలాకాసే జాతికి చెందినవారు కాటిపాపలు ఈ మాటకు గల అర్థం "శ్మశాన సంతాన" మని నిజానికి కాటి కాపరులు అనే మాట కాటిపాపలుగా రూపాంతరం చెంది ఉండవచ్చు హరిశ్చంద్రుడు, కాశిలో, తన్ను తాను అమ్ముకున్న యజమాని వీరబాహుడు అతడు

కాటికాపరి ఈ వీరబాహుడే తమ వంశ పురుషుడని వీళ్ళు చెప్పు కుంటారు హరిశ్చంద్రుడు కూడా మా కులపురుషుడేనని వీరు చాటుకుంటారు అందు వల్ల, కాటి కాపరిగా రూపాంతరం చెందిన హరిశ్చంద్రుడు, పుత్ర వియో గంతో రోదించే చంద్రమతి, ఒడిలో చనిపోయిన రోహితుడు, దున్నపోతును ఆరోహించిన యమదర్మరాజు – వీరందరి బొమ్మలు, కాటికాపరుల శిరోవేష్ట నాలమీద అలంకరింపబడి ఉంటాయి వెనక కాలంలో వీళ్ళ వృత్తి శ్మశానా లలో జరిగే కార్యక్రమాన్ని నిర్వహించడం, 'చావు సుంకం' వల్ల పొట్టపోసు కోవడం శవం శ్మశానాన్ని సమీపిస్తుంటే, పాడెకు ముందు కొమ్ములు, శంఖాలు ఊదుకుంటూ నడవడం, తాళాలు వాయించడం వీరు చేసేవారు శవ దహ నానికి ముందు, మృతుని బందువులనుండి కాటి సుంకాన్ని వసూలు చేసే వారు రానురాను వీళ్ళ వృత్తిలో మార్పువచ్చింది శ్మశానాన్ని కాపలా కాయడం కాక, గ్రామ గ్రామానికీ నిర్ణీత సమయాల్లో తిరిగి యాచించడం వీళ్ళు అల వాటు చేసుకున్నారు అంతేకాక ఇంద్రజాలం, గారడీ వంటీ విద్యా ప్రదర్శ నలు చేయడం వలన పొట్టపోసుకోవడం నేర్చుకున్నారు

వీళ్ళ వేషదారణ సర్కసులో బఫ్ఫూన్ల వేషదారణ వలె చిత్ర విచి త్రంగా ఉంటుంది రంగురంగుల గుడ్డపీలికలు అతికిన పొడవాటి అంగరఖా తొడుక్కుంటారు మెడ నుండి పాదందాకా అది శరీరాన్ని కప్పుతుంది మెడలో రుద్రాక్ష దండలు వేసుకుంటారు చంకలో జోలె ఉంటుంది జోలెలో గారడీ, ఇంద్రజాల ప్రదర్శనకు అనువైన వస్తువులుంటాయి చెక్క బొమ్మలు, ఇత్త డితో చేసిన దేవతా ప్రతిమలు, మేకులు, వెండి నాణేలు, గవ్వలు, రాళ్ళు, ఇనపగుళ్ళు, పసుపు మొదలైన వస్తువులుంటాయి చేతిలో బొనుగు అని పిలవబడే గంట ఉంటుంది దాని శబ్దం కొంత కర్ణకఠోరంగా ఉంటుంది చేతిలో పెద్ద ఎముకను దరించి మంత్రదండంగా వాడు కుంటారు నుదుట రూపాయంత బొట్టు పెట్టుకొని చూడడానికి బయాన్ని గొలిపే విదంగా ఉంటారు చూడడానికి వింతకొలిపేది వీరు తలల మీద దరించే తలపాగ వంటిది ఇత్తడి చట్రానికి ఒక అడుగు పొడుగూ రెండంగుళాల వెడల్పాగల పొడవైన పల్చటి రేకులు తాపడమై కిరీటాకారాన్ని కలిగి ఉంటాయి వాళ్ళు దరించిన తలపాగా పైన ఈ కిరీటాన్ని అమర్చుకుంటారు మసి, కుంకుమ చుక్కల్ని

ముఖం మీద పెట్టుకుని చూడడానికి కొంత బయాన్నీ, కొంత విస్మయాన్నీ వీళ్ళు కలిగిస్తుంటారు

ప్రదర్శనలిచ్చేటప్పుడు, నోటినుండి రాళ్ళు, ఇనపగుళ్ళు రప్పించడం, గవ్వలు తీయడం, గవ్వల్ని వెండి నాణాలుగా మార్చడం, ఆ నాణేలను చుట్టూ ఉన్న ప్రేక్షకుల చేతుల్లో పోయడం, వాటిని తమ మంత్రదండాన్ని తిప్పి, తేళ్ళుగా, కప్పలుగా మార్చడం ఇటువంటి అద్భుత చర్యల్ని చేస్తారు గాలిలో చేతులు తిప్పి చెక్కబొమ్మల్ని తెప్పిస్తారు ప్రదర్శన సమయంలో బూతుపాటల్ని పాడతారు బూతు సంబాషణల్ని నడుపుతారు చివరకు దేవతా ప్రతిమల్ని గాలిలోనుంచి సృష్టించి, చూపరుల్లో బయాన్నీ, బక్తి బవాన్నీ కలిగిస్తారు చుట్టూ ఉన్న వారిని యాచించి నాణేలను పోగు చేసుకుంటారు

గుంటూరు, తెనాలి మహబూబునగరం, జహీరాబాదు, షంషాబాదు ఊర్ల సివార్లలో వీరు నివసిస్తుండడం మనం గమనించవచ్చు గుంటూరులో జరిగిన జానపద కళోత్సవాలలోనూ, వరంగల్‌లో జరిగిన ఆంధ్రప్రదేశ్ ఇంద్రజాలోత్సవాలలోనూ కాటిపాపలు తమ విద్యను ప్రశంసనీయంగా ప్రదర్శించారు రోజురోజుకు వీరు ప్రదర్శనలు ఇవ్వడం తగ్గుముఖం పడుతూ ఉంది ఈ కళను వదులుకుని వీరు రకరకాల ఉద్యోగాలలో కుదురుకుంటున్నారు

**బహు రూపులు** జానపద కళాకారులు చేపట్టిన మరో ప్రక్రియ బహురూపం దీన్ని ప్రవర్తింప చేసేవాళ్ళు బహు రూపులు సాదారణంగా పాట, ఆట తెలిసీ అన్ని పాత్రలకూ సంబాషణ నెరపుకొనే, ఒకడే దీన్ని రంగం మీద నిర్వర్తిస్తాడు కాకతీయ సేనాదిపతి జాయప తాను రచించిన నృత్త రత్నావళిలో దీన్ని ఈ విదంగా వివరించాడు

"ఒక్కడు నిర్వహించే యీ ప్రక్రియలో, ఆ నిర్వాహకుడికి ఈ క్రింది లక్షణాలు ఉండాలి వాడు మంచి బావుకుడై ఉండి కవితాత్మ కలిగిన వాడు కావాలి ఇతరులను పొగిడే కళలో ప్రవీణుడు కావాలి కళలను విమర్శన దృష్టిలో చూచేవాడై ఉండాలి యువకుడై, నాతిలంబ దేహుండూ, నాతి వామనుడూ అయి అందగాడుగా ఉండాలి బహుబాషా ప్రావీణ్యం సంపాదిం

చి, బలిష్ఠమైన దేహమూ దృఢమైన మనస్సూ కలిగి, అలిసిపోని వాడుగా ఉండాలి ఆశువుగా దెన్నైనా వాచ్యం చేయగలిగి, పాడగలిగి, త్వరత్వరగా ప్రసాదనాన్ని మార్చుకునే వాడై చురుకుతనం కలిగి ఉండాలి అటువంటి వాడు ప్రేక్షకులను ఆనంద వినోదాలలో ముంచెత్తగలడు నాట్య లక్షణాలను నిర్వచించే లక్షణ గ్రందాలలో జానపద దృశ్య ప్రక్రియలను పేర్కొనడం, దేశ్య దృశ్య కళలను నిర్వచించడం కనిపిస్తుంది '

## అనుబంధం - 1

# యక్షగానం

కుందుకూరి రుద్రకవి రచించిన సుగ్రీవ విజయాన్ని (1568) మొదటి యక్ష గానంగా పలువురు బావిస్తున్నారు కాని చక్రపాణి రామవాచారి రచించిన విప్రనారాయణ చరిత్ర (1545) దానికంటే మొదటిది మద్రాసు ప్రాచ్య తాళ పత్ర గ్రందాలయంలో (డి నెం 1939) విప్రనారాయణ చరిత్ర ప్రతి ఒక్కటి మాత్రమే ఉంది మెకంజీ దీన్ని సంపాదించాడు ఇందులో కొన్ని పేజీలు శిది లాలు 1, 3 పేజీలు లేవు మిగిలిన గ్రందమంతా బాగానే ఉంది

వైష్ణవ బక్తవరుడైన విప్రనారాయణుడి మీద అల్లబడిన కద యిది ఈయనకు గల మరో పేరు తొండరడిప్పొడి యాళ్వార్, ఒక వైష్ణవ బక్తుడు దేవదాసి ప్రేమలో పడిన ఇతివృత్తం ఇందులో ఉండడం వలన, ఈ యక్ష గానంలో ప్రేమకూ, వైరాగ్యానికి, బక్తికీ, చిత్రీకరణావకాశం పుష్కలంగా లబించింది దీని తరువాత తంజావూరు ప్రబువైన విజయరామవ బూపా లుడూ, ఉత్తర రంగకవీ ఈ కదనే గ్రహించి యక్షగానాలు రచించారు ఉత్తర రంగకవి రచించింది బక్తాంఘ్రి రేణుచరితం ఇది ముద్రింప బడలేదు

విప్రనారాయణ చ్చరితాన్ని చక్రపురి రామవాచార్యుడు రచించాడని ప్రత్య క్షంగా తెలియక పోయినా, అతను రచించిన యితర గ్రందాలతో పోల్చడం వల్ల ఆ విషయం నిర్దారింప బడగలదు అంతే కాక, విప్రనారాయణ చరిత్రలో దొడ్డయాచార్య అనే తన గురువును కవి పేర్కొనడం జరిగింది రామవాచా ర్యుని గురువు దొడ్డయాచార్యుడే

**కద** గురు స్తుతితో కద ఆరంబమౌతుంది ప్రముఖ గురు స్థానాన్ని అదిరో హించిన, 74 మంది గురువులలో తన గురువు ఒకరని కవి ఆయనను స్తుతిం చడం జరిగింది తరువాత ఘటికాచలం (షోలింగర్) లో కొలువై ఉన్న

నరసింహస్వామిని కవి ప్రస్తుతించి, దశావతార మహాత్మ్యాన్ని కీర్తించి, శ్రీహరి దుష్టశిక్షణ, శిష్టరక్షణ సామర్థ్యాన్ని కొనియాడి, కదా రచనకు పూనుకోవడం జరిగింది

కదంతా ఎక్కువగా పాటలలో అల్లబడ్డది విప్రనారాయణుడు, తొలుత బగవంతుడైన శ్రీహరి తన మెడలో తాల్చిన వనమాల మండంగుడి అగ్రహారంలో బక్త దంపతులకు జనించిన వాడు విప్రనారాయణుడు ఆయనకు చిన్ననాటినుంచీ రంగనాదునిపై బక్తి ఉపనయన సంస్కారాన్ని స్వీకరించిన తరువాత విప్రనారాయణుడు శ్రీరంగనాదునిపై మనసు నిలిపి ఆయన సేవల యందే తన జీవితాన్ని వెచ్చించడానికి పూనుకున్నాడు ఆలయారామంలోని పూల తోటను చూసుకుంటూ, ఆ పువ్వులతో మాలలు చేసి రంగడి కర్పించడంలో నిమగ్నుడై ఇహలోక సుఖాల మీద వైముఖ్యం పెంచుకుని అంతర్ముఖత్యం అలవరించుకున్నాడు దేవదేవి శ్రీరంగని పట్టణంలో పేరు గన్న వేశ్య ఆమె తల్లి విటకంటకిగా పేరు పొందిన చతురురాలు దేవదేవి సౌందర్య ఖని బ్రహ్మ సృష్టికే గర్వ కారణంగా వెలసిన అందాల బొమ్మ ఆమె అందం ఈ పుస్తకంలో మూడు గేయాలలో వర్ణితమైంది తర్వాత ఆమె ప్రసాదన చర్య వివరింపబడ్డది మనో మోహనకరంగా అలంకరించుకుని తన చెల్లెలూ,చెలికత్తెలూ వెంట రాగా చోళ రాజు ఆస్థానానికి బయలు దేరింది అక్కడ సంగీత లహరిలో ఆస్థానాన్ని ఓలలాడించి రాజు చేతి నుంచి సప్తాంగ ప్రదానాన్ని అందుకుని తిరిగి వస్తూ, విప్రనారాయణుడు ప్రేమతో పెంచుకుంటున్న పూల తోటలో ప్రవేశించింది మనోహర సుమ పరిమళాలూ, శీత వాత పోతాల పరామర్శా, వాళ్ళను ఆనందంలో ముంచెత్తి ఆలసటను పోగొట్టాయి శ్రీరంగని కరుణా కటాక్షాలను కురిపిస్తున్నట్లు, మానవ జీవితాలను దన్యం చేస్తున్నట్లు, ఆ తోట వారిని సమాదరించింది ఆ తోట మద్యలో ఒక ఋషివలె, పూల చెట్లకు పాదులు కడుతూ, నీళ్ళు మళ్ళిస్తూ, శ్రీరంగ నామం జపిస్తూ, అన్యం మరచి, బగవచ్చింతనలో మునిగి ఉన్న విప్రనారాయణుణ్ణి దేవదేవి చూసింది తనను ఆ బక్తుడు గుర్తించలేదనీ, తన అందాన్ని లెక్క చేయలేదని మండి పడ్డది సోదరి దేవిని చల్లబరిచే ఉద్దేశ్యంతో, శ్రీరంగని బక్తుడైన ఆ మహాపండితుని దర్శన మాత్రం చేత పాపాలు తొలగి పోతాయనీ, ఆయన పట్ల ఆగ్రహం తగదనీ మందలించింది

మహామహులైన పరాశరుడు వాల్మీకి, శుకుడు, కౌశికుడు వంటి వారె కాంతా దాసులు కాగా ఈ బడుగు బాపని లెక్కేమిటని ఎగిరి పడ్డది దేవదేవి ఈతని తన పాద దాసుణ్ణి చేసుకోక పోతె, జన్మాంతమూ నీకు దాస్యం నెరు పుతానని సోదరితో పంతం కట్టింది

తరువాత, తానొక బీదరాలి వేషం కట్టి, సన్యాసిని వేషంలో, రంగనా మాన్ని ఉచ్చరిస్తూ, దుఃఖిస్తూ విప్రనారాయణుని అడుగుల మీద పడి, తన మనస్సుకు శాంతి కలగడానికై తనను, శిష్యరికం చేయనిమ్మని మనస్సు కరిగేటట్లు ప్రార్థించింది విప్రనారాయణుడు, ఆమె తనతో పాటు తోటలో నివ సించడానికి అంగీకారం తెలియజేశాడు కాలం గడిచిన కొద్దీ విప్రనారాయ ణుని మనస్సు దేవదేవి పట్ల ఆకర్షితం కాసాగింది ఒక రాత్రి వేళ, తీవ్ర వర్షోద్ధతిలో, దేవదేవి తప్ప తడిసి, చెట్టు కింద వణుకుచు నిలుచుండగా, విప్రనారాయణుడు దయదలచి, ఆమెను తన చెంగటకు పిలుచుకుని, ఆమె ఆకర్షణలో శలభంలా చిక్కుకు పోయాడు మనస్సులో ప్రతిష్ఠితమైన శ్రీరం గని సుందరమూర్తి, స్థానంలో దేవదేవి మనోహర రూపం నెలకొల్పబడ్డది భగత్కైంకర్యాన్ని మరచి, విప్రనారాయణుడు దేవదేవి సదనానికి చేరుకుని అక్కడ ఆమె శృంగార ప్రవాహంలో తల మున్కలు కాసాగాడు నిర్ధనుడైన సన్యాసి వంటి వానిని తన కూతురు చేపట్టి, తదేకంగా ఉండడం వేశ్యమా తకు గిట్టలేదు ఆమె అతణ్ణి బయటకు వెళ్ళగొట్టింది బయట, వనంలో, దేవదేవి మీది మోజులో విప్రనారాయణుడు వియోగదుఃఖాన్ని అనుభవించ సాగాడు దేవదేవి కూడా, తొలుత ఒక ఆటగా ఈ నాటకాన్ని మొదలు పెట్టినా తరువాత విప్రనారాయణుని మీద నిజమైన ప్రేమ ఆమెకు కలిగింది కాని తల్లి మాట దాట లేక, ఆమె కూడా, అతని యెడబాటుకు దుఃఖపడసాగింది వైకుంఠంలో లక్ష్మి దేవి కొలువందుకుంటున్న విష్ణుమూర్తి యిది గమనించి, చిరునవ్వు ముఖం మీద వెలయగా, తన భక్తుని గురించి ఆలోచించ సాగాడు లక్ష్మిదేవి ఆ నవ్వును చూసి, కారణం అడిగింది ఆమె భక్తుని పతనాన్ని తెలుసుకుని, జాలి చెంది, అతణ్ణి కాపాడమని కోరగా, విష్ణుదేవుడు ఒక నాటకం ఆడదలచి, తాను చిన్న పిల్లవాడై భూమి మీదికి వచ్చాడు వచ్చి ఒక బంగారు గిన్నెను దేవదేవి తల్లికి, విప్రనారాయణు డిచ్చినట్లుగా ఇచ్చి

తిరిగి, తన భక్తుణ్ణి అక్కడికి తోడి తెచ్చి దేవదేవి, విప్రనారాయణుల మధ్య సందానకర్తగా వ్యవహరించి వారికి సంతోషాన్ని కలిగించాడు

కాని తెల్లవారి, అర్చకులు, స్వామి గుడిలో బంగారు పాత్ర లేకపోవడంతో తత్తర చెంది అన్ని చోట్లా వెతికించారు చివరకు, దేవదేవి యింట్లో పాత్ర దొరకగా, విప్రనారాయణుడు, దేవదేవి నిందుతులుగా చోళరాజు ఆస్థానంలోనికి కొనిరాబడ్డారు రాజు విప్రనారాయణుణ్ణి దొంగగా నిర్ధారించి తీర్పు చెప్ప బోయేంతలో, శ్రీరంగడు న్యాయస్థానంలో సాక్షాత్కరించి, బంగారు పాత్ర త నదనీ, తన సొత్తును, తన బిడ్డ అయిన విప్రనారాయణుడు వాడుకోవడంలో దోషం లేదనీ, తండ్రి ఆస్తికి కుమారుడే హక్కుదారుడనీ, దర్మ సూక్ష్మం విప రించాడు సాక్షాత్తూ భగవంతుని చేత బిడ్డగా గ్రహింపబడిన విప్రనారాయ ణుణ్ణి అందరూ కొనియాడి పూజించారు కాని ఆయన మాత్రం తనని తాను "తొందరడిప్పొడి"గా, అనగా భక్తాంఘ్రి రేణువుగా వ్యవహరించుకున్నాడు అందువలన పన్నిద్దరు వైష్ణవ ఆళ్వారులలో, ఈయన తొండరడిప్పొడి ఆళ్వారుగా ప్రసిద్ధి చెందాడు

ఈ యక్షగానం చివరకు అందరికీ శుభాలు కలగాలనే మంగళా శాసనంతో ముగుస్తుంది

## అనుబంధం -2

# జానపద గేయాలు

### 1

(స్త్రీ హృదయ మెప్పుడూ భర్త క్షేమాన్ని కోరుతుందని చెప్పే గేయ మిది)

*నీలమ్మ నీ మగడు నిన్నేలడమ్మ*
*ఏలకుంటె మానె ఎదురుంటె చాలు*
*సాకకుంటే మానె సల్లగుంటే చాలు*
*కంసల వారి మట్టెలు కాల్నుంటె చాలు*
*సెట్టివారి గాజులు సేతనున్న చాలు*
*పరమేశు డిచ్చిన పసుపు కుంకుమలు*
*నొష్ట కుంకును లుంటె ఇష్టాలు దీరు*
*పసుపు ఒంటీ నుంటె భయమేల నాకు।*

### 2

ఈ క్రింది పాట స్త్రీలు పిండి విసిరేటప్పుడు పాడే పాట పిండి విసురుతూ, దొరికిన తన భర్తనూ, సంసారాన్నీ, తలపోసుకుంటూ కైగట్టుకున్న పాట యిది మొదటి పాదాలు కొడుకు వేసిన ప్రశ్నగానూ, తరువాతి పాదాలు తల్లి యిచ్చిన జవాబుగానూ రూపొందాయి తరువాతి పాదాలు కోడలడిగిన మాటగానూ, అత్త యిచ్చిన జవాబుగానూ ఏర్పడ్డాయి తరువాత భూదేవి వంటి ఓరిమి కలిగిన స్త్రీ హృదయం ఆవిష్కృతమై మనకు రసానందాన్నీ, కారుణ్యాన్నీ కలిగిస్తుంది

*వానా గొట్టాదాయె వరుదెల్లాదాయె*
*అవ్వా మన వాకిట్లా వరుదెక్కాడీదె*

నువు బోయీ పొరుగింట్లా పంటే నా కొడుకా
నీ యాలీ శోకంబూ వరదాలై పారె!
అత్తారో ఓ యత్తా మై రాసా యత్తా
నీ కొడుకూ నీలకాంతు డేమన్నా డత్తా
కోడలా కోడలా చిన్నా నా కోడాలా
నా కొడుకూ నీలకాంతు నిన్నొల్లడాటా
వల్లకుంటే వలిసేది వల విగ్రమేమీ
రచ్చల్ల పెద బావా మెచ్చిన్నా చాలూ
నా సాటి యారాండ్లు అక్కన్నా చాలూ
నా అత్త మామల్లు సరెనన్నా చాలు
నా సాటి మరుదుల్లు వదినెన్నా చాలూ
యారాండ్ల పిల్లల్లూ అవ్వన్నా చాలూ

3

కొడుకు మర్మము కన్న తల్లికే యెరుక
అడవిలో దిరిగేటి అయ్యకే మెరుక
నాగ స్వరము నాడు నాగన్న కెరుక
తుంగ మడుగులొ పండు తుట్టికే మెరుక
వనము సింగారంబు వాన కోయిల కెరుక
కంపలో నుండేటి కాకికే మెరుక
గందంపు వాసన గాడిదకే మెరుక
వంటలో పాకంబు గంటికే మెరుక
నానారుచులు తిన్న నాలుకా కెరుక

4

(అన్ని చోట్లా, అన్ని వేళలా ప్రేమికులకూ, చందమామకూ విడరాని బందముంది ప్రేమికుడికి చందమామ నెచ్చెలి అతని సంతోషంతో తాదాత్మ్యం చెంది వెన్నెల నవ్వుల్ని కురిపిస్తాడు అతని విచారానికి సానుభూతి చూపిస్తూ,

క్షయించి పోతుంటాడు ఈ క్రింది పాటలో ఒక వదుచు తన విపల ప్రేమ గాదను వెళ్ళబోసుకోవడం కనిపిస్తుంది)

వాడు వలచీ నాడమ్మా నన్ను తలచీ నాడమ్మా //చందమామోయ్//
వాడు వలచీన తెల్లారి పిలిచీన పలుకాడు ,,
వాడు పిక్కల్ల సన్నంపు బిగువైన మగవాడు //చందమామోయ్//
వాడి బుజాన ఉన్నాది బూచక్ర కంబళి ,,
అది పది గళ్ళు భూమిపై పరచీన చాలమ్మ ,,
వాడి మునిపళ్ళ సందున ముత్యాలు తాపిస్తూ ,,
వాడి పక్కాన ఉన్నాది పచ్చాల పిడిబాకు ,,
అది యెదలోన ఒకసారి నాటీన చాలమ్మ ,,
వాడు వలచీన దాకాను వలపోసి తిరిగాడు ,,
వాడు వలచీన తెల్లారి పిలచీన పలుకాడు ,,
వాడు కలలోన నవ్వాడు కన్నెత్తి చూడడు ,,
వాడి కావి పంచెల మీద కస్తూరి దాపిస్తు ,,
వాడి బంగారు చెక్కిళ్ళ రత్నాలు మెరిపిస్తు ,,
వాడి ముద్దైన మోముపై ముత్యాలు విరబోతు ,,
వాడు చూచిన చాలమ్మ స్వర్గమే దరిదాపు ,,
వాడు పలికీన చాలమ్మ ప్రాణాలు వికసించు ,,
వాడు నవ్వూతు మాట్లాడి కవ్వించిపోయాడు ,,
వాడు కోపాన ఒకసారి కసిరి తిట్టీన చాలు ,,
ఆ మగవాని కౌగిటా మరణించినా చాలు ,,

## 5

ఈ క్రింది పాట బావుల్లో నుంచి నీళ్లు చేదుకునే టప్పుడు పాడే పాట పొలాల్లో శ్రామికులు మోటలు కొట్టి, నీళ్ళు మడుల లోనుంచి మళ్ళకు పారించేటప్పుడు ఇటువంటి పాటలు పాడుకుంటారు రైతు శ్రమపడి, ఒళ్ళు వంచి రెక్కలు ముక్కలు చేసుకుని పాటు పడినా, అతనికి లబించే ప్రతిపలం

చాలా తక్కువ అతను దేశానికి అన్నం పెట్టే దాత కాని తనకు మూడు పూటలా తిండి సంపాదించుకోలేని నిస్సహాయుడు గ్రామాధికారులు అతనిపై పెత్తనం సాగించి అతని శ్రమ శక్తిని దోచుకుంటుంటారు వారిని ప్రత్యక్షంగా ఏమీ అనలేక, సంకేత పూర్వకంగా ఈ పాటలో రైతు తన అక్కసును వెళ్ళ గక్కుకుంటున్నవైనం గమనించండి

*ఏటికేతం బెట్టి యెయి పుట్లు బండించి*
*ఎన్నడో మెతు కెరగనన్నా నేను గంజిలో మెతుకెరగనన్నా*
*కాళ్లేయి గడుక్కోని కట్టమీద గూసుంటె*
*కాకి దన్నీ పాయెరన్నా కాకి పిల్ల దన్నీ పోయెరన్నా*
*పోరుకూ చాల్లేక పొయికాడ గూసుంటె*
*పోరి దన్నీ పోయెరన్నా పోరి తల్లి దన్నీ పోయెరన్నా*
*చుక్క పొద్దున లేచి బొక్కెనెత్తుకు పోంగ*
*బొక్క బోర్లా బడితి రన్నా నేను ప్రక్కలిరుగా బడితిరన్నా*
*నాదేటి బ్రతుకాయె రన్నా నేను నాడె చావక పోతిరన్నా*

## అనుబంధం -3

# జానపద కథలు

### కవల పిల్లల కథ

అనగా అనగా ఒక రాజు ఆ రాజుకు ఒక రాణి వాళ్ళిద్దరికీ చాలా కాలం వరకూ పిల్లలు లేరు లేక లేక, ఎన్నో రోజుల తర్వాత రాణికి కవల పిల్లలు జన్మించారు ఇద్దరు మగ పిల్లల్ని, తల్లీ దండ్రీ అల్లారు ముద్దుగా పెంచుకుని, వాళ్ళకు రాముడు, లక్ష్మణుడు అని పేర్లు పెట్టుకున్నారు వాళ్ళకు యుక్త వయస్సు వచ్చాక, పెద్దవాడికి యువరాజు పట్టం కట్టాలని రాజు అనుకుని తన కుమారుడికి చెప్పగా అందుకు అతను ఒప్పుకోలేదు ఒక సంవత్సరం పాటు దేశాటనం చేసి, కొంత లౌకిక జ్ఞానం సంపాదించుకున్నాక, పట్టం కట్టుకుంటానంటే తండ్రి అందుకు వెంటనే అంగీకరించాడు

కవల పిల్లలిద్దరూ, చెరో గుర్రమూ ఎక్కి, కత్తులు చేతపూని, దేశాటనానికై బయలుదేరారు ఒక అరణ్యంలో నుంచి వెళుతుంటే, ఒక చోట రెండు పిల్లల్ని యీని తిండి లేక పడి ఉన్న పులి కనిపించింది కవల పిల్లలు దానికి ఆహారం తెచ్చి యివ్వగా, అది, చాలా సంతోషపడి, తాను ఈనిన పిల్లల్ని చెరొకటి, వారికిచ్చింది ఆ పిల్లల్ని తీసుకుని అరణ్యంలో ప్రయాణిస్తుండగా దారిలో ఒక ఎలుగుబంటికూడా అలాగే కనిపించి, తాను పెట్టిన రెండు పిల్లల్ని చెరొకటి యిచ్చింది ఇద్దరూ ఆ పిల్లలతో సహా అరణ్యంలో బహు దూరం ప్రయాణం చేసి, ఒక పెద్ద మర్రి చెట్టును చేరుకున్నారు ఆ చెట్టుకు ఉత్తరాని కొకటీ, దక్షిణాని కొకటీ వ్యాపించి, విశాలంగా పరుచుకున్న రెండు పెద్ద కొమ్మలున్నాయి ఆ కొమ్మ లెటు పోతున్నాయో తెలీదు వీళ్ళిద్దరూ ఆ కొమ్మలెక్కి చెరో వైపు పోయి, వాటి అంతం కనుక్కోవాలని నిర్ధారించుకున్నారు అయితే ఒక సంవత్సరం అలా తిరిగి, సంవత్సరాంతంలో ఇద్దరూ ఆ

చెట్టు మొదటికి రావాలని సంకేతం ఏర్పాటు చేసుకున్నారు చెట్టు మొదట ఒక తులసి చెట్టును పాతారు ఇద్దరిలో ఎవరు ముందు వచ్చినా ఆ తులసి చెట్టును గమనించాలనీ, అది ఆకులతో కలకల లాడుతూ పచ్చగా ఉంటే రెండవ వాడు నిరీక్షించాలనీ, ఒక వేళ ఆ చెట్టు ఎండిపోయి ఉంటే రెండవ వాడు చనిపోయినట్లు గుర్తించాలనీ, వాడిపోయి ఉంటే, అతను చిక్కుకు న్నట్లు బావించి అతన్ని కాపాడడానికి తగిన చర్యలు తీసుకోవాలనీ నిర్ణయిం చుకున్నారు

రాముడు దక్షిణపు కొమ్మనీ, లక్ష్మణుడు ఉత్తరం కొమ్మనీ యెక్కి ప్రయాణం సాగించారు రాముడు ఆ కొమ్మ మీద ప్రయాణం చేసి చేసి, చివ రకు, తన పులి, ఎలుగుబంటి పిల్లలతో ఒక పెద్ద పట్టణంలో దిగాడు ఆ ఊరి రహదార్లు విశాలంగా ఉన్నా, అక్కడ నర సంచారం లేదు ఇళ్ళ తలుపులన్నీ మూసి ఉన్నాయి ఇది రాముడికి వింతగా అనిపించింది దారిలో ఒక యింటి తలుపు తట్టి విషయం అడిగాడు ఆ ఊరి చివర ఒక పెద్ద రాక్షసుడు కాపురం ఉంటున్నాడనీ, పట్టణం మీద పడి, దొరికిన వాళ్ళని దొరికినట్లు తింటుంటే, రాజు ఆ రాక్షసుడితో, రోజుకు ఒక మనిషిని ఆహారంగా పంపేటట్లు ఒప్పందం చేసుకున్నాడనీ, ఆ రోజు రాజు గారి కుమార్తె ఆహారంగా పోవలసిన రోజు కాబట్టి అందరూ దుఃఖంతో తలుపులు మూసుకుని ఉన్నారనీ ఆ యింటావిడ చెప్పింది రాముడు, ఊరి చివర నున్న రాక్షసుడి దగ్గరకు పోయి, అతనితో యుద్ధం చేసి అతన్ని చంపాడు ఆ రాక్షసుడి నాలుకా, గోళ్ళు కోసుకుని మూట కట్టుకుని, రాక్షసుడికి ఆహారంగా వచ్చిన రాజు కుమార్తెను సమాశ్వ సించి యింటికి పంపించాడు

తర్వాత ఒక చాకలి వాడు బట్టలుతకడానికి అక్కడికి వచ్చి, చచ్చిన రాక్షసుణ్ణి చూసి, వాడిని తానే చంపినట్లు రాజు గారికి నిండు కొలువులో చెప్పాడు రాజు అంతకుముందే, రాక్షసుణ్ణీ చంపిన వాడికి తన కూతుర్నిస్తానని చాటింపు వేయించి ఉండడం వల్ల, ఈ చాకలికి తన కూతురిని ఇవ్వడానికి నిశ్చయించుకున్నాడు రాజకుమారి మాత్రం రాక్షసుడిని చంపినవాడు ఇతడు కాడని అంటున్నా, చంపిన వాడు ఎవరో తేలక పోవడం వలన రాజుకు ఏం చేయడానికీ వీలుకాని పరిస్థితి ఏర్పడ్డది అప్పుడు రాముడు, నిండు కొలు

వుకు వచ్చి తన దగ్గరున్న ఆనవాళ్ళు చూపించి రాజకుమార్తెను వివాహం చేసుకున్నాడు అబద్ధమాడి మోసగించినందుకు చాకలివాడిని రాజభటులు సున్నపురాళ్ళలో విరబోశారు

రాముడికి ఒకనాడు వేటాడాలని కోరిక పుట్టి మామగారిని అడుగగా ఆయన, ఉత్తర దిశకు పోవద్దని చెప్పి పంపించాడు రాముడు కుతూహలం అణచుకోలేక ఆ దిశనే పోగా, ఒక అడవి పంది కనిపించింది దాన్ని తరుము కుంటూ, ఒక బయలు ప్రదేశం లోకి వచ్చాడు అక్కడ అంతా రాళ్ళు ఎండి పోయిన చెట్టు చివరి కొమ్మన ఒక ముసలిది వడవడ వణుకుతూ, కూర్చుని ఉంది రాముడు ఆమె స్థితికి జాలిపడి అక్కడ కనిపించిన చితుకులేరి, నిప్పు రాజేసి, అవ్వను కిందకు దిగి వచ్చి చలి కాచుకోమన్నాడు అవ్వ, రాముడి దగ్గరున్న పులి, యెలుగుపిల్లలకు బయపడుతున్నట్లుగా నటించి ఒక బెత్తాన్ని కిందికి విసిరింది ఆ బెత్తంతో చిన్నగా, ఆ జంతువుల్ని కొట్టి మందలిస్తే తాను దిగి వస్తానన్నది అందులో మర్మం తెలియని రాముడు బెత్తంలో వాటిని కొట్టగా అవి రాళ్ళై పోయాయి దిగ్భ్రమ చెంది, అతను చూస్తుండగానే, ముసలి మంత్రకత్తె, చప్పున కిందికి దిగివచ్చి ఆ బెత్తం తోనే ఒకటి కొట్టి రాముణ్ణి కూడా రాయిని చేసేసింది రాముడు రాయిగా మార గానే మర్రి చెట్టు మొదట నాటిన తులసి చెట్టు వాడు బట్టింది సంవత్సరం గడుపు తీరి పోగానే లక్ష్మణుడు అక్కడికి వచ్చి వాడిన చెట్టును చూసి, రాముడు ఆపదలో ఉన్నాడని గ్రహించాడు వెంటనే తాను దక్షిణ దిశగా పయనించి పట్టణంలో దిగాడు కొన్ని రోజులుగా రాజకుమారుడు కనిపిం చడం లేదన్న దిగులుతో ఉన్న జనులు లక్ష్మణుణ్ణి చూసి రాముడే అనుకుని రాజు గారి దగ్గరికి సకల మర్యాదలతో తీసుకు వెళ్ళారు రాజు తన అల్లుడే అనుకున్నాడు రాకుమార్తె కూడా, తన భర్త అనుకుని పాదాలకు మ్రొక్కబో యింది ఆమెని తన వదిన గారిగా గుర్తించి, ప్రసంగ వశాత్తు తన అన్న వేటకు వెళ్ళినట్లుగా గ్రహించి, తాను తిరిగి వేటకు వెళ్ళ వలసిన వ్రతము న్నదని చెప్పి వెంటనే లక్ష్మణుడు ఉత్తర దిశగా వేటకు ప్రయాణం కట్టాడు అన్నకు జరిగినట్లే అంతా తనకూ జరిగి, ముసలి మంత్రకత్తె, పులీ, ఎలుగు పిల్లలను కొట్టమని బెత్తం పడేసింది ఇందులో ఏదో మర్మమున్నదని గ్రహిం

చిన లక్ష్మణుడు బెత్తం చేతబుచ్చుకుని, ముసలిదాన్ని బెదిరించి కిందికి దింపి, అంతకు ముందు రాళ్ళుగా ఆమె మార్చిన వారినందరినీ ఆమె చేతనే మనుష్యుల్ని చేయించాడు అన్న, తన జంతువులతో తిరిగి ప్రాణాన్ని పొందడం చూశాక, ఆ బెత్తంతో కొట్టి మంత్రకత్తెను రాయిని చేశాడు అందరూ సుఖంగా తమ తమ యిళ్ళకు చేరుకున్నారు

## తెలివి మాలిన దొంగ

ఒక వెన్నెల రాత్రి ఒక తెలివి తక్కువ దొంగ దొంగతనానికి బయలు దేరాడు ఒక పెద్ద యింట్లో ప్రవేశించి, దొంగతనానికి ఉద్యమించాడు ఆ యింట్లో, ఒకచోట పై కప్పులో నుంచి, చంద్ర కాంతి నేల మీద పడుతూ ఉంది దొంగ తన పై పంచ ఆ కాంతి పడేచోట పరిచి, లోపలి గదులలోనుంచి వస్తువులు సేకరించుకు రావడానికి వెళ్లాడు మెలకువగా ఉన్న యింటి యజమాని, యీ తమాషా చూస్తూ, మెల్లిగా, పిల్లిలాగా, లేచి, దొంగ పరిచిన పై పంచెను, తీసి మడత పెట్టి తల కింద పెట్టుకుని పడుకున్నాడు దొంగ తాను తెచ్చిన వస్తువుల్ని గుడ్డమీద వేస్తున్నాననుకుని ఆ కాంతి మీద పరిచాడు వస్తువులన్నీ తేవడం అయిన తర్వాత, చెంగులు కూడ దీసి మూట కట్టే ప్రయత్నం చెయ్యబోతే చేతికేమీ రావడం లేదు ఇంతలో ఇదంతా చూస్తున్న యజమాని గట్టిగా అరిచేటప్పటికి ఎక్కడి వక్కడే వదిలి దొంగ పరుగెత్తబోయాడు యజమాని ఆ దొంగకు వినబడేట్లుగా, “నువ్వు విడిచి పెట్టి పోతున్న ఈ పంచె నేను వాడుకుంటా గానీ, ఈ సారి వచ్చేట్లయితే మీ చెల్లెమ్మకేదన్నా కట్టుకోడానికి తెచ్చిపెట్టు బావా” అని మేల మాడాడు ఆ విదంగా ఆ తెలివి మాలిన దొంగ తనకున్నది కూడా పోగొట్టుకున్నాడు

## అనుబంధం - 4

# సామెతలూ-నుడి కారాలు

1 ఆవూ దూడా ఊరుకుంటే గుంజార్చినట్లు
2 ఇంటి పేరు కస్తూరి, ఇంట్లో గబ్బిలాల కంపు
3 ఎక్కడ గొట్టినా కుంటడమే కుక్క పని
4 ఎద్దు ఎండకూ ఎనుబోతు నీడకూ లాగినట్లు
5 ఎద్దు తంతుందని గుర్రం వెనకాల దాక్కున్నట్లు
6 ఏనుగు పోతుంటే కుక్కలు మొరిగినట్లు
7 ఏనుగు చచ్చినా బ్రతికినా వెయ్యి వరహాలే
8 ఏనుగు ఎత్తు పడితే ఏనుగే లేపాలి
9 కరవ మంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోపం
10 కాని కాలం వస్తే కర్రే పామై కరుస్తుంది
11 కాశీకి పోయినంత మాత్రాన కుక్క గోవవుతుందా?
12 సింహాసనం మీద కూచో బెట్టినా ఎముక ముక్క పడేస్తే ఎగిరొస్తుంది కుక్క
13 గంగలో మునిగినా కాకి హంస కాబోదు
14 కుక్కను గుర్రంలా పెంచి రెడ్డి తానే మొరిగాడట
15 గుర్రం గుడ్డిదైనా దాణాకు లోపం లేదు
16 గొఱ్ఱె కసాయి వాణ్ణే నమ్మినట్లు
17 చచ్చిన పామును కొట్టడానికి అందరూ మొనగాళ్ళే
18 చీమలు పాకినంత మాత్రాన రాళ్ళరుగుతాయా
19 గొర్రెక్కాపలా కాయడానికి తోడేలు కూలి అడగనట్లు
20 దొంగలు పడ్డ ఆరు నెలలకు కుక్కలు మొరిగినట్లు
21 పశువుల్లేని చోట గొడ్డెనుమే పెద్ద దేవర

22 ముప్పైయ్యేక పోతే మానె కుక్కను కట్టేయమన్నట్లు
23 నెమలి కన్నీళ్ళు పెట్టుకుంటే వేటగాడి కెం జాలి?
24 గుంపులో జేరిన పాము చావు తప్పించుకున్నట్లు
25 పాముకు పాలు పోస్తే కరవక మానుతుందా
26 పిల్లి యజమానికి కళ్ళు పోవాలని కోరితే, కుక్క యజమాని యిల్లు నిండాలని కోరుతుంది
27 పుణ్యం కోసం గంగలో మునిగితే, మొసలి వాత పడ్డట్లు
28 ముందొచ్చిన చెవుల కంటే వెనకొచ్చిన కొమ్ములు వాడి
29 మెతుకు విదిలిస్తే కాకులు కోకొల్లలు
30 మొక్కై వంగందే మానై వంగుతుందా
31 చెట్టులేని చోట ఆముదం చెట్టే మహావృక్షం
32 నెలనంక దక్షిణం కొమ్ము ఎగిస్తే దాన్యం పండుతుంది ఉత్తరం కొమ్మెగిస్తే ఉప్పు పండుతుంది
33 పంచాంగం పోగొట్టుకున్నంత మాత్రాన నక్షత్రాలు పోవు
34 ఎంత పుచ్చినను మిరియాలు జొన్నల సరిగావె?
35 పొద్దున్నే వచ్చే వానా, పొద్దుగూకి వచ్చే చుట్టమూ తొందరగా పోరు
36 పొద్దున్నే వచ్చే వాన, పొద్దున్నే వచ్చే చుట్టము చాలా సేపు ఉండవు
37 గాలీ వానా వస్తే మహావృక్షాలకు బయం కాని గడ్డి పరకల కేం బయం
38 తీరు లేని చదువూ అజమాయిషీ లేని వ్యవసాయం వ్యర్థం
39 వ్యవసాయం చేసే బాపనోడూ, చదువుకునే కాపోడు ఎక్కిరారు
40 మాఘమాసంలో చినుకూ, మగడు లేని ఆడదీ పాటికి రావు
41 మృగశిరం వస్తే మాటాడేందుకు తీరికుండదు
42 మూలా నక్షత్రంలో మూడు పువ్వులకు ఆరుకాయలు
43 మృగశిరలో వానొస్తే పంట తొందరగా ఇంటి కొస్తుంది
44 ఉత్తి గొడ్డుకు అర్పులెక్కువ
45 వాన రాకడా ప్రాణం పోకడా ఎవరికీ తెలియదు
46 వానొస్తే వరి పండుతుంది రాకపోతే జొన్నలు పండుతాయి
47 పులి తరిమినా సరె రాజ దివాణానికి పోవద్దు

48 అందరూ అందలా లెక్కే వారయితే మోసే వారెవరు।

49 రాజుకు ఏలడానికి నాలుగూళ్ళయితే, బిచ్చగాడికి అడుక్కోవడానికి అన్నీ తనవె।

50 రాజుల సొమ్ము రాళ్ళ పాలు

51 తేలుకు కొండెలో విషముంటే రాజుకు కళ్ళల్లో ఉంటుంది

52 రాజును చూచిన కళ్ళు మొగుణ్ణి చూస్తే మొత్త బుద్ధి పుట్టినట్లు

53 బలహీనుడి ఆలి కావడం కంటే బలవంతుడికి బానిస కావడం మేలు

54 ఆలికన్నం పెట్టడం ఊరికుపకారమా?

55 రాజైన కన్న కొడుక్కంటే, బిచ్చమెత్తుకునే మొగుడు మేలు

56 చద్దికూడు తిన్నమ్మ మొగుడాకలి ఎరగనట్లు

57 చదువుకున్న ఆడదాన్నీ వంటచేసే మగాణ్ణి నిబాయించడం కష్టం

58 అతివ పతివ్రతైతే, వెశ్యలింట ఉన్నా పరవాలెదు

59 తా వలచింది రంబ తా మునిగింది గంగ

60 చేసేవి గంగాస్నానాలు, దూరేవి దొమ్మరి గుడిసెలు

61 నెల తక్కువ కాన్పైనా, మగబిడ్డ పుడ్తే పరవాలేదు

62 వృద్ధ నారీః పతివ్రతా

63 తల్లీదండ్రీ బిడ్డచావుకేడిస్తే మోసేవాళ్ళు కూలికేడ్చారు

64 పుణ్యం కొద్దీ పురుషుడూ, దానం కొద్దీ బిడ్డలూ

65 ఉపవాసముంటూ శోబనం ముచ్చట్లు తలచుకున్నట్లు

66 మంత్రసాని దగ్గర మర్మాలు దాచినట్లు

67 మగడు విడిచిన పడతిని మృత్యువు కూడా ముట్టుకోదు

68 మగడు మన్మదుడైనా రంకుటాలికి వక్రబుద్ధి పోదు

69 మొగుడు వదిలిన స్త్రీనీ, నడి నెత్తిన సూర్యుణ్ణీ బరించడం కష్టం

70 విదవరాలి చేతి బిడ్డా ముకుతాడు లేని గొడ్డూ ఒకటే

71 ముద్దు చేస్తే కుక్క మూతి కరుస్తుంది ఆలి చంకకెక్కుతుంది

72 మగడు చచ్చిం తర్వాత తెలివొచ్చినట్లు

73 మగవాడు తిరగక చెడితే, ఆడది తిరిగి చెడుతుంది

74 రాజు మెచ్చిందే చట్టం మొగుడు మెచ్చిందే రంబ

75 రంకు నేర్చింది బొంక నేర్వదా?
76 కుటుంబాన్ని బట్టి పిల్లను, రంగును బట్టి సంతానాన్నీ అంచనా వెయ్యొచ్చు
77 ముండకు మొక్కితే తన్ను బోలి నూరేళ్లు బ్రతకమన్నట్లు
78 సంసారం ఈదడం కన్నా సముద్రం ఈదడం తేలిక
79 చెల్లెలు తనదైనా, బావమరిది పరాయి కదా?
80 అత్త చచ్చిన ఆరు నెల్లకు కోడలు శోకాలు తీసినట్లు
81 గొప్పింట ఆఖరి కోడలయ్యే కంటే బీదింటి పెద్ద కోడలు కావడం మేలు
82 కోడలు నలుపైతే కులమంతా నలుపా?
83 కోడలు గృహప్రవేశం అత్త గంగా ప్రవేశం
84 అన్నం బెట్టే కొంపను తవ్వుకోకు
85 అన్నీ తెలిసిన వాడూ లేడు, ఏమీ తెలియని వాడూ లేడు
86 ఇచ్చే వాడుంటే చచ్చిన శవమైనా లేచి కూచుంటుంది
87 ఇంట గెలవలేని వాడు రచ్చ గెలవలేడు
88 నల్లబాపనోణ్ణి ఎర్ర మాదిగోణ్ణీ నమ్మకూడదు
89 తాను తవ్వుకున్న గోతిలో తానే పడ్డట్టు
90 నిన్ను చెడగొట్టేది నీ నాలుకే
91 ఏదైనా పారేసేటప్పుడు కూడా లెక్కబెట్టి పారెయ్
92 ఒలి తక్కువని గుడ్డిదాన్ని పెళ్లాడితే దొంతి కుండలు నష్టం
93 కలలో పాలు తాగే వాడికి పాత్ర బంగారుదైనా, కంచుదైనా ఒకటే
94 గురువు నిలబడి తాగితే, శిష్యుడు పరిగెత్తి తాగినట్లు
95 గుడి మింగేవాడికి తలుపులప్పడాలు
96 గొడ్రాలికేం తెలుసు బిడ్డ నొప్పులు
97 సిల్కు దారాలతో చీపురు కట్టినట్టు
98 చెప్పులున్నవాడి వెంటా, అప్పులున్న వాడి వెంటా నడవకూడదు
99 అన్నీ జరిగితే జ్వరమంత సుఖం లేదు
100 తన్నుమాలిన దర్మం మొదలు చెడ్డ బేరం

101 శాపాలకు చచ్చేవాళ్ళూ వరాలకు బతికేవాళ్ళూ ఉండరు
102 తింటే గాని రుచి తెలియదు దిగితే గాని లోతు తెలియదు
103 దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడు
104 దొంగలందరూ పెద్దవాళ్ళు కారు పెద్దవాళ్ళంతా దొంగలే
105 నరం లేని నాలుక నాలుగు విధాల పలుకుతుంది
106 రోజూ చచ్చే వాడి కోసం ఎవరేడుస్తారు?
107 నిద్రపోయే వాణ్ణి లేపగలం కాని, నిద్ర నటించే వాణ్ణి లేపగలమా?
108 దానమిచ్చిన పాత్రను బరువు తక్కువన్నట్లు
109 బంధువుల్ని లెక్క చెయ్యకు, మిత్రుల్ని చులకన చెయ్యకు
110 బంతి భోజనంలో మొదటా, ఉద్దెర కష్టానికి చివరా
111 మాంసం తింటామని ఎముకలు మెళ్ళో కట్టుకు తిరుగుతామా!
112 నాలుక అదుపులో ఉంచుకుంటే నాలుగు లోకాల్లో తిరుగులేదు
113 లక్ష నక్షత్రాలైనా ఒక్క చంద్రుడితో సరికావు

# అనుబంధం - 5

# పొడుపు కథలు

1 తోకలేని పిట్ట తొంబై ఆమడ పోతుంది (ఉత్తరం)

2 చాప చుట్టలేరు, నాణేలు లెక్క పెట్టలేరు (ఆకాశం, నక్షత్రాలు)

3 గుప్పెడు పిట్టకు బారెడు తోక (మైనం వత్తి)

4 ఇనప మాను, బంగారు పూలు, వెండి పలాలూ (బాబుల్ చెట్టు)

5 మా తాత రెండెద్దులు తెస్తే అందులో ఒకటెప్పుడూ తిరుగుతుంది
రెండోది తిరగదు (తిరగలి)

6 అనుమకొండ చెరువులో అయిదు స్తంబాలు వాటిని కదిలించవచ్చు
గానీ, పీకెయ్యలేరు (చెయ్యీ, వేళ్ళూ)

7 నీళ్ళు లేని నూతిలో బోగం వాళ్ళ ఆట (కాలే పెనం మీది పేలాలు)

8 ముడ్డి పిసుకు మూతి నాకు (మామిడిపండు)

9 తెల్లని మడిలో నల్లని విత్తనాలు చేత్తో జల్లి నోటితో ఏరాలి (అక్షరాలు)

10 నల్లటి చెరువులో ఎర్రటి తామర (దీపం)

11 ఒంటి నిండా కళ్ళు, ఇంద్రుడు కాదు,
మనిషి సహాయం లేందే కదల లేదు
దానికి ప్రాణం లేదు,
కాని ప్రాణాలు తీస్తుంది (వల)

12 పెట్టె నిండా కెంపులు పెట్టెకు తాళం (దానిమ్మ పండు)

13 ఇక్కణ్ణుంచి చూస్తే ఇనుము
పైకి పాకి చూస్తే బంగారం
తాళం వేసి బందిస్తే ఎన్నోరుచులు (తాటిపండు)

14 అడవిలో పుట్టింది అడవిలో పెరిగింది
మాయింటి కొచ్చింది కుండలో దూరింది
తైతక్కలాడింది తాయిలం తెచ్చింది
తానేమి తినకుండ అందరికి ఇచ్చింది (కవ్వం)

15 మూడు కళ్ళున్నా శివుడు కాదు
చెట్టు చివర ఉన్నా పక్షి కాదు
నీళ్ళతో నిండి ఉన్నా కుండ కాదు (కొబ్బరికాయ)

16 కిట కిట తలుపులు
కిటారి తలుపులు
ఎంత వేసినా
చప్పుడు కావు (కనురెప్పలు)

17 నలుగురు దొంగల మద్య నగల పెట్టె (లవంగం)

18 ఇంత ముండకు ఒళ్ళంతా చీరెలు (ఉల్లిపాయ)

19 చేటెడు సెనగల్లో ఒక్కటే రాయి (చందమామ)

20 భూమికి ఆకాశానికి మద్య పుట్టెడు పుల్లలు (వాన)

21 అమ్మ చీరె మడత పెట్టలేము
నాన్న డబ్బు లెక్క పెట్టలేము (ఆకాశం, నక్షత్రాలు)

# సంప్రదించిన గ్రంథాలు


1 తెలుగుదేశ జనాబా, *1961* వాల్యూమ్ II, పార్ట్ VII-బి,
'పండుగలూ-జాతరలు, ఆంధ్ర ప్రదేశ్',
సంపాదకులు ఎ చంద్రశేఖర్,
2 తెలుగు జానపద సాహిత్యము, డా బి రామరాజు
3 నాట్యకళ, స్పెషల్ నంబర్, ఫిబ్రవరి-మార్చి, 1970,
ఎ పి సంగీత నాటక అకాడమీ, హైదరాబాదు
4 నృత్త రత్నావళి, జయ సేనాపతి
5 గాదా సప్తసతి, కింగ్ హాల
6 తెలుగు ఎన్సైక్లోపిడియా, వాల్యూమ్ II, తెలుగు బాషా సమితి
7 ఇంగ్లీషు-స్కాటిష్ పాటలు, ఎఫ్ జె చైల్డ్
8 బిసో హిల్స్‌లోని రెడ్లు, ఫురూర్ హైమిండ్రాఫ్
9 కుమార సంబవము, నన్నెచోడ రాజు
10 బసవపురాణము, పాల్కురికి సోమనాదుడు
11 పండితారాద్య చరిత్రము, పాల్కురికి సోమనాదుడు
12 అబిలాషితార్ధ చింతామణి, సోమేశ్వర చాళుక్య రాజు
13 ది డాన్స్ ఇన్ ఇండియా, పాబియన్ బౌర్స్
14 బరతుని నాట్య శాస్త్రము
15 పసిడి పతుకులు, ఎన్ గంగాదరము


---


Telugu Leser typesetting at Sairam Computers, CB-108, Naraina Ring Road, New Delhi-28 and printed at Shivam Offset Press, A-12/1 Naraina Ph 1 New Delhi-28